విజ్ఞానచంద్రిక - ౮౦



# ఐరిష్ స్వరాజ్యము



దిగవల్లి వేంకటశివరావు

చెరుకుపల్లి వేంకటప్పయ్య

V

విజ్ఞానచంద్రికాగ్రంథమాల ౪౦.

# అధినివేశ స్వరాజ్యము.

# (DOMINION STATUS)



దిగవల్లి వేంకటశివరావు,
చెరుకుపల్లి వేంకటప్పయ్య.



బెజవాడ : ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
క. కోదండరామయ్యగారిచే ముద్రింపబడినది.
౧౯౩౩

వెల : చందాదారులకు మేలుప్రతి } ౦—౮—౦.
ఇతరులకు సాదాప్రతి }

ఇతరులకు మేలుప్రతి ౦—౧౨—౦

వలయువారు:—

దిగవల్లి వేంకటశివరావు,

బెజవాడ.

అని వ్రాయవలయును.



# పీఠిక.

'డొమినియన్ స్టేటస్', అనగా, అధినివేశస్వరాజ్యమే, భారతదేశరాజ్యాంగాభివృద్ధియొక్క సహజపరిణామ మని భారతదేశ రాజప్రతినిధిద్వారా ౧౯౨౯ అక్టోబరు ౩౧ వ తేదీన బ్రిటీషు సామ్రాజ్యమువారు ప్రకటించి యున్నారు. భారతదేశ రాజ్యాంగసంస్కరణ మింకను పూర్తికాలేదు. చాలా చర్చలు జరిగిన పిదప "మార్పుడల కాలమున గొన్ని రక్షణలు మినహాయింపులతోడి బాధ్యతాయుత ప్రజాపరిపాలనా పద్ధతియు, అట్టి పరిపాలనా పద్ధతిగల రాష్ట్రములును, సంస్థానములును, గలిగిన 'ఫెడరల్' సంయుక్తరాజ్యాంగ విధానము"ను స్థాపించుటకు నిశ్చయించి ఒక రాజ్యాంగ ప్రణాళికను తయారుచేసి యున్నారు.

భారతదేశ రాజ్యాంగ సంస్కరణల స్వరూప స్వభావములను, మంచిచెడ్డలను, బాగుగా గ్రహింపవలె నన్నచో, అధినివేశస్వరాజ్య మనగా నేమో, బ్రిటీషు సామ్రాజ్యాంతర్భాగములగు కెనడా, ఆస్ట్రేలియా, ఐరిషు ఫ్రీస్టేటు, మున్నగు అధినివేశములు, సామ్రాజ్యనాయకమణి యగు ఇంగ్లాండుతో పాటు సరిసమానగౌరవము స్వాతంత్ర్యము గల ప్రజాప్రభుత్వరాజ్యము లెట్లైనవో, ఈ రాజ్యాంగస్థితి కలిగినందువలన నవి పొందుచున్న ప్రయోజనము లెట్టివో, అను సంశయములును, ఈ రాజ్యాంగ పద్ధతికి సంబంధించిన ఇతర రాజకీయ ఆర్థిక విషయములును, ఆంగ్లప్రజాప్రభుత్వ పద్ధతులును, ఫెడ

రలు రాజ్యాంగవిధానము మున్నగు విషయములును, బాగుగా పరిశీలించుట యావశ్యకము. ఈ విషయము లెల్ల ఇంగ్లీషులో వివిధ గ్రంథములందు వెదజల్లబడి యున్నవి. వీని నన్నిటిని క్రోడీకరించి ఆంధ్రులకు సమర్పించుటయే ఈ పుస్తకము యొక్క ఉద్దేశము.

ఈ గ్రంథముతోపాటు భారతదేశ స్వరాజ్యసమస్యను గూర్చియు, రాజ్యాంగచరిత్రను గూర్చియు, ప్రస్తుత ప్రభుత్వ విధానము, స్వదేశసంస్థానముల చరిత్ర, రౌండుటేబిలు ప్రణాళిక, శ్వేతపత్ర ప్రణాళికలను గూర్చియు, ఒక ప్రత్యేక భాగమును వ్రాసితిమి గాని రాజ్యాంగసంస్కరణము లింకను పూర్తి కానందునను, సంస్కరణరాజ్యాంగవిధాన మసుతణా మును మార్పులు జెందుచున్నందునను, దానిని ప్రత్యేకముగా ప్రకటింపదలచినాము.

ఈ గ్రంథరచన ౧౯౩౧ సంవత్సరాంతముననే పూర్తియై యుండెను గాని కారణాంతరములచేత నిది ప్రచురించుట కింత యాలస్యమైనది. దీనిని తమ విజ్ఞానచంద్రికా గ్రంథమాలయందు జేర్చికొని మమ్ము ప్రోత్సహించినందులకు శ్రీయుత అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారికి మా వందనములు.

ఈ గ్రంథమునందుదాహరింపబడిన అంకెలపట్టికలలో దశాంశ భిన్నగణితపద్ధతి *నుపయోగించితిమి.

ఈగ్రంథమువ్రాయు నాటికిని నేటికిని వివిధదేశస్థితిగతులు సూచించు అంకెలుకొంచెము మారినవి; గానిపెద్ద

మార్పులులేవు. ౧౯౩౧ మార్చి ౩౧ తారీఖునాటికి ౧౧౭౧ కోట్ల ౯౬ లక్షలరూపాయలుగా నుండిన భారతదేశప్రభుత్వ ఋణము ౧౯౩౩ మార్చి ౩౧ నాటికి ౧౨౧౨ కోట్ల ౪౫ లక్షలరూపాయ లైనది.

౨౭వ పుటలో 'మూడువంతులు' అనుటకు 'మూవంతు' లని తప్పుపడినది. ౩౦వ పుటలో ౩౨౫౦౦౦౦౦ పౌనులకు బదులు ౩౨౫౦౦౦౦౦౦ అని తప్పుపడినది.

ఈ గ్రంథరచనయందు మాకు ముఖ్యముగా తోడ్పడినట్టియు, గ్రంథవిషయముల నింకను పరిశోధింపదలచువారు చదువదగినట్టియు, గ్రంథరాజములపట్టిక నిందు చేర్చినాము. ఆ యాగ్రంథకర్తలకు మా వందనములు.

| | |
|---|---|
| బెజవాడ,<br>శ్రీముఖ: కృష్ణాపుష్కరం.<br>౧-౮-౩౩. | దిగవల్లి వేంకట శివరావు,<br>చెరుకుపల్లి వేంకటప్పయ్య. |

---

## * దశాంశభిన్నగణితము.

ఈ పుస్తకములోని వివిధదేశస్థితిగతులనుగూర్చిన అంకెలజాబితాలలో సంఖ్యలకు మధ్యనుగాని సంఖ్యలకు ముందుగాని "౫౧.౫; ౪౫.౨౯; .౬౦౮" అని చుక్కగురుతులు పెట్టబడి యుండుట కనబడును. ఈచుక్కను "దశాంశబిందు"వని పేరు. అనగా ఈచుక్కతరువాత నున్నసంఖ్య పూర్ణసంఖ్యకాదనియు నది దశాంశభిన్నము (Decimal Fraction) అనియు తెలుపు గుఱుతు. ప్రతిసంఖ్యకు పదిరెట్లు లెక్కించుట లేక ప్రతిసంఖ్యలో పదియొక్క అంశములను లెక్కించుటయే దశాంశభిన్నగణితములోని మూల

సూత్రము. సామాన్యముగా పూర్ణసంఖ్యలందు ఒకటలస్థానము పదులస్థానము నూర్లస్థానము, వేలస్థానమున నున్న అంకె లొకదానికన్న నొకటిపదిరెట్లధిక విలువను కలిగియుండుటను మనము చూచుచున్నాము. ఉదాహరణము నకు ౧౪౫౨ లో నడినుండి యెడమకు ౨ కన్న ౫, ౫ కన్న ౪, ౪ కన్న ౧, పదేసిరెట్లధిక విలువ కలిగియుండును. ఎడమనుండి కుడివైపునకు వాని విలువ తగ్గుచుండును. అట్లే దశాంశబిందువు తరువాత కుడివైపున నున్న అంకెలయొక్క విలువయు క్రమక్రమముగా ఒక్కొకఅంకెకన్న రెండవ అంకెవిలువ పదేసివంతులు (అంశములు) తగ్గిపోవును. చుక్కతరువాత ఒకే అంకె యున్నచో నది దశాంశము. అనగా పదింట నొకవంతు. రెండంకె లున్నచో నాసంఖ్య శతాంశము. అనగా నూరింట నొకవంతు. మూడుఅంకె లున్నచో సహస్రాంశము. అనగా వేయింట నొకవంతు. ఇట్లే గుణించు కొనుచు పోవచ్చును.

.౫ అనగా పదింట ౫ వంతులు.

.౦౫ ,, నూరింట ౫ వంతులు.

.౦౦౫ ,, వేయింట ౫ వంతులు.

.౨౭ అనగా నూరింట ౨౭ వంతులు.

.౬౦౭ అనగా వేయింట ౬౦౭ వంతులు.

ఇంగ్లీషులెక్కలలో భిన్నముల నిట్లు వ్రాయుదురు. ౫/౧౦; ౫/౧౦౦; ౫/౧౦౦౦; ౨౭/౧౦౦; ౬౦౭/౧౦౦౦.

"౫౧.౫" అను సంఖ్యలో ౫౧ అనునది పూర్ణసంఖ్య. .౫ అనునది దశాంశభిన్నము; అనగా పదింట ౫ వ వంతు. అన్నియుకలిసి, ౫౧ $\frac{౫}{౧౦}$.
"౪౫. ౨౭" అను సంఖ్యలో "౪౫" పూర్ణసంఖ్య. ". ౨౭" శతాంశ భిన్నము; నూరింట ౨౭ వంతులు = ౪౫ $\frac{౨౭}{౧౦౦}$.

---



# అధినివేశస్వరాజ్యము.

విషయానుక్రమణిక.

అధ్యాయము | పుటలు.

---

## వివిధ దేశస్థితిగతుల అంకెల పట్టికల సూచిక.

పట్టిక: పుట.

---

# BIBLIOGRAPHY.


1. Select Constitutions of the World. (Published by the Provisional Government of the Irish Free State. 1922.)
2. The Sovereignty of the British Dominions. Prof: A. B. Keith.
3. Dominion Autonomy in Practice. Do.
4. The Proceedings of the Imperial Conferences 1923, 1926, 1930.
5. The Report of the Dominion Laws' Conference.
6. The Statute of Westminister.
7. An Introduction to Political Science-Gettle.
8. Introduction to Politics. .... Harold Laski.
9. The Law of the Constitution. A. V. Dicey
10. TheConstitutional History of England. Maitland.
11. English Political Institutions. J. A. R. Marriot
12. Parliament. .... .... Ilbert.
13. Canada* .... .... Prof: Alexander Brady.
14. Canada. .... .... J. G. Bourinot.
15. South Africa*.... .... Jan. H. Hofmeyr.
16. South Africa .... .... G. M' call Theal.
17. Ireland* .... .... Stephen Gwynn.
18. The Official Hand Book of the Irish Free State. 1932.

* (Benn's Modern World Series.)

19. The Official Year Book of the Common-wealth of Australia. 1931
20. The Statesman's Year Book. 1932.
21. The Whitaker's Almanack. 1930—1932.
22. The Encyclopaedia Britannica. XIVth Edition.
23. The Gresham's New Cyclopaedia.
24. Harmsworth's History of the World.
25. Wealth of India. .... .... Wadia and Joshi.
26. The Indian Crisis. .... .... Fenner Brockway.
27. Public Finance and Our Poverty. J. C. Kumarappa.
28. Report of The Royal Commission on Agriculture in India.
29. The Simon Committee Report.
30. The Times of India Year Book. 1930—1933.
31. The Congress Report on The Financial Obligations Between Great Britain and India.
32. England's Debt to India .... Lajpat Rai
33. Uuhappy India .... .... Lajpat Rai.
34. Life and Experiences of a Bengali Chemist Dr: P. C. Roy.
35. Poverty and Kindred Economic Problems in India. (Govt. of India.) 1932

---

# అంకితము

నిరంతర ధనసంపాదనకొరకు ఐహిక సౌఖ్యానుభవములకొరకు అధికారగౌరవముల కొరకు పేరు ప్రతిష్ఠలకొరకు, పాకులాడక, ఆడంబరరహితజీవనము నిష్కళంకవర్తనము పరోపకారపారీణత సత్యవ్రతానుష్ఠానము నిర్భయత్వము కార్యదీక్షయు, జీవితాదర్శములుగా గైకొని, తాను బ్రతికియున్న స్వల్పకాలములో తన సర్వశక్తులను ప్రజాసేవకు దేశసేవకు వినియోగించి తన సర్వస్వము, తుదకు ప్రాణముల సైతము ధారవోసిన సాహసి, ఆంధ్రయువకుల కాదర్శప్రాయుడగు పురుషసత్తముడు, జీవించియున్నచో ఆంధ్రదేశ నాయకులం దగ్రగణ్యులలో నొక్కడుగ నుండవలసినవాడు, మాకు చిరకాలమిత్రుడు, మరపురాని వాడు, కీర్తిశేషుడు:

డాక్టరు పెలిదండ్ల హనుమంతరావు పంతులు.

బి. ఏ., ఎల్. ఎం. ఎస్. గారికి.

౧

# అధినివేశ స్వరాజ్యము:

౧

బ్రిటీషు లేక ఆంగ్లసామ్రాజ్యాంతర్భాగము లగు కెనడా డొమినియను, ఆస్ట్రేలియా కామన్వెల్తు, దక్షిణాఫ్రికాసమితి, న్యూజీల్యాండు, న్యూఫౌండ్లాండు, ఐరిషు ఫ్రీస్టేటు, రాజ్యములయొక్క రాజ్యాంగ విధానమునకే అధినివేశ (డొమినియను) రాజ్యాంగమని పేరు. ఈరాజ్యాంగస్థితికి "డొమినియను స్టేటసు" అని వాడుచున్నారు. "డొమినియను" అను ఆంగ్లపదమునకు "రాష్ట్రము," "రాజ్యము" అని అర్థము. అయితే పైన చెప్పబడిన రాజ్యములలో కెనడా డొమినియను క్రీ. శ. ౧౮౬౭ లో స్థాపింప బడినది మొదలు నేటివరకును ఆ రాజ్యమునకును బ్రిటీషు ప్రభుత్వమువారికిని గల పరస్పర సంబంధములు మారిపోయి కెనడాయొక్క ఆంతరంగిక బాహ్యప్రభుత పరిపూర్ణత్వము జెంది రాజ్యాంగమొక నూతనపరిణామమును గాంచినది. దానితోపాటు తక్కిన అధినివేశముల రాజ్యాంగములును పరిపూర్ణస్థితి జెందినవి. ఈ పరిపక్వ రాజ్యాంగస్థితికే పైన చెప్పబడిన 'డొమినియను స్టేటసు' అను పదముల నుపయోగించుట, రాజ్యాంగపరిభాషయందు పరిపాటి యైనది. డొమినియను అనుపదమునకు "అధినివేశరాజ్యము" అను పదము ఆంధ్రమున వాడుకలోనికి వచ్చినది. హిందీభాషలోను, దానికి దగ్గర సంబంధము గల భాషలలోను "ఉపనివేశరాజ్యము" అని వాడుచున్నారు.

ఈ రాజ్యాంగ విధానమును "అధినివేశ స్వరాజ్య"మని వ్యవహరింప వచ్చును.

'డొమినియను' లేక 'అధినివేశరాజ్యాంగ' మను పదమునకు రాజ్యాంగశాస్త్ర పరిభాషయందు వాడుకవలన స్థిరపడిన అర్థమును దానియొక్క ముఖ్యలక్షణములు నిటీవల ౧౯౨౬ లో సమావేశమైన బ్రిటీషు సామ్రాజ్యసభ (Imperial Conference) వారి తీర్మానములం దిట్లు వివరింపబడి రాజ్యాంగధర్మప్రమాణము పొందినవి.

౧. బ్రిటీషుదీవులును అధినివేశములును ఆంగ్లరాజుయొక్క మకుటము నెడల గల భక్తిమాత్రముచేతనే సంశ్లిష్టత కలిగిన బ్రిటీషుజాతులసమ్మేళన మగు బ్రిటీషుసామ్రాజ్యమున స్వేచ్ఛయగు సభ్యతకలిగియున్న సరిసమానభాగములు.

౨. తమ ఆంతరంగిక వ్యవహారములందుగాని విదేశ వ్యవహారములందుగాని ఏవిధముగను ఒకదాని కింకొకటి లోబడవలసిన పనిలేదు.

౩. ఇవి స్వపరిపాలనముగల జనసమూహములు.

౪. సామ్రాజ్యమునందు స్వపరిపాలనముగల ప్రతి రాజ్యాంగమును తన పరిణామమునకు తానే కర్త. స్వరూపమున గాకపోయినను స్వభావమునుబట్టి దాని కెట్టి నిర్బంధమును లేదు.

ఇందువలన బ్రిటీషుసామ్రాజ్యము స్వతంత్ర రాజ్యములసమ్మేళన మను సూత్రము అంగీకరింపబడినది.

అధినివేశ రాజ్యములు స్వరూపమున బ్రిటిషుసామ్రాజ్యాంతర్భాగములే యైనను, స్వభావమున పరిపూర్ణ ప్రభుత్వాధికారములు గల స్వతంత్రరాజ్యము లని తేలుచున్నది. మఱియు నీరాజ్యాంగము లెల్ల స్వపరిపాలనముగల ప్రజాప్రభుత్వముల నియు స్థిరపడుచున్నది.

అధినివేశ స్వరాజ్యతత్వము నెఱుగవలె నన్నచో నేడీరాజ్యాంగస్థితిని పొందియున్న రాజ్యముల పరిపాలనావిధాన మె ట్లున్నది? అందలి ప్రభుత్వాధికారము లెల్ల ఏ రాజ్యాంగ సంస్థయందు నెలకొల్పబడినవి? అందలి ప్రజలకు గల స్వాతంత్ర్యస్వత్వము లెట్టివి? ఈరాజ్యాంగవిధానము ప్రజల కెంతవరకు ప్రయోజనకారియైనది ? అను నంశములు తెలిసికొనవలయును. స్థూలముగ చూచినచో నీరాజ్యాంగముయొక్క మాతృక బ్రిటీషుదీవుల రాజ్యాంగవిధానమే యనియు, అధినివేశములందలి ప్రభుత్వము బ్రిటీషుదీవులందలి ప్రజాప్రభుత్వము వంటిదే యనియు, తెలియగలదు.

## పరిపాలనావిధానము.

అధినివేశరాజ్యము లందలి ప్రభుత్వాధికారములు రాజ్యాంగ "ప్రభుత" (Sovereignty) యు, ఆదేశములలో "పార్లమెంటు" లనబడు ప్రజాప్రభుత్వ సంస్థలందు నెలకొల్పబడి యున్నవి. బ్రిటీషు రాజప్రతినిధియగు గవర్నరు జనరలు లేక గవర్నరును ప్రజాప్రతినిధిసభ, శిష్టసభ యనబడు రెండు శాసనసభలును కలిసిన రాజ్యాంగమునకే "పార్లమెంటు"

అని పేరు. ఈ పార్లమెంటు ప్రభుత్వవిధానము ప్రజాప్రభుత్వ విధానము. అనగా ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రతినిధులు గల శాసనసభలోని అధికసంఖ్యాకపక్షము వారిలో ముఖ్యులే మంత్రిమండలిగ నియమింపబడి ప్రభుత్వమున కార్యనిర్వాహక అధికారము కలిగియుందురు ఈ కార్యనిర్వాహకవర్గము ప్రజాప్రతినిధిసభకు బాధ్యత కలిగి యుండును. ప్రజాప్రతినిధి సభ యొక్క విశ్వాసమును గోల్పోయిన మంత్రులు తమపద వులకు రాజీనామా నిచ్చి తొలగవలయును, లేదా శాసనసభకు క్రొత్త ఎన్నికలు జరుపబడవలయును. అప్పుడు మఱల నీప క్షమువారేగాని ఇతరపక్షమువారుగాని శాసనసభలో అధిక సంఖ్య, బలము, కలిగిన, వారి మంత్రిమండలి రాజ్యము చేయ వచ్చును. ఈ రాజ్యాంగధర్మమువలన ప్రభుత్వము ప్రజాభి ప్రాయమునకు లొంగియుండును. ప్రజలకు వ్యక్తి స్వాతం త్ర్యము, వాక్స్వాతంత్ర్యము, సమావేశ స్వాతంత్ర్య మున్నం దునను పార్లమెంటులోని చర్చ లెల్ల ప్రచురింపబడి ప్రజలవిమ ర్శకు గురియగును గనుకను, శాసనసభలోని ప్రజాప్రతినిధులు ప్రజాభిప్రాయమునకు అనుగుణ్యముగ ప్రవర్తింపవలసి యుందురు. అందువలన శాసనసభలు చేయు శాసనము లెల్ల ప్రజాహితైకములగును. పార్లమెంటులో బ్రిటీషు సార్వభౌమ ప్రతినిధియగు గవర్నరు జనరలుగాని గవర్నరుగాని అధి నివేశమంత్రుల సలహా ననుసరించియే బ్రిటీషు సామ్రాజ్య ప్రభుత్వమువారివలన నియమింపబడును. బ్రిటీషు సార్వభౌ ముడు సాధారణముగ ఇంగ్లాండులోని ప్రభువునుగాని, ఇతరుని

గాని రాజప్రతినిధిగ నియమించుట ఆచారమైనది. కాని అధినివేశములోని వానినెవ్వనినైన నియమించుట కెట్టి ఆటంకము నులేదు. గవర్నరు జనరలుగాని గవర్నరుగాని బ్రిటీషుసార్వభౌముని రాజరికచిహ్నమును సూచించు రాజప్రతినిధిగనేయుండి ఇంగ్లాండులోని రాజువలెనే మంత్రిమండలియొక్క సలహానను సరించి రాజ్యాంగధర్మములకు బద్ధుడై ప్రవర్తించునేకాని బ్రిటీషుప్రభుత్వమువారి యొక్క ప్రతినిధిగా నిరంకుశుడై ప్రవర్తింపడు. అధినివేశరాజ్యాంగము లెల్లపరిపూర్ణమగు నాంతరంగికప్రభుతను కలిగి యున్నవని చెప్పవచ్చును. ఈరాజ్యాంగములకు సంపూర్ణ నిర్ణిరోధ శాసనాధికారము కలదు. శాసనమువలన తన రాజ్యాంగస్వరూపమునందు మార్పులు చేసికొనుటకు ప్రతి అధినివేశమునకును హక్కు గలదు. తన దేశజాతీయతను అంకలి జనుల పౌరస్వత్వములను నిర్ణయించుకొనుటకును దేశములోని సర్వజనులపైనను సంపూర్ణాధికారములు కలిగి యుండుటకు నెట్టి యాటంకములు లేవు. తమ కనిష్టులగు నితర జాతులవారు దేశములోనికి రాకుండగ వలసను నిషేధించు హక్కు కలదు. దేశములోని ప్రతివ్యక్తియొక్క సామాన్య (Personal) ధర్మములకు సంబంధించిన వ్యవహారము లెల్ల పరిష్కరించుట కధికారము కలదు. మఱియు రాజ్యమునందలి భూములకు సంబంధించిన వ్యవహారము లెల్ల నిరాటంకముగ వ్యవహరించుకొను హక్కుగలదు. వర్తకమును గూర్చియు చలామణిని గూర్చియు, తమ తమ దేశములకు వలసిన కట్టుబాట్లు చేసికొనుటకును హక్కుగలదు. వాణిజ్యనౌకావ్యవ

స్థను వ్యవహరించుకొను నధికారము దేశరక్షణకు శాంతి భద్రతలకు క్రమపరిపాలనమునకు వలసిన కట్టుబాట్లు చేసికొనుటకు పరిపూర్ణాధికారములు కలవు. మతసంబంధములైన వ్యవహారములు స్వతంత్రముగ చక్కబెట్టుకొను నధికారము కలదు. పైన చెప్పబడిన విషయములనుగూర్చి అధినివేశములందలి ప్రజాప్రతినిధుల శాసనసభలు స్వేచ్ఛగా నిర్నిరోధముగా శాసనములను జేయును. ఆ శాసనసభలకు బాధ్యత కలిగిన కార్యనిర్వాహకవర్గము లీ శాసనములను పరిపాలించును.

ధర్మపరిపాలన:—అధినివేశరాజ్యము లందలి ధర్మపరిపాలనము ఉన్నత న్యాయసభలందు నెలకొల్ప బడినది. మంత్రిమండలివారు సూచించినవారియందు త్తములైన వారిని గవర్నరుజనరలుగాని, గవర్నరుగాని న్యాయాధిపతులుగ నియమించును. సత్ప్రవర్తన కలిగియుండునంతకాలము వా రా పదవులం దుండుదురు. ఉభయశాసనసభలు కోరిననే రాజప్రతినిధి వారిని తీసివేయుటకు వీలు కలదు. వారివేతనములు పార్లమెంటువారివలన నిర్ణయింపబడి ఒసగబడుచున్నవి. అందువలన న్యాయాధిపతులు నిర్భయులై స్వతంత్రులై ధర్మమును పరిపాలింతురు.

అధినివేశములందలి సామాన్య సివిలు క్రిమినలు న్యాయసభల న్యాయాధిపతుల స్వాతంత్ర్యములు గూడ ఆయారాజ్యాంగ చట్టములలోనే స్పష్టీకరింపబడినవి. కెనడా

రాజ్యాంగ చట్టమువలన (౯౬-౧౦౧ శెక్షనుల జూడుడు) అధినివేశమంత్రుల సలహాపైన గవర్నరుజనరలే రాష్ట్రము లందలి ఉన్నతన్యాయసభల యొక్కయు జిల్లాలయొక్కయు న్యాయాధిపతులను నియమించును. న్యాయాధిపతులు సత్ప్ర వర్తన కలిగినంత కాలము ఉద్యోగము చేయవచ్చును. డొమినియను పార్లమెంటుయొక్క ఉభయసభలవారును కోరి నప్పుడున్యాయాధిపతులను వారిపదవులనుండి తొలగింపవలెను. వారి వేతనము లెల్ల కెనడాపార్లమెంటువారివలననే నిర్ణయింప బడి ఒసగబడుచున్నవి. కెనడాపార్లమెంటువారు ధర్మపరి పాలన కావశ్యకములైన నూతన న్యాయసభలను నిర్మించి వాని అధికారములను వ్యవహారవిధానమును గూర్చిన శాస నములును చేయవచ్చును. ఆస్ట్రేలియా దక్షిణాఫ్రికా రాజ్యాం గములందును తక్కినరాజ్యాంగములందుకూడ నీనియమములు స్పష్టీకరింపబడినవి.

ఆస్ట్రేలియా రాజ్యాంగమున ౮౦ వ శెక్షనులో కామన్వెల్తు రాజ్యములోని ఏశాసనము ప్రకారము ఆరోపింపబడిన నేరము కొరకైనను చేయువిచారణలు నేరము జరిగిన రాష్ట్రములోనే జూరీవిధానము ప్రకా రమే జరుప బడవలయు నని స్పష్టముగా శాసింపబడినది. తక్కిన అధినివేశములం దట్లు స్పష్టీకరింపబడకపోయి నను ఆచారప్రమాణమును బట్టి క్రిమినలు విచారణలం దెల్ల న్యాయసభలయందు “జూరీపద్ధతి” (అనగా సాక్ష్యము విని ముద్దాయి దోషి యగునా కాదా యని నిర్ణయించుటకు

పండ్రెండుగురు పెద్దమనుష్యులను న్యాయసభలయందు పరివేష్టింపజేయు పద్ధతి నెలకొల్పబడి స్థిరపడినది. ఇక అధినివేశములందు సివిలు క్రిమినలు వ్యవహారములం దమలు జరుగు ధర్మశాస్త్ర మెట్టిదని యోజించినచో అది ఆంగ్లదేశమున చిరకాలమునుండి వర్ధిల్లి పరిపూర్ణతజెందిన ఆంగ్లదేశపుసామాన్య ధర్మమే. అయితే అధినివేశములం దితరజాతిప్రజలున్నచోటుల ఆయాప్రజల సొంతఆచారధర్మములుకూడ న్యాయధర్మము ననుసరించి గౌరవింపబడి ఆంగ్లధర్మమున మిళితమగుచున్నవి. భరతఖండమునందలి హిందూమహమ్మదీయ ధర్మములవలెనే కెనడాలోని ఫ్రెంచి ధర్మమును దక్షిణాఫ్రికాలోని రోమకడచ్చి ధర్మములును కొందర ప్రజలపట్ల ఆచరణమున గలవు. తక్కిన (సివిలు క్రిమినలు) దండవిధి వ్యవహారధర్మములు అభియోగవిచారణపద్ధతు లెల్ల ఇంగ్లాండుదేశపద్ధతులకు చెందినవే. దక్షిణాఫ్రికాలో ఆదిమవాసులజాతివారి కొక ప్రత్యేకోన్నత న్యాయస్థానము నెలకొల్పబడినది. వారి స్వధర్మములలో కొన్ని ఆచరణయందు గౌరవింపబడును గాని వారికిని తెల్లవారికిని న్యాయపరిపాలనలో చాల తారతమ్యము కలదు. ఇట్లే కెనడాలో ఎఱ్ఱయిండియనులను గూర్చిన ధర్మములు పరిపాలింపబడుచున్నవి.

బ్రిటీషు అధినివేశ ప్రజలకు గల పౌరస్వత్వములును స్వాతంత్ర్య స్వత్వములును బ్రిటీషుదీవుల ప్రజలకు గలిగినట్లే ఆచారప్రమాణములవలన న్యాయాధిపతుల తీర్పుల వలన స్పష్టీకరింప బడియున్నవి. దేశములోని ప్రజలను అక్ర

మముగ నిర్బంధింపరాదు. వారికి వాగ్రచనా ముద్రణ ప్రకటన స్వాతంత్ర్యము సమావేశ స్వాతంత్ర్యము కల వను సూత్రములు ఆచరణప్రమాణమువలనను న్యాయాధిపతుల తీర్పుల వలనను అధినివేశప్రజల కేర్పడియున్నవి. ఇతర స్వాతంత్ర్యస్వత్వము లెన్నో కలవు. ఆ యా అధినివేశములందలి ప్రజాప్రభుత్వములు తమ తమ ప్రజలపట్ల నిరంకుశముగ ప్రవర్తింపజాలవు. ప్రజలకు గల స్వాతంత్ర్యస్వత్వములను తీసివేయుటకు గాని తగ్గించుటకు గాని ప్రయత్నింపవు. ప్రాతయధినివేశములగు కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, న్యూజీలాండు, న్యూఫౌండ్లాండు రాజ్యములందలి ప్రజలకు గలసామాన్య అనిర్దిష్టస్వాతంత్ర్యములతో తృప్తిజెందక ౧౯౨౨ లో స్థాపింపబడిన ఐరిషుఫ్రీస్టేటువారు తమ నూతనరాజ్యాంగమునందు తమ దేశపౌరులు తక్కిన సామ్రాజ్యపౌరులతో సరిసమానులని స్పష్టీకరించుటయే గాక తక్కిన అధినివేశరాజ్యాంగములలో లేని సార్వజనిక స్వత్వములను గూడ నుదాహరించి యున్నారు.

పరిపూర్ణ ప్రభుత :

అధినివేశములు బ్రిటీషు దీవులతో సరి సమానగౌరవము గల రాజ్యములని అంగీకరింపబడి, ఐరోపాసంగ్రామపు దినములనుండియు నవి సామ్రాజ్యవ్యవహారములందును అంతర్జాతీయ వ్యవహారములందును పాల్గొనసాగినవి. అంతర్జాతీయ సమయములందు చేవ్రాళ్లు చేసి విదేశములందు దమ

ప్రతినిధుల నంచుకొన సాగినవి. లీగ్ ఆఫ్ నేషన్సులో ప్రపంచములోని ఇతరస్వతంత్రరాజ్యములతో సమానమగు సభ్యత కలిగి ప్రపంచరాజ్యాంగ ధర్మనిర్వహణమున పాల్గొన సాగినవి.

ఇట్టి యుత్కృష్టగౌరవము ననుభవించుచున్నను పాదుదేశమగు ఇంగ్లాండు తన సామ్రాజ్యాధికారములను చలాయింప గలుగుటయు, కొన్ని విషయములలో ఆంగ్లమంత్రుల సలహాపైన అధినివేశముల శాసనములను ఆపుటకు, నిరాకరించుటకు ప్రత్యాఖ్యచేయుటకు గవర్నరు జనరలు కధికారముండుటయు, కొన్ని శాసనములు చేయుటకు ఆంగ్లపార్లమెంటు ప్రభుత్వమున కధికారము నామమాత్రావశిష్టముగానైన నిలిచియుండుటయు, అధినివేశరాజ్యములకు అగౌరవకరముగ తోచెను. ముఖ్యముగా దక్షిణాఫ్రికావారు దీనినిగూర్చి తగవులాడసాగిరి. ఐరిష్ఫ్రీస్టేటువారును పోరాడి చట్టమునందు తమ స్వాతంత్ర్యమును స్పష్టీకరించుకొనిరి. ఇట్లు తగవులాడుటకన్న వీని బంధములు సడలించి ఐచ్ఛికమగు స్వతంత్రరాజ్య సమ్మేళనముగా నుండుటయే లాభకరమని తలంచి ౧౯౨౬ లో సామ్రాజ్యసభవారు పైన చెప్పబడినట్లు అధినివేశ స్వరాజ్యమును గూర్చిన తీర్మానముల గావించి అధినివేశములకు స్వతంత్ర రాజ్య గౌరవములను శాస్త్రరీత్యా కలిగింపదలచిరి.

అధినివేశ స్వరాజ్య పరిణామమునుబట్టి ఆయా అధినివేశరాజ్యము లిష్టపడి బ్రిటీషుసామ్రాజ్యమున నిలిచి

యున్న వేగాని వాని కిష్టము లేనిచో దానినుండి విడిపోవుట కెట్టి యాటంకములు లేవని రాజనీతిజ్ఞు లంగీకరించుచున్నారు.

ఈ రాజ్యాంగ సిద్ధాంతము లెల్ల మొన్న మొన్నటి వరకును ఎచ్చటను వ్రాయబడి యుండనందునను, పూర్వము నాటి బ్రిటీషు సామ్రాజ్య రాజ్యాంగాచారము లింకను నిలిచి యున్నందునను, అధినివేశముల స్వాతంత్ర్యగౌరవములకు భంగముగా నున్నదనియు, బ్రిటీషు పార్లమెంటువారే ఈ అధినివేశస్వరాజ్యము యొక్క స్వాతంత్ర్య గౌరవములను నిర్వచించుచు నొకశాసనము చేయవలసినదనియు, ౧౯౨౬ వ సంవత్సరములో సామ్రాజ్య సంబంధములకమిటీవారును డొమినియనులాస్ కమిటీవారు చేసిన సూచనల ప్రకారము ౧౯౩౧ డిశంబరు ౧౧ వ తేదీన 'స్టాట్యూట్ ఆఫ్ వెస్టుమినిస్ట' రను సుప్రసిద్ధచట్టము చేయబడినది. దీనివలన అధినివేశ స్వరాజ్యము శాసనరూపము దాల్చినది. ఈ శాసనము యొక్క ఫలితముల నిట్లు సంక్షిప్తముగా చెప్పవచ్చును.

౧. అధినివేశముల పార్లమెంట్లువారు చేయుశాసనములను ఆంగ్లరాజు పేరున బ్రిటీషు దీవుల మంత్రులు ప్రత్యాఖ్య (వీటో) చేయరాదు.

౨. అధినివేశముల పార్లమెంట్లు చేసినశాసనములకు పూర్వమువలె గవర్నరు జనరలు అంగీకారము కావలసిన పనిలేదు. మరియు నతడు పూర్వమువలె వానిని ప్రత్యాఖ్య

చేయరాదు. బ్రిటీషుమంత్రుల అనుజ్ఞకొరకు నిలిపియుంచ రాదు.

3. అధినివేశములు తమరాజ్యపు టెల్లలలో మాత్ర మేగాక అన్ని ప్రదేశములకును అందరి ప్రజలకును వర్తించు నట్లు శాసనములను జేయవచ్చును.

౪. అధినివేశ ప్రభుత్వ కార్యనిర్వాహక వర్గమువారు విదేశములతో నెట్టి సంధిసమయముల నైనను జేయవచ్చును. అది బ్రిటీషుప్రభుత్వమునకు అననుకూలమైననుకూడ నట్లు చేయవచ్చును.

౫. బ్రిటీషునృపాలుడు విదేశములతో యుద్ధము ప్రక టించినను నేడు అధినివేశములు తటస్థములుగా నుండవచ్చును. మఱియు తక్కిన సామ్రాజ్యాంతర్భాగములకు లేకుండ ఒక్క అధినివేశమునకు మాత్రమే ఏ విదేశ ప్రభుత్వ మైన నేదైన లాభము కలిగించినచో దానిని నిరాక్షేపముగా పొందవచ్చును.

౬. ఏ అధినివేశమును గూర్చియు బ్రిటీషు పార్లమెం టువారిక నేశాసనమును స్వయముగా చేయరాదు.

౭. అధినివేశ ప్రభుత్వములు తమ రాజ్యతంత్ర ప్రతి నిధులను (Diplomatic Agents) కాన్సలులను ఇతరదేశము లందు నియమించుకొనవచ్చును.

౮. ఇంకను గవర్నరుజనరలు నియమింపబడుచున్నం దునను అధినివేశముల మంత్రుల యభీష్టానుసారముగనే అతడు

నియమింపబడు ఆచారము వచ్చినది. ఈ మంత్రివర్గమువారి యిష్ట మున్నంతకాలమే అతఁడాపనియందు నిలిచియుండును. (ఈ అధికారమును బట్టియే ఐరిషుఫ్రీస్టేటు గవర్నరుజనరలు నిటీవల మాన్పించిరి) అధినివేశములప్రభుత్వములు బ్రిటీషు ప్రభుత్వముతో తిన్నగనే ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుకొను నుగాని పూర్వమువలె గవర్నరుజనరలుద్వారా జరుపవు.

౯. నేడు ఇంగ్లాండులోని ప్రీవీకవున్సిలుకు అధినివేశములనుండి పోవుచున్న అప్పీళ్లపైన నాసంస్థకు గల స్వల్పపు టధికారముగూడా మాన్పి, వేరే అప్పీలుకోర్టులను నిర్మించు కొనుటకు అధినివేశముల కవకాశము కలిగినది.

౧౦. అధినివేశములందలి ప్రజలకు పూర్వమువలె ఆంగ్ల నృపాలుడు, బ్రిటీషు పార్లమెంటువారు, బిరుదుల గౌరవముల నిచ్చు పద్ధతి, అపరాధములు విధించు పద్ధతి గాక నేడు అధినివేశములకే ఆ యధికారము లేర్పడినవి.

౧౧. అధినివేశములు తమరాజ్య రక్షణము కొరకు సరిహద్దులను బందోబస్తు చేసికొని, తమయిష్టప్రకారము సైనికులను చేర్చుకొని, వాయువిమానబలములను సిద్ధపరచుకొనవచ్చును. దీనినిగూర్చి బ్రిటీషుమంత్రులు జోక్యము కలిగించు కొనరాదు.

౧౨. బ్రిటీషుమంత్రులే యధినివేశరాజ్యములలోనికి తమ సైన్యములను పంపుటకు హక్కు లేదు.

---

## ౨

# బ్రిటీషు సామ్రాజ్యస్వరూప స్వభావములు.

బ్రిటీషుసామ్రాజ్యము స్వరూపమునందు ప్రపంచ భూభాగమున నాలుగవవంతు భూమియు జనసంఖ్యయు కలిగి, వివిధదేశములు జాతులు కలిసిన గొప్పరాజకీయ సంస్థ. ఆర్థికముగ నిది విశేషధనవంతముగ నున్న గొప్పవర్తకసంస్థ. సాంఘికముగ వివిధజాతిమతములకు బుట్టినిల్లు. రాజ్యాంగ స్వరూపమున నిది వివిధరాజ్యముల సమ్మేళనము. సామ్రాజ్యమునందలి ప్రధానరాజ్యము - సార్వభౌమ ప్రభుత్వము బ్రిటీషుదీవులవారిదే. ఇంగ్లాండు వేల్సు స్కాట్లాండు ఉత్తర ఐర్లాండు దేశములే బ్రిటీషుదీవులు. వీని ప్రభుత్వమే సామ్రాజ్యప్రభుత్వము.

స్వభావమునుబట్టి బ్రిటీషు సామ్రాజ్యము మొదట స్వప్రయోజక నిరంకుశ సామ్రాజ్యమే యైనను నేడది రెండువిధములుగ నున్నది. బ్రిటీషుదీవులకును అధినివేశము లనబడు కెనడా ఆస్ట్రేలియా దక్షిణాఫ్రికా న్యూజిలాండు న్యూఫౌండ్లాండు ఐరిషు ఫ్రీస్టేటు రాజ్యములకును గల పరస్పర సంబంధములనుబట్టి చూచినచో నిది స్వతంత్రజాతుల సమ్మేళనముగా కనబడును. బ్రిటీషుదీవులకును తక్కిన సామ్రాజ్య భాగములకును గల సంబంధములను బట్టి చూచినచో నిది నిరంకుశసార్వభౌమపరిపాలనముగనే తోచును.

బ్రిటీషుదీవుల ప్రజాప్రభుత్వసంస్థయగు "పార్లమెంటు" వారికే సామ్రాజ్యమునం దెల్ల పరిపూర్ణ ప్రభుత్వాధి కారములు కలవు. వివిధరాజ్యభాగముల నేలుటకు వీరే రాజ ప్రతినిధుల నంపుదురు. వివిధరాజ్యము లెల్ల బ్రిటీషుదీవుల రాజు పేరిటనే పరిపాలింపబడుచున్నవి. అయితే అన్ని దేశము లందును సామ్రాజ్య ప్రభుత్వమువారి అధికారము లొకే తీరున లేవు.

పైన చెప్పబడిన అధినివేశములందు బ్రిటీషు దీవుల ప్రభుత్వమువా రేయధికారములను చలాయింపరు సరికదా సామ్రాజ్య వ్యవహారములం దెల్ల అధినివేశ ప్రభుత్వము లతో కార్యాలోచనము చేయుచుందురు. అవి సంపూర్ణస్వరా జ్యముకల స్వతంత్రప్రజాప్రభుత్వ రాజ్యములుగ నున్నవి.

బ్రిటీషు సామ్రాజ్యమున నింకొక తరగతికి జెందిన వలసరాజ్యములు కొన్ని కలవు. వాని రాజ్యాంగమున అధిక మగు ఆంతరంగిక స్వపరిపాలనము కలిగి, అవి కొన్ని విషయ ములందు మాత్రము బ్రిటీషు సామ్రాజ్యమువారి సార్వభౌమ ప్రభుత్వాధికారములకు లోబడును. మాల్టా, దక్షిణ రోడీ సియారాజ్యము లిట్టివే. మూడవ తరగతికి జెందిన రాజ్య ములు ప్రభుత్వవలసరాజ్యములు, లేక "క్రవును కాల నీలు." వీనికి బాధ్యతాయుత స్వపరిపాలనము లేదు. వీనిని పరిపాలించు గవర్నరులు పైన చెప్పబడిన రాజ్యములందు వలె రాజ్యాంగధర్మబద్ధులుగ నుండరు. వీని కార్యనిర్వాహక

వర్గములు శాసనసభలకు బాధ్యత కలిగి యుండవు. వీని ప్రభుత్వములు ఇంగ్లాండులోని వలసరాజ్యాంగ మంత్రిహస్తగతమై యుండును. ప్రజాప్రతినిధులు కూడ శాసనసభలయందున్నను వారికి పరిపాలనమునందు పలుకుబడి లేదు. మొన్నమొన్నటివరకు సింహళమును, ఆస్ట్రేలియాపైన ఆధారపడిన రాజ్యమగు పాపువా దీవి, నార్ఫోకు దీవియు, న్యూజీలాండుపైన నాధారపడిన డాగ్ దీవులు నిట్టివే. ఇక భరతఖండమునకు స్వపరిపాలనా విధానము లేనే లేదు. ఈ దేశము బ్రిటీషు నృపాలుని పేరిట పరిపాలింప బడుచు ఇంగ్లాండులోని పార్లమెంటుసభకు బాధ్యుడగు ఇండియా రాజ్యాంగ మంత్రిగారి అధికారమున గలదు. ఇచ్చట పరిపాలనము జేయు గవర్నరుజనరలును, ఆయన కార్యనిర్వాహక సంఘమును బ్రిటీషుసామ్రాజ్య ప్రభుత్వమువారికే బాధ్యులుగ నుందురుగాని, ఇచ్చటి శాసనసభలకు బాధ్యులు కారు. రాష్ట్రములందలి గవర్నరుల ప్రభుత్వమున శాసనసభకు బాధ్యులుగ నుండు మంత్రులవశమున కొన్ని ప్రభుత్వశాఖలున్నను నిజముగ ప్రభుత్వాధికారములు ప్రజాప్రతినిధులకు లోబడలేదు. బ్రిటీషుసామ్రాజ్యమువారీదేశముపైన నిరంకుశ సార్వభౌమత్వాధికారములు కలిగి యున్నారు. పైన చెప్పబడిన సామ్రాజ్యాంతర్భాగములుగాక బ్రిటీషుసామ్రాజ్యము వారిసంరక్షణమునగల సంరక్షితరాజ్యములును (Protectorates) దక్షితరాజ్యములును (Protected States) లీగాఫ్ నేషన్సు వారి ఫర్మానావలన బ్రిటీషు సామ్రాజ్యమువారి వశమున

నంచబడిన ఫర్మానా రాజ్యములు (Mandated territories) ను కలవు.

బ్రిటీషుసామ్రాజ్యము స్వభావమునుబట్టి ప్రపంచమునం దద్వితీయవర్తకసామ్రాజ్యమని చెప్పవచ్చును. ప్రపంచమునందలి నాలుగవవంతు అర్థసంపదయు జనసంఖ్యయు కలిగిన మహారాజకీయసమ్మేళనము, వాణిజ్యపరిశ్రమలయందగ్రగణ్యమగుటలో నాశ్చర్యము లేదుకాని ఒకలక్ష చదరపుమైళ్ళవైశాల్యమును నాలుగుకోట్లడెబ్బదివేల ప్రజలునుగల బ్రిటీషుదీవులు అఖండసామ్రాజ్యమునకు శిఖామణి యగుటయు ఆర్థికముగగూడ తక్కిన అన్నిభాగములకంటె ధనవంతమును బలవంతము నగుటయు వాణిజ్యపరిశ్రమలందు ప్రపంచమునందలి అన్ని దేశములను మించుటయు నాశ్చర్యజనకము.

బ్రిటీషుదీవుల మొత్తము ఎగుమతి దిగుమతి వ్యాపారము ప్రపంచములోని అన్ని దేశములకన్న నధికముగ నున్నది. అధినివేశముల వ్యాపారముతో గలిసినచో ప్రపంచములో సగము వ్యాపారము బ్రిటీషుసామ్రాజ్యము వారిదే. ఒక పారిశ్రమికవస్తువుల ఎగుమతుల వ్యాపారమును జూచినను ప్రపంచ వ్యాపారములో నూటికి ౨౫.౫ వంతులు బ్రిటీషుదీవులదే.

| దేశము | ౧౯౧౩ లో పారిశ్రామిక వస్తువుల ఎగుమతి ప్రపంచ ఎగుమతిలో నూటికి ఎన్నివంతులు | ౧౯౨౪ లో ఎన్ని వంతులు? |
|---|---|---|
| బ్రిటీషుదీవులు | ౨౯.౦ | ౨౪.౪ |
| అమెరికా | ౧౧.౨ | ౧౪.౮ |

| | | |
|---|---|---|
| జర్మని | ౨౩.౨ | ౧౪.౨ |
| ఫ్రాన్సు | ౧౧.౭ | ౧౧.౪ |
| ఆస్ట్రియా, జకోస్లావికా, యుగోస్లావికా | ౩.౩ | ౫.౨ |
| ఇటలీ | ౨.౬ | ౩.౯ |
| బెల్జియము | ౪.౧ | ౩.౪ |
| జపాను | ౧.౯ | ౪.౦ |
| స్విట్జర్లాండు | ౨.౯ | ౨.౯ |
| కెనడా | ౧.౩ | ౨.౭ |
| భరతఖండము | ౨.౫ | ౨.౭ |
| నెదర్లాండు | ౨.౬ | ౨.౩ |
| ఇతరదేశములు | ౪.౭ | ౬.౪ |
| మొత్తము ప్రపంచములో ఎగుమతి | ౧౦౦ | ౧౦౦ |

బ్రిటీషు సామ్రాజ్యముయొక్క వాణిజ్యము మహోన్నతస్థితియందున్నదని వారి వాణిజ్యనౌకలసంఖ్యయే తెలుపుచున్నది. ఇందు గూడ బ్రిటీషుదీవులే అగ్రస్థానమలంకరించును. తరువాత అధినివేశములు వచ్చును. రెండును గలిసి ప్రపంచమునందు నాలుగువంతులకన్న నధికబలమును కలిగియున్నవి. ఈ నౌకావ్యవస్థయందు యుద్ధనౌకలు చేరలేదు.

౧౯౨౮ — ౧౯౨౯ వాణిజ్యనౌకలు.

| దేశము | స్టీమర్లు, మోటారునావలు | ఓడలు | మొత్తము అన్నిరకములు | అన్నిరకముల నౌకల వాహకశక్తి (టన్నులు) |
|---|---|---|---|---|
| బ్రిటీషుదీవులు | ౭,౮౧౦ | ౩౯౪ | ౮,౨౦౪ | ౧,౯౮,౭౫౩,౫౦ |
| అధినివేశములు | ౨,౦౩౦ | ౪౪౯ | ౨,౪౭౯ | ౨౯,౦౭,౨౨౩ |

| | | | | |
|---|---|---|---|---|
| అమెరికాసంయుక్తరాష్ట్రములు | ౩,౬౫౩ | ౭౮౨ | ౪,౪౩౫ | ౧,౪౬,౩౩,౪౦౨ |
| ప్రపంచములోని అన్ని దేశములు | ౨౯,౩౮౭ | ౩,౦౨౧ | ౩౨,౪౦౮ | ౬,౬౯,౫౪,౬౫౯ |

ఇట్లే వ్యాపారమును జూచినను ఏపరిశ్రమను జూచినను బ్రిటీషుదీవులు ప్రథమస్థానము నలంకరించుచు సామ్రాజ్యముతో కలిపి ప్రపంచమున అమితబలసంపన్న మగును. సామ్రాజ్యమునందు రాజకీయవిషయమునందువలెనే వర్తక సామ్రాజ్యవిషయమునను బ్రిటీషుసామ్రాజ్య ప్రభుత్వము వారు చాల కట్టుదిట్టములతో పరిపాలించుచున్నారు.

సామ్రాజ్యమునందు అధినివేశ రాజ్యములు మొదట సామంత రాజ్యములుగ నుండెను. అప్పుడు వానికి రాజకీయ స్వాతంత్ర్యముగాని ఆర్థిక స్వాతంత్ర్యముగాని లేకుండెను. సామ్రాజ్యమువారు వానిని నిరంకుశముగనే పరిపాలించిరి. క్రీస్తుశకము ౧౮౬౪ వ సంవత్సరమువరకు నీ వలసరాజ్యములు తమ కొక భార మనియే బ్రిటీషుదీవుల ప్రభుత్వమువారు తలంచుచుండిరి. క్రమక్రమముగ నీ సామ్రాజ్యలాభమును గ్రహించి వీనికి సంపూర్ణస్వాతంత్ర్యము నొసంగి గౌరవించు పద్ధతిని మొదలిడిరి.

నిరంకుశ సార్వభౌమత్వ సిద్ధాంతములు పోయి, స్వతంత్రరాజ్య సమ్మేళన సిద్ధాంతములు వచ్చినంతనే అధినివేశ

ములు సామ్రాజ్యమునందు బ్రిటీషుదీవులతోపాటు సరి సమానభాగములగు స్వతంత్ర ప్రజాప్రభుత్వములుగ నంగీకరింపబడి అందువలని ప్రయోజనమును పొందగలుగుచున్నవి. అధినివేశములకు సంబంధించినంతవరకు పూర్వకాలము నాటి సార్వభౌమసామంత ప్రభుత్వ సంబంధములు వీగిపోయినను నేడు సహకార స్నేహసంబంధములు పెంపొందినవి. మఱియు సామ్రాజ్యము వలన నధినివేశముల కెట్టిలోపములు ఆటంకములు కలుగకపోవుటయెగాక అన్నివిషయములందు సాహాయ్యలాభములు కూడా కలుగుచున్నవి. సామ్రాజ్యము నందలి వివిధభాగముల క్షేమలాభముల కెట్టి భంగము వాటిల్లకుండగ సామ్రాజ్యముయొక్క సాముదాయిక ప్రజాక్షేమమునకు లాభమునకు వలసిన వ్యవహారములం దెల్ల బ్రిటీషుదీవులతోపాటు అధినివేశములుగూడ కార్యాలోచనము చేసి సామ్రాజ్యపరిపాలనమునందు పాల్గొనుచున్నవి. ఆంగ్ల అధినివేశమంత్రులు కలియు సామ్రాజ్య సభయే సామ్రాజ్యప్రభుత్వమున పరమోన్నత మంత్రాలోచనసభయైనది. అందువలన సామ్రాజ్యమునందు భాగస్వాములగు అధినివేశముల కొక విధమగు సామ్రాజ్యభక్తి కలుగుటలో నాశ్చర్యము లేదు. ఇట్లు నేటి సామ్రాజ్యము బ్రిటీషుదీవుల సామ్రాజ్యము మాత్రమేగాక అధినివేశములు కూడా భాగస్వాములైన సామ్రాజ్యముగా నున్నది. బ్రిటీషుదీవుల సంపర్కమే గిట్టని ఐరిషు ఫ్రీస్టేటులోని స్వతంత్ర జాతీయవాదులును, సామ్రాజ్యమునుండి వేరుపడు నుద్దేశముగల దక్షిణా

ఫ్రికా జాతీయవాదులును తప్ప అధినివేశములందలి తక్కిన పక్షములవారు సామ్రాజ్యమునకు వ్యతిరేకులుగారు. సామ్రాజ్యమువలన తమ రాజ్యముల పరువు ప్రతిష్ఠలకు అధికార ప్రభుతలకు నెట్టిలోపములు కలుగకుండగ దానివలన పొందతగినంతలాభము పొందవలయు ననియే అధినివేశముల వారి యూహ. ఇందువలన నీసామ్రాజ్యమును చిరస్థాయిగ జేయునుద్దేశము కొందరు రాజనీతిజ్ఞులందు కలదు. అట్లు చేయవలయు ననియే గాక వీలైనచో సామ్రాజ్యవ్యవహారములను మఱింత గట్టిజేసి ఒకవిధమగు సంయుక్తసామ్రాజ్య ఫెడరలు రాజ్యాంగమును స్థాపింపవలయు ననియు న్యూజిలాండు అధినివేశమంత్రి యొకటి రెండు మారులు సామ్రాజ్య సభయందు కోరెను. దీనికి కారణము లేకపోలేదు. సామ్రాజ్యమువలని ప్రయోజనము పొందుదేశములలో బ్రిటీషు దీవులతరువాత న్యూజిలాండు దేశమే ప్రధానమైనది. ఇందుకు తక్కిన అధినివేశరాజ్య ప్రతినిధు లంగీకరింపలేను, గాని సామ్రాజ్యమును విచ్ఛిన్నము చేయుటకు నిష్టపడరు. నేడు ప్రతిబ్రిటీషురాజనీతిజ్ఞునికి నీయధినివేశములు సామ్రాజ్యమునుండి వేరుపడి పోవునేమో యను భయమే! అందువలన నేవిధముగనైనను సామ్రాజ్యమును నిలువబెట్టదలచి అధినివేశములకు వలసిన గౌరవములు అధికారములు సౌకర్యములు మఱిమఱి వేడుకొనుచు బ్రతిమాలుచు బుజ్జగించుచు నొసగి వానిని తృప్తిపరుప జూచుచున్నారు.

# అధినివేశస్వరాజ్యము.

ఇట్టిసామ్రాజ్యతత్వము బ్రిటీషుదీవులందును అధినివేశములందునుగూడ వర్ధిల్లుటకు కారణము ఆయాదేశములీసామ్రాజ్యము వలన కొంచెముగనో గొప్పగనో పొందుచున్న లాభమే.

సామ్రాజ్యప్రయోజనము:— స్వతంత్రములై బ్రిటీషు దీవులతో సామ్రాజ్యమున నిష్టపడి కలిసియున్నందున అధినివేశములకును బ్రిటీషు దీవులకునుకూడ నిజముగా లాభము లేక పోలేదు. అనేక లాభము లున్నను ముఖ్యమైనవి మాత్రము చూతము.

౧. ప్రపంచమున నాలుగవవంతు దేశము జనసంఖ్య అందుకు తగిన ధనము సైన్యము బలముగల ఈ గొప్ప స్వతంత్రరాజ్య సమ్మేళనముతో ప్రపంచములోని పరరాజ్యములు పోరాడుటకు జంకితీరును. అందువలన నీదేశములకు మంచి సంరక్షణయుండును. అవసరము వచ్చినప్పుడు నిజముగ వైరిబలమును సుకరముగా నిగ్రహింప గలుగు శక్తియుండును.

౨. అంతర్జాతీయ సంబంధములందు సామ్రాజ్యమెల్ల ఒకేరాష్ట్రముగను వివిధరాష్ట్రములుగనుగూడ వ్యవహరించుట కవకాశ మున్నందున సామదానభేదదండోపాయములందు, రాయబారములందు, వివిధ వ్యవహారములందు తక్కిన రాజ్యములకన్న వీనిమాటకు హెచ్చు పలుకుబడియుండును. ఆసందర్భమున తమతమస్వలాభమునుగూర్చిన కట్టుదిట్టములు కూడ చేసికొనుట కవకాశముండును.

3. ధనము, బలము, జనసంఖ్య కావలసిన అన్ని సాము దాయిక విషయములందును సామ్రాజ్య ముపయోగించి ఆర్థిక సాంఘిక అభివృద్ధికి మార్గములను గల్పించును. సహకారపద్ధతి సమిష్టివర్తకము సాముదాయిక అర్థోత్పత్తి, సామ్రాజ్యము నందలి అన్ని దేశములందు నాగరికత సౌఖ్యజీవనము అర్థ సంపదను పెంపొందింప జేయుచున్నవి. అందువలన వర్తక మందును పరరాజ్యము లీసంస్థతో పోటీకి నిలువజాలవు. అధిని వేశరాజ్యముల వర్తకము, రైళ్ళు, తంతులు, నౌకాశ్రయములు పరిశ్రమలు విద్యాభివృద్ధి మున్నగునవి చూచినచో దీని యథార్థము తెలియగలదు.

౪. సామ్రాజ్యమువలన అధినివేశములకు కలుగుచున్న లాభములలో వర్తకలాభ మధికముగనున్నది.

౧౯౨౪-౨౯ సంవత్సరములందు దామాషాగా అధి నివేశములకును బ్రిటీషుదీవులకును బ్రిటీషుసామ్రాజ్యములోని అన్నిభాగములకును జరిగిన ఎగుమతి దిగుమతి వర్తకము ఆయాదేశముల యావత్తు ఎగుమతి దిగుమతి మొత్తములలో నూటికి ఎన్నివంతులుగనున్నదో చూచినచో సామ్రాజ్యము వలన అధినివేశములును బ్రిటీషుదీవులును పొందు వర్తకలా భము తెలియగలదు.

| దేశము పేరు | బ్రిటీషుదీవులనుండి దిగుమతి వర్తకము మొత్తము దిగుమతిలో నూటికి ఎన్నివంతులు | సామ్రాజ్యములో అన్ని భాగములనుండి దిగుమతి వర్తకము మొత్తం దిగుమతి వర్తకములో నూటికిఎన్నివంతులు | బ్రిటీషుదీవులకు ఎగుమతి మొత్తం ఎగుమతిలో నూటికిఎన్నివంతులు | సామ్రాజ్యములోని అన్ని భాగములకు ఎగుమతి మొత్తము ఎగుమతిలో నూటికి ఎన్నివంతులు |
|---|---|---|---|---|
| కెనడా | ౧౭.౩ | ౨౨.౩ | ౩౭.౨ | ౪౪.౪ |
| ఆస్ట్రేలియా | ౪౪.౨ | ౫౭.౪ | ౪౧.౦ | ౫౨.౨ |
| దక్షిణాఫ్రికా | ౪౮.౬ | ౬౩.౦ | ౬౧.౫ | ౮౦.౫ |
| న్యూజిలాండు | ౪౭.౫ | ౭౧.౮ | ౭౯.౦ | ౮౭.౦ |
| భరతఖండము | ౫౧.౦ | ౫౮.౫ | ౨౨.౫ | ౩౬.౮ |

ఎగుమతి దిగుమతి వర్తకములలో భరతఖండము నందువలె ముడిసరకులెల్ల ఎగుమతి చేయుచు ఇతరదేశ పరిశ్రమలకు సంబంధించిన సరకులెల్ల దిగుమతిచేయు పద్ధతి గాక దేశముయొక్క పరిశ్రమలకు సంబంధించిన వస్తువులే చాలవరకు ఎగుమతి చేయబడి తాముచేయలేని అత్యావశ్యకములైన యంత్రములు మున్నగు సామానులే దిగుమతి చేయబడుచున్నందున వర్తకము లాభకరముగ నున్నది.

బ్రిటీషుసామ్రాజ్యమువలన బ్రిటీషుదీవుల వారికి కలుగుచున్న లాభములు ఐదువిధములుగ నున్నది.

౧ వర్తకమువలని లాభము ప్రధానమైనది.

౨ సామ్రాజ్యదేశములందు బ్రిటీషువారి పెట్టుబళ్లు, దానివలన వచ్చు వడ్డీలు ఇతరలాభములు.

3 బ్రిటీషు ప్రజలకు ఉద్యోగములు.

౪ బ్రిటీషు ప్రజలు వలస పోవుట కవకాశములు.

౫ ఇతర విధములగు లాభములు.

౧ వర్తకము:—పైన చెప్పబడిన లాభములలో అధినివేశములవలన బ్రిటీషువారికి హెచ్చుగ వచ్చునది వర్తక లాభమే యని పైన నుదహరించిన అంకెల వలన తెలియగలదు.

| | ౧౯౨౬లో బ్రిటీషుదీవులకు ప్రపంచమున అన్ని దేశములతో జరిగినవ్యాపారము. | బ్రిటీషుసామ్రాజ్య దేశములతో జరిగిన వ్యాపారము, |
|---|---|---|
| దిగుమతి | ౮౪౬౪ లక్షల పౌనులు. | ౨౩౬౪ లక్షలపౌనులు. |
| ఎగుమతి | ౩౫౬౨ ,, | ౧౬౨౭ ,, |

ప్రపంచమునందు బ్రిటీషువారి ఎగుమతి దిగుమతి వర్తకమునందు మోతుబరి ఖాతా దేశములు.

| | | | |
|---|---|---|---|
| (౧౯౨౭) | ౧ భరతఖండము | ౮౬౩౪౯౦౦౦ | పౌనులు |
| | ౨ అమెరికాసంయుక్తరాష్ట్రములు | ౬౬౯౪౦౦౦౦ | ,, |
| | 3 జర్మని | ౬౯౪౧౫౦౦౦ | ,, |
| | ౪ ఆస్ట్రేలియా | ౬౩౭౫౫౦౦౦ | ,, |
| | ౫ ఫ్రాన్సు | ౪౨౦౯౪౦౦౦ | ,, |
| | ౬ ఐరిషు ఫ్రీస్టేటు | ౪౫౫౧౦౦౦౦ | ,, |

* పౌనుఅనగా నవరసు మారకపు రేటునుబట్టి ౧౫ రూపాయలు లేక ౧౩-౫-౩.

| | | | |
|---|---|---|---|
| ౭ | దక్షిణాఫ్రికా | ౩౨౦౪౯౦౦౦ | ,, |
| ౮ | కెనడా | ౩౧౩౬౯౮౦౦౦ | ,, |
| ౯ | జపాను | ౧౫౩౯౮౦౦౦ | ,, |
| ౧౦ | న్యూజిలాండు | ౨౦౩౯౮౦౦౦ | ,, |
| ౧౧ | చైనా | ౯౮౧౧౦౦౦ | ,, |

౧౯౨౭ - ౨౮ లో భరతఖండముయొక్క దిగుమతి వర్తకము ౨౪౯ కోట్ల రూపాయలలో ౧౨౦ కోట్లు బ్రిటీషు దీవులనుండి దిగుమతియగు సరకులే. అందువలన వారికి చాల లాభము కలుగుచున్నది.

౨. పెట్టుబళ్లు: (1) దీనిలో ముఖ్యముగ అధినివేశముల జాతీయ ఋణములలో బ్రిటీషువారిచ్చిన అప్పుమొత్తములు చేరును.

ఆయా దేశములకు బ్రిటీషువారిచ్చిన మొత్తములు ఆయా సంవత్సరములనాటి కిట్లున్నవి.

| | | | | |
|---|---|---|---|---|
| ౧౯౨౭ | నాటికి | దక్షిణాఫ్రికావారికి. | ౧౪,౭౮,౧౦,౦౦౦ | పౌనులు. |
| ౧౯౨౫ | ,, | న్యూజిలాండువారికి. | ౧౧,౮౦,౦౦,౦౦౦ | ,, |
| ౧౯౨౬ | ,, | భరతఖండమువారికి. | ౫౭,౩౦,౦౦,౦౦౦ | ,, |
| ౧౯౨౭ | ,, | ఆస్ట్రేలియాకు లండను నగరమునను న్యూయార్కు నగరమునను గలిసి. | ౪౭,౮౦,౦౦,౦౦౦ | ,, |

వర్తక కంపెనీల పెట్టుబళ్లు, ఇతరవిధములగు పెట్టుబళ్లు చాల కలవు.

(అ) కెనడాలో ౧౯౨౬ నాటికి విదేశములవారు పెట్టుబడిపెట్టిన ౫౦౦౦,౦౦౦,౦౦౦ *డాలర్లలో మూడ్వంతులు అమెరికా వారిది; రెండు వంతులు ఇంగ్లాండువారిది.

(ఆ) భరతఖండమున వర్తకమునందు బ్రిటీషువారి పెట్టుబళ్ళు వేయికోట్ల రూపాయలు కలవని అంచనా వేయబడినది. ఇందువలన బ్రిటీషువారికి ప్రతిసాలున ౭౦ కోట్ల రూపాయల ఆదాయము వచ్చుచున్నది.

(ఇ) భరతఖండమునందలి ౨౦ విదేశభీమాకంపెనీలలో ౧౦ బ్రిటిష్‌వారివి, రెండు కెనడావారివి, ఒకటి ఆస్ట్రేలియావారిది.

3. బ్రిటీషువారు సామ్రాజ్యములోని వివిధప్రాంతములకు పంపు ఉద్యోగుల వేతనములు, ఆదేశమునకు వచ్చు లాభములలో నిం కొకటి. అధినివేశములకు నియమించి పంపు గవర్నరుజనరలుల కొక్కొక్కరికి సాలుకు పదివేల పౌనుల వేతనము. న్యూజిలాండు గవర్నరుకు ఏడువేలపౌనులు, ఆస్ట్రేలియా రాష్ట్రములకు నియమించు ఆరుగురు గవర్నరుల కొక్కొక్కరికి ఐదువేలపౌనులు, భారతదేశములోని వైస్రాయికి సాలుకు ౨,౫౦,౦౦౦ రూపాయలు. మదాసుమొదలగు పెద్ద రాష్ట్రముల గవర్నరుల కొక్కొకరికి సాలుకు లక్ష ఇరువది వేల రూపాయలు, చిన్నరాష్ట్రముల వారికి లక్షరూపాయిలు.

* డాలరు మారకపురేటునుబట్టి రు ౨-౧౨-౦ లేక రు 3-౨-౦లు.

పైన చెప్పబడినవారితో కలిపి బ్రిటీషు సామ్రాజ్య భాగము లన్నిటికిని గలిసిరమారమి ౮౦ మంది గవర్నరులు కలరు. వీరికిఆయా దేశములప్రాముఖ్యతనుబట్టి ౮౭౪౮ పౌనుల వరకును వేతనములు గలవు. వీరుగాక సామ్రాజ్యమునందు ఇతర బ్రిటీషు ఉద్యోగులును గలరు. భరతఖండముగవర్నరు జనరలుకు తక్కిన గవర్నరు జనరలులకన్న లక్షరూపాయ లధికవేతనము. భరతఖండమునందు గవర్నరు జనరలును గవర్నరులును గాక రు ౭౨,౦౦౦ రూపాయలకన్న హెచ్చువేతనముగల బోర్డు ప్రెసిడెంటు జనరలు బిరుదములు గల ఉద్యోగు లెందరో కలరు. కేంద్రప్రభుత్వోద్యోగు లెల్ల ౨౧ వేలు మొదలు ౨౬ వేలవరకు వేతనములు గలవారే. వీరెల్లరు బ్రిటీషువారే. నెలకు రు ౨౦౦-౦-౦ ల పైబడిన వేతనములు వచ్చు ఉద్యోగములు ౧౨ వేలకు పైగా కలవు.

| వేతనముగల ఉద్యోగములలో | నూటికి ఆంగ్లేయులు | భారతీయులు |
|---|---|---|
| నెలకు ౯౦౦ మొదలు ౧౦౦౦ రూ. | ౯౨ | ౪ |
| ౮౦౦ మొ॥ ౯౦౦ | ౭౩ | ౨౧ |
| ౭౦౦ ,, ౮౦౦ | ౭౮ | ౧౪ |
| ౬౦౦ ,, ౭౦౦ | ౫౪ | ౩౬ |
| ౫౦౦ ,, ౬౦౦ | ౫౮ | ౩౧ |
| ౪౦౦ ,, ౫౦౦ | ౩౬ | ౪౯ |

వేతనముల వలన బ్రిటీషుదీవుల వారికి భరతఖండమునుండి సాలుకు ౬౨ కోట్ల ౧౦ లక్షల రూపాయలు

ముట్టుచున్నది. *అయితే అధినివేశముల వలన బ్రిటీషువారి కింతలాభము కలుగుటలేదు. అధినివేశములందు పనులు సంపాదించుకొనిన శాస్త్రప్రవీణులుతప్ప ప్రత్యేకముగా బ్రిటీషు ఉద్యోగులను జీతము లిచ్చి భరించవలసినయావశ్యకత వారికి లేదు. తక్కిన సామ్రాజ్యభాగములందుకూడ బ్రిటీషుఉద్యోగులు చాలమంది కలరు. వారి వేతనములు బ్రిటీషువారికి చెందుచున్నవి.

* బ్రిటీషువారికి భరతఖండములో వేతనములు జీతములు బత్తెములు వలన వచ్చు ఆదాయమును గూర్చి ఫెన్నరు బ్రాక్వే అను పార్లమెంటు సభ్యుడు "ఇండియన్ క్రైసిస్" అను పుస్తకములో నిట్లు వ్రాసినాడు.

గవర్నరుజనరలు గవర్నరుల వేతనములు గాక భరతఖండముయొక్క ప్రభుత్వమున బ్రిటిషు ఉద్యోగులలో సర్వసేనానికి సాలుకు ౭,౪౦౦ పౌనులు.

గవర్నరు జనరలుసభలోని సభ్యులకు ఒక్కొక్కనికి సాలుకు ౬,౦౦౦ పౌనులు.

కలకత్తాలో ఉన్నత న్యాయస్థాన ప్రధాన న్యాయమూర్తికి ౫,౩౦౦ పౌనులు.

కేంద్రప్రభుత్వమునందు ౨౫౦ మంది ఉద్యోగులకు ఒక్కొక్కనికి సాలుకు ౧,౮౫౦ పౌనులు.

౧౦ రాష్ట్రీయ ప్రభుత్వములలో ఒక్కొక దానిలో ౧౧ మంది మొదలు ౩౫ మంది ఉద్యోగులకు ఒక్కొక్కనికి సాలుకు ౧,౫౫౦ మొదలు ౪,౭౫౦ పౌనులు.

గవర్నరుజనరలుకు ౪౫౦ పౌనులు, గవర్నరులకు ౩౦౦ పౌనులు, సంఘ సభ్యులకు ౧౩౦ మొదలు ౨౫౦ పౌనులును, అలవెన్సులు కలవు. మఱియు

గవర్నరుజనరలుకు గవర్నరుకు ఉద్యోగమున జేరునప్పుడు తయారుఖర్చులకు ౧,౨౦౦ మొదలు ౧,౮౦౦ పౌను లిత్తురు.

ఉన్నతోద్యోగుల కెల్ల "దేశాంతరబత్తెము" క్రింద సాలుకు ౧౬౦ పౌను లిత్తురు.

రివిన్యూబోర్డు మెంబర్లకు, రివిన్యూ కమీషనర్లకు, అక్కౌంటుశాఖ వారికి, పేపరు కరెన్సీ ఉద్యోగులకు సాలుకు వేతనముల క్రింద ౧౨,౨౦,౦౦౦ పౌనులు.

ఇంగ్లాండులో రాజ్యాంగమంత్రి కార్యస్థానవ్యయము సాలుకు (ఇందులో ౧,౩౬,౦౦౦ బ్రిటీషువారు భరింతురు) ౩౬,౫౮,౦౦౦ పౌనులు.

ఇంగ్లాండులోని హైకమీషనరు కార్యస్థానమునకు సాలుకు వ్యయము ౨,౭౨,౯౦౦ పౌనులు.

రాజ్యాంగమంత్రియు హైకమీషనరును సివిలు మిలిటరీ ఉద్యోగులను నియమించుటకు (స్టోర్సు) వస్తువులను కొనుటకు రైళ్లవ్యయము ఋణముల వడ్డలక్రింద సాలుకు చేయువ్యయము, ౨,౪౦,౦౦,౦౦౦ పౌనులు.

బ్రిటీషు సైన్యములకొరకు భరతఖండమువారు ప్రతిసాలున నిచ్చు సొమ్ము ౪,౩౭,౬౧,౦౦౦ పౌనులు.

ఇట్లు ప్రతిసాలున అన్ని బాపతులు కలిసి ౩౨,౮౦,౦౦,౦౦౦.

## ౪. వలస. బ్రిటీషుదీవులనుండి వలసబోవువారు.

| సంవత్సరము | అన్ని దేశములకు మొత్తమువలస | కెనడా ఉత్తర అమెరికా దేశములకు |
|---|---|---|
| ౧౯౧౩ | ౭,౦౧,౬౯౧ | ౧,౯౬,౨౭౮ |
| ౧౯౨౫ | ౩,౫౪,౯౨౩ | ౭౦,౮౧౦ |
| ౧౯౨౬ | ౪,౦౨,౪౩౮ | ౪౨,౭౩౩ |
| ౧౯౨౭ | ౪,౧౪,౧౧౯ | ౪౮,౯౮౨ |

| సం॥ | ఆస్ట్రేలియా న్యూజిలాండులకు | దక్షిణాఫ్రికాకు | ఇతరదేశములకు భరతఖండముసహా |
|---|---|---|---|
| ౧౯౧౩ | ౮౮,౯౩౪ | ౨౫,౭౫౫ | ౨౧,౩౭౩ |
| ౧౯౨౫ | ౫౫,౯౨౦ | ౨౧,౧౪౪ | ౨౭,౦౦౧ |
| ౧౯౨౬ | ౧౭,౧౫౧ | ౧౯,౧౪౪ | ౨౫,౦౧౦ |
| ౧౯౨౮ | ౧౯,౨౩౪ | ౨౬,౧౨౦ | ౧,౧౩,౯౩౩ |

వలసబోవువారి సంఖ్య తగ్గుచుండుట చూచి బ్రిటీషు సామ్రాజ్య ప్రభుత్వమువారు ధన మిచ్చి వలస కంపుపద్ధతిని ౧౯౨౫ లో మొదలిడిరి. తక్కిన అధినివేశరాజ్యములు ఇంగ్లాండునుండి వలసవచ్చినవారికి వసతులు కల్పించినచో అధినివేశములు వ్యయముచేయుసొమ్ము మొత్తముతో సమానమైన మొత్తము తాము నిచ్చెద మని(Empire Settlement Act.) ఒక సహకారవలస శాసనము చేసికొనిరి. అంతట ౫౦ వలస ప్రోత్సాహకసంఘములు బయలుదేరి స్త్రీపురుషులకు పనులు కల్పించుచున్నవి. ఈ పద్ధతిపైన నింతవరకు 3,00,000 మంది క్రొత్తఆంగ్లేయులు అధినివేశములకు వలస కేగి నెలకొనిరి. సాలుకు ౪౦,౦౦౦ మంది చొప్పున ఆస్ట్రేలియా కెనడాలకు పోవుచున్నారు. ఇందువల్ల వారి నిరుద్యోగసమస్య పోవుట కవకాశము కలుగుచున్నది. ఇక భరతఖండముసంగతి చెప్పనక్కరలేదు. ఇచ్చట తేయాకుతోటలు మున్నగునవి వారిచేతిలో కలవు. చల్లనిప్రదేశములు వారివి. అనేకులు కాపురము నెలకొనియున్నారు. ౧౯౨౧ జనాభాలెక్క ప్రకారము భరతఖండమున ౧,౫౬,౬౩౮ ఐరోపావా రుండిరి.

౫. వివిధలాభములు:— బ్రిటీషువారికి సామ్రాజ్యమువలన కలుగు వివిధలాభములు భరతఖండముయొక్క సంబంధమున వెల్లడియగుచున్నది. అధినివేశములవలనరాని ధనప్రవాహము భరతఖండమువలన వారిచేతిలోనికి వచ్చిపడుచున్నందుననే భరతఖండమునకు అధినివేశస్వాతంత్ర్యమొసగినచో నీ దేశమునకు ఆర్థికస్వాతంత్ర్యము కలిగినంతటనే ఆప్రవాహము ఆగిపోవునని భయపడుచున్నారు. బ్రిటీషువారికి ప్రతిసాలునవచ్చు లాభము ౩,౦౩,౯౦,౦౦,౦౦౦ రూపాయలనియు అవి ఈక్రిందివిధమున మనకు ఖర్చు అగుచున్నదనియు అంచనా వేయబడినది.

| | | |
|---|---|---|
| ఉద్యోగుల జీతములు | ౬౨౧౦ | లక్షలు రూపాయలు |
| విదేశవ్యాపారము | ౯౧౨౦ | ,, |
| నౌకాలాభములు | ౮౨౦౦ | ,, |
| ఇన్సూరెన్సు భీమా వ్యాపారము | ౧౦౫౦ | ,, |
| బ్యాంకింగు మారకము | ౭౫౦ | ,, |
| రైలురోడ్లు | ౧౨౬౦ | ,, |
| వెరసి | ౩౦,౩౯౦ | లక్షలు రూపాయిలు |

ఈ సొమ్ము వారికిట్లు చెందుచున్నది.

| | | |
|---|---|---|
| వ్యాపారలాభము | ౬౭౮౦ | లక్షలు రూపాయిలు |
| పబ్లికుఋణములలో పెట్టుబడి | ౭౫౦౦ | ,, |
| లాభముల తిరుగుపెట్టుబడి | ౭౫౦౦ | ,, |

| | | |
|---|---|---|
| ఇంగ్లాండుకు పంపబడు పెమిషెన్సులు మొదలగు పైకము | ౬౦౦౦ | లక్షలు రూ. |
| ప్రభుత్వపంపుళ్లు | ౧౪౦౦ | ,, |
| వివిధములు | ౧౧౧౦ | ,, |
| | ౩౦,౩౮౦ లక్షలు | |

బ్రిటీషువారు సామ్రాజ్యమువలన పొందులాభములలో భరతఖండమున మారకము రేటు మార్చుచుండుటవలని లాభ మొకటి. మన రూపాయికి నిజమగు వెండివిలువ తక్కువ. దానియొక్క విలువను బ్రిటీషువారు నిర్ణయింతురు. రూపాయికి ౧౬ పెన్నీలుగ నుండిన మారకము రేటు ౧౮ పెన్నీలకు *హెచ్చించినందువలన బ్రిటిషువారికి వచ్చులాభము చిత్రమైనది. అది వర్తక ఆర్థిక వ్యవహారములందు పైకి కనబడును. తక్కిన ప్రభుత్వ వ్యవహారములందు పైకి కనబడదు. మనము ఇంగ్లాండులో విక్రయించు సరకు లెల్ల పౌనులచొప్పున విక్రయింప వలయును. వారు రూపాయిలకు సరకును కొనరు. అందువలన మన మిదివరకు ఒకరూపాయికి ౧౬ పెన్నీల సరకు పంపుచుండి ఇప్పుడు ౧౮ పెన్నీల సరకు పంపవలెను. అందువలన ఎగుమతి వ్యాపారములో ఒకరూపాయికి ౨ పెన్నీలచొప్పున మనకు కలుగు నష్టము నూటికి ౧౨ ౧/౨ %. మనకు ఇక్కడ

* ౧౨ పెన్నీలు = ఒకషిల్లింగు    ౨౦ షిల్లింగులు = ఒకపౌను.

బ్రిటీషువారు సరకులు విక్రయించునప్పుడు రూపాయిల చొప్పున నిచ్చెదరేగాని పౌనుల ప్రకార మీయరు. అందువలన వారికిదివరకు ఒకరూపాయి విలువసరకుకు ౧౬ పెన్నీలు వచ్చేది ఇప్పుడు ౧౮ పెన్నీలు వచ్చును. ఇందువలన దిగుమతి వ్యాపారములో రూపాయికి ౨ పెన్నీలు మనకు నష్టము, వారికి లాభము. ఇదియు నూటికి పండ్రెండున్నర వంతులు. ఇందువలన ఎగుమతి దిగుమతి వ్యాపారము మొత్తములో మనకు నూటికి ౨౫ వంతులు నష్టము, వారికిలాభము. బ్రిటిషు ప్రభుత్వమువారు చలామణిని సంకుచితముగజేసి ప్రచారమున నున్న రూప్యములను ఖజానాలో బంధించి యుంచుటవలన రూపాయయొక్కవిలువ మఱియు హెచ్చి ధరలు తగ్గును. ఇందువలన బ్రిటీషువర్తకుల కెంతమాత్రము నష్టము కలుగదు. ఏలన, వారికి చెల్లవలసిన పౌను చెల్లుచునేయుండును. తమకు నష్టము చేయకుండగా ఇక్కడ తమ వస్తువులు చౌకగ విక్రయింపగలుగుటచే ఇతరదేశపరిశ్రమలతోనే గాక మనదేశపరిశ్రమలతోకూడ పోటీగా వ్యాపారము చేయగలరు.

ఇట్లు బ్రిటీషుసామ్రాజ్యము, స్వరూప స్వభావములను బట్టి బ్రిటీషుదీవులకును అధినివేశరాజ్యములకును సమాన రాజకీయ ఆర్థిక సాంఘిక లాభములను చేకూర్చు సాముదాయిక సహకార సంస్థగా నున్నది. అందువలననే బ్రిటీషు సామ్రాజ్యము బాగుగ వేళ్ళు నాటుకొనిన మహా వృక్షమై వర్ధిల్లుచున్నది.

## సామ్రాజ్య వాణిజ్య వ్యవస్థ.

బ్రిటీషుదీవుల ప్రజలకు రాజ్యాంగస్వాతంత్ర్య స్వత్వము లెంత ముఖ్యముగ నున్నవో వాణిజ్యవ్యవస్థయు నంత ప్రధానముగ నున్నది. ప్రపంచవర్తకము నెల్ల తమహస్తగతముగ చేసికొనుటకు బ్రిటీషువా రవలంబించిన పద్ధతులు చాల చిత్రములుగ నున్నవి.

వర్తకబోర్డు:—బ్రిటీషు ప్రభుత్వవిధానమున ప్రధాన శాఖలలో నొకటి వర్తకవ్యవహార కార్యాలయము లేక వర్తకబోర్డు (Board of Trade) ౧౭౮౬ నుండి దాని పరిపాలనా వ్యవస్థ చక్కచేయబడి చాలప్రాముఖ్యము వహించినది. ఈ శాఖను పరిపాలించు ప్రధానోద్యోగికి వర్తక కార్యాలయాధ్యక్షు డని పేరు. బ్రిటీషువర్తకవ్యవహార కార్యాలయాధ్యక్షుడు ఇంగ్లాండులోని బ్రిటీషుప్రభుత్వముయొక్క ముఖ్యమంత్రులలో నొక్కడుగ నుండును. ఈ శాఖవారు వాణిజ్యవ్యాపారములను గూర్చియు పరిశ్రమలను గూర్చియు ఆవశ్యకము లైన అనేక అధికారములు కలిగియున్నారు. వాణిజ్యవ్యవహారముల పరిపాలనయొక్క పద్ధతియెల్ల ఈ కార్యాలయమే నిర్ణయించును. వ్యాపార సంబంధమైన రాజీలు, సంధులు, కార్యాలోచనలు, ఏర్పాటులును బ్రిటీషు వ్యాపారమునకు సంబంధించిన అన్ని అంతర్జాతీయ వ్యవహారములును, ఈకార్యాలయమే నడుపును. వాణిజ్యనౌకా వ్యాపారములు, నావికులు, దివాలా, కంపెనీలు, గ్యాసు, అను

గతపరిశ్రమలు(By Industries), రంగుల పరిశ్రమలు, వర్తక గురుతులు, సినీమాలు, ఫిల్ములు, కొలరాళ్ళు, కొలపాత్రములు, గ్రంథస్వత్వములు, క్రొత్తవస్తువులందు వర్తకుల కుండు విశేషాధికారములు లేక పేటెంటులు, గనులు, మున్నగు వ్యవహార విధుల పరిపాలన మెల్ల ఈ కార్యాలయము వశమున నే గలదు. బ్రిటీషుదీవుల యొక్కయు అధినివేశరాజ్యముల యొక్కయు దక్షిత రాజ్యముల యొక్కయు వాణిజ్య పరిశ్రమలను గూర్చి, నౌకావ్యాపారమును గూర్చి, సుంకములు సుంకనియమములు, ఇతర ధర్మనిబంధనలనుగూర్చి తెలుపుసంగతులు, అంకెలు, సమకూర్చి ఈ కార్యాలయము వారు ప్రకటింతురు. ఆహారపదార్థముల సమితి, ఈ కార్యాలయమునకే చేర్పబడినది సైన్యవస్తు నిలయములకు గావలసిన సరకులు, ప్రభుత్వశాఖలకు వలసిన వస్తువులు, తెచ్చి యిచ్చుట యీ శాఖవారి పనియే. పెట్రోలియము నూనె, దీనిని గూర్చిన వ్యవహారములు దీనివే. ఈ కార్యాలయమువారి కింక ననేకబాధ్యతలు కలవు. ఈ కార్యాలయమువారి పరిపాలనము జరుపుటకు ౧౬ శాఖలు లేక డిపార్టుమెంటులు కలవు. వీనికి తోడ్పడుటకు, వివిధ పరిశ్రమలకు సంబంధించిన ఉపసంఘములు లేక కమిటీలు ౨౫ కలవు. ఈ కార్యాలయమువారి ప్రోత్సాహమున వాణిజ్యాభివృద్ధికొరకేర్పరుపబడిన ఉద్యోగ అనుద్యోగ సంఘములు, కంపెనీలు సమితు లెన్నో కలవు. బ్రిటీషుసామ్రాజ్యవర్తక పరిశ్రమల నభివృద్ధిచేయుటకీ కార్యాలయము చేయని కార్యమే లేదనిన

నతిశయోక్తి కాదు. ఈ కార్యాలయము స్వయముగ జేయక పోయినను ఇతర సంస్థలద్వారా చేయించును; చేయుటకు ప్రోత్సహించును.

దేశాంతరవర్తకశాఖ:— బ్రిటీషువారి దేశాంతర వ్యాపారమును కాపాడి అభివృద్ధిజేయుటకును ఈ కార్యాలయమునకు తోడ్పడుటకు ప్రపంచమున ఇతరదేశములందు బ్రిటీషువారు నియమించు ప్రతినిధుల కార్యాలయములందు కొందరు వాణిజ్యోద్యోగులుకూడ నియమింపబడి యుండిరి. కొన్ని దేశములందు "కాన్సల్సు" అనబడు ప్రతినిధులే ఆపనులు సేయుదురు. ౧౯౦౦ లో నొక వాణిజ్యరహస్యపరిశోధక శాఖ నేర్పరచిరి. ౧౯౦౮ లో కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, న్యూజిలాండు అధినివేశములందును, "వాణిజ్యకమీషనరు" లను నుద్యోగులను నియమించిరి. దేశాంతరవర్తక వ్యవహారములందు వర్తకబోర్డువారును విదేశరాజ్యాంగ మంత్రికార్యాలయమువారును కలిసి పనిచేయుచుండిరి. ఇటీవల ఐరోపా సంగ్రామసందర్భమున వర్తకబోర్డువారు చేయవలసిన పనులధికమై వాణిజ్యవిషయమున పరిశ్రమలవిషయమున ప్రభుత్వమువా రధికశ్రద్ధ వహింపవలసి వచ్చెను. వాణిజ్యరహస్య ఉపశాఖ నొక ముఖ్యశాఖగమార్చినచో బ్రిటీషువాణిజ్యవ్యవస్థ కనుకూలముగ నుండునని తోచి దేశాంతర వర్తకశాఖ (Over-seas Trade Department) యనుపేరుతో విదేశవ్యవహార కార్యాలయమువారును వర్తకబోర్డువారును గలిసి ౧౯౧౭ లో నొకప్రభుత్వశాఖను నిర్మించిరి. పూర్వము వర్తక

వ్యవహార రహస్యోపశాఖవారు చేయుపనులు, ఇంకను సామ్రాజ్య దేశాంతర వాణిజ్యాభివృద్ధికొరకు చేయవలసిన కార్యములు నీశాఖవశము జేయబడెను. దీని కార్యాలయము లండన్ నగరమున గలదు. ఈ శాఖలో భూగోళ విభాగపద్ధతియు వివిధ దేశముల బజారులస్థితిగతులు బాగుగ తెలిసిన ఉద్యోగు లుండుటయేగాక, వాణిజ్యవిభాగపద్ధతిని బ్రిటీషుదీవుల సరకులనుగూర్చి బాగుగా నెరిగిన ఉద్యోగులును గలరు. ఈ కార్యాలయమున బ్రిటీషుదీవుల కొకఉపశాఖయు మూడు దేశాంతర ఉపశాఖలును గలవు. దేశాంతర వర్తక శాఖ వారు ప్రపంచమునందలి వాణిజ్యరహస్యములను దెచ్చుటకు వారివశమున నొక గొప్పఉద్యోగపరంపర కలదు. సామ్రాజ్యమునందు వివిధ అధినివేశములందును భరతఖండమునను ముఖ్యవలస దేశములందును గలిసి ౧౩గ్గురు వర్తకకమీషన ర్లనబడు ఉద్యోగులుకలరు. ఇతర సామ్రాజ్యభాగము లందు సామ్రాజ్యవర్తక విలేఖరులు కలరు. విదేశములందు వాణిజ్య రాజతంత్రశాఖోద్యోగు లనుపేరిట రెండుతరగతుల ఉద్యోగులు ౨౫ మంది ముఖ్య విదేశపట్టణములందు కలరు. వీరు బ్రిటీషురాజ్య రాయబారుల (Embassy) కార్యాలయము ననే సభ్యులుగనుందురు. వాణిజ్యమునకు సంబంధించిన వ్యవహారములం దారాయబారులకు వీరు కావలసిన సంజాయిషీ నిచ్చెదరు.

ఇదిగాక ప్రపంచమునందు వివిధదేశములందు బ్రిటీషువారు నెలకొల్పు ప్రతినిధులు (Consuls) చేయవలసిన

పనులు వివిధములు. ఇటీవల ౧౯౧౯ మొద లీప్రతినిధులు దేశాంతర వర్తకశాఖవారి యధికారముక్రింద పనిచేయుచు వాణిజ్యవిషయములందు విశేషశ్రద్ధ వహించియున్నారు. బ్రిటీషువస్తువుల ఎగుమతికిగల అవకాశములనుగూర్చి బ్రిటీషు పారిశ్రామికులకును వర్తకులకును తెలుపుటయేగాక వర్తకమునకు తోడ్పడగల ఆర్థిక వాణిజ్య సంబంధమైన అన్నిసంగతులనుగూడ వీరు సంపాదింపవలయును. ఆయా దేశములందలి ప్రజల అక్కరలు, రుచులు, వాణిజ్యసరణి, చక్కగ గమనించి అచ్చటి బ్రిటీషువర్తకమును, సామ్రాజ్యవర్తకము నభివృద్ధిచేయుటకును గల అవకాశములను వర్తకబోర్డువారికిని అధినివేశరాజ్యములవారికిని తెలుపుచుండవలయును. ఆయా దేశములందలి వర్తకసంఘములతోను ఎగుమతి దిగుమతి వర్తకులతోను స్నేహము జేసి, ఉపయోగకర విషయముల నెల్ల సంగ్రహింపవలయును. విదేశీయుల పోటీనిగూర్చియు దేశముయొక్క ఆర్థిక వ్యాపార పరిస్థితులనుగూర్చియు తమ మండలములలో చేయవలసినపనికిని అభివృద్ధికినిగల అవకాశములు, మొదలగు విషయములనెల్ల తెలుపవలయును. ఇది వాణిజ్యరహస్యపరిశోధకశాఖ యని చెప్పవచ్చును. ౧౮౮౯ సంవత్సరమున వర్తకబోర్డువారిచే స్థాపింపబడి ౧౯౦౦ మొదలు వారపత్రికగ చేయబడిన యొకపత్రికయందు, ఈశాఖవారి ప్రతినిధు లంపిన సమాచారము లెల్ల ప్రకటింపబడును. ప్రతిసాలున నివేదికలు ప్రకటింపబడును. ఇదిగాక బ్రిటీషు పారిశ్రామికులందు వర్తకులందు నీవిషయము లెల్ల ఇతర విధములుగ

గూడ ప్రచారము చేయబడును. ఇట్లు వర్తకసంఘములు చేయ వలసిన పనిని ప్రభుత్వమువారు చేయించి వాణిజ్యాభివృద్ధికి తోడ్పడుచున్నారు. కేవలము సమాచారముల నంపుట మాత్రమేగాక ఈ శాఖవారును, దేశాంతరములందుగల దీని ఉద్యోగులును, బ్రిటీషువర్తక సంఘముల కితరవిధములగు సహాయములు చేయుదురు. దేశాంతరములందు వారికి కలుగు కష్టములను నివారించి వారి ప్రతినిధులకు సౌకర్యములు కలిగింతురు. ఇదిగాక ఈ ఉద్యోగులు స్వయముగ బ్రిటీషు దేశపరిస్థితులు తెలిసికొనుటకు అప్పుడప్పుడు బ్రిటీషుదీవులకును ప్రయాణము చేయుచుందురు.

పారిశ్రామిక ప్రదర్శనసంతలు:— వాణిజ్య పరిశ్రమల యభివృద్ధికొరకు బ్రిటీషు ప్రభుత్వమువారు చేయు విశేషకార్యములలో ప్రదర్శన సంతలు చాలముఖ్యములైనవి. యుద్ధమువలన తమకు గావలసిన విదేశసరకులు బాగుగ దిగుమతి యగుట మానినందున ఇదివరకు విదేశములనుండి దిగుమతిచేయు సరకులు తమదేశములోనే యుత్పత్తి చేయించి పరిశ్రమల నభివృద్ధిచేయ దలంచి, ౧౯౧౫ లో వర్తకబోర్డువారు వివిధ నమూనాలు, దినుసులు, సామానులు తెప్పించి ఒక ప్రదర్శనము నేర్పాటుచేసిరి. ౧౯౧౬ లో నీ సంతలో ౬౦౦ మంది ప్రదర్శకులు పాల్గొనిరి. దీనివలన చాల ఉపయోగము కలిగెను. ఈ యుద్దేశముతోనే వాణిజ్య ప్రదర్శనములు, సంతలు, వినిమయ సమ్మేళనములు, నేర్పరుపబడెను. దీని యుపయోగమును జూచి దేశాంతర వర్తక

శాఖవారు దీనిలండను ప్రదర్శనసంతను చక్కజేసి బ్రిటీషు దేశాంతర వర్తక ప్రోత్సాహక మార్గములను కలిగించిరి. ఇదిగాక బర్మింగుహాములో నింకొక ప్రదర్శనసంత జరుగు చుండును. ౧౯౨౦ లో చేయబడిన ప్రదర్శన సంతలో ౧౧౬౭ ప్రదర్శకులు పాల్గొనిరి. ఇటీవల నీపద్ధతి ఏటేట జరుపసాగిరి. వీరు గొప్ప ప్రచారముచేసి వాణిజ్య ప్రకటనలు అభివృద్ధి మార్గములు చూపుచున్నారు. ఇదిగాక ౫౦,౦౦౦ మంది దేశాంతరవర్తకులతో ఉత్తరప్రత్యుత్తరములను జరుపుచున్నారు.

ఇటీవల ౧౯౨౪లో సామ్రాజ్య ప్రదర్శనము వెంబ్లీలో చేయబడెను. ఇందు సామ్రాజ్య వస్తువులుమాత్రమే ప్రదర్శింపబడి సామ్రాజ్యసంపద యెంత కలదో ప్రజ లెఱుగుట కవకాశము కలిగెను. ౧౯౨౫ లో కూడ నీప్రదర్శనము జరిగెను. సామ్రాజ్యవర్తకప్రోత్సాహముకొరకు ప్రదర్శన నౌకలను ప్రభుత్వశాఖవారు దేశాంతరముల కంపిరి.

వాణిజ్యపరపతిపద్ధతి:— వాణిజ్యాభివృద్ధికి ప్రభుత్వమువారు చేయుపనులలో నొకటి, విదేశములకు బ్రిటీషుసరకు లెగుమతి చేయువారికి ఋణములు అడ్వాన్సులు నొసగుట. దిగుమతి వర్తకులకును, హామీపైన ఋణము లిత్తురు. ఇటీవల ౧౯౧౯ లో ఎగుమతి పరపతి గారంటీ డిపార్టుమెంటువారొక క్రొత్తపద్ధతిని నెలకొల్పిరి. విదేశములందు నమ్మకముగ దిగుమతివ్యాపారము చేయు వర్తకులపైన బ్రిటీషు ఎగుమతి వర్తకు లిచ్చు బరాతములలో నూటికి ౭౫ వంతులు

మార్చి వసూలుపరచుటకు తాము పూచీపడెదమని ప్రకటింతురు. ఈ పరపతివ్యాపారము చాలవరకు కంట్రాక్టుల పైనను భీమాపత్రముల పైనను జరుగుచుండును. వాణిజ్య పరిశ్రమలశాఖ కొరకు బ్రిటీషు ప్రభుత్వముచేయు వ్యయము చూచినచో బ్రిటీషుసామ్రాజ్యప్రభుత్వము వాణిజ్యాభివృద్ధి కొరకు చేయుచున్నకృషి తెలియగలదు.

౧౯౨౭—౨౮ లో

| | | |
|---|---|---|
| వర్తకకార్యాలయమునకు | ౨,౩౭,౭౮౦ | పౌనులు |
| శాస్త్రపరిశోధన, పారిశ్రామిక పరిశోధన | ౪,౫౧,౯౫౧ | ,, |
| వాణిజ్యనౌకావ్యాపారశాఖ | ౪,౦౭,౬౩౪ | ,, |
| దేశాంతరవర్తకశాఖ | ౩,౨౮,౯౬౨ | ,, |
| ఎగుమతి పరపతి అడ్వాన్సులు | ౫౨,౦౦౦ | ,, |
| గనులశాఖ | ౧,౭౭,౦౧౭ | ,, |
| వ్యవసాయము, చేపలు | ౨౦,౨౭,౨౩౬ | ,, |
| బీటుదుంప, పంచదారకు ప్రోత్సాహకసహాయము (Subsidy) | ౫౪,౦౦,౦౦౦ | ,, |
| అడవులు | ౫,౯౫,౪౦౦ | ,, |
| రవాణాకార్యాలయము | ౧,౨౬,౪౮౦ | ,, |
| స్కాట్లాండు వ్యవసాయశాఖ | ౫,౫౩,౨౧౩ | ,, |
| ,, చేపలు | ౬౭,౮౭౬ | ,, |
| | ౧,౦౪,౨౫,౫౪౯ | పౌనులు |

## సామ్రాజ్యలాభ విధానము.

ఐరోపాసంగ్రామమునాటినుండి బ్రిటీషు సామ్రాజ్యమున బ్రిటీషుదీవుల ప్రభుత్వమువారు అధినివేశములతో సామ్రాజ్య వ్యవహారములందెల్ల కార్యాలోచనము చేయుట తటస్థించి సహకారస్నేహభావ మభివృద్ధి పొందగా బ్రిటీషు సామ్రాజ్యముయొక్క రాజకీయ ఆర్థిక సమస్యలను చక్కగ గమనించి అధినివేశములయొక్కయు బ్రిటీషుదీవులయొక్కయు అభివృద్ధికి మార్గముల నిర్ణయించుటకు బ్రిటీషు అధినివేశ ప్రభుత్వ ప్రతినిధుల సభయగు సామ్రాజ్యసభవారు తీర్మానించిరి. అంతట రాజకీయములందు, ఆర్థిక వ్యవహారములందు, క్రొత్త సంస్థలు, క్రొత్త విధానములు నెలకొల్పబడినవి. ౧౯౨౦ సం॥లో 'సామ్రాజ్య నౌకావ్యాపార ఉపసంఘము' స్థాపింపబడెను. ఈ సంఘము సామ్రాజ్యమునందలి వివిధ ప్రభుత్వములకు బాధ్యత కలిగియుండును. రేవుపద్ధతులను, ఓడల వారినామా లందలి బాధ్యతలనుగూర్చియు సమిష్టిలాభమును యోజించుటయు సభవారి కర్తవ్యములలో నొకటి.

౧౯౨౫ లో 'సామ్రాజ్య ఆర్థికవిచారణ సంఘము నిర్మింపబడెను. సామ్రాజ్యమునందలి వివిధ ప్రభుత్వ ప్రతినిధులును, బ్రిటీషుదీవుల ప్రభుత్వప్రతినిధులును గలిసిన యీ సంఘము ఆయా ప్రభుత్వము లెల్ల అంగీకరించిన ఆర్థికవిషయముల నెల్ల తీర్మానించును. ప్రపంచమునందలి ఇతరదేశముల నుండివచ్చు సరకులకన్న ముందు సామ్రాజ్యములోని సరకులనే

స్వీకరించుటకును అర్థోత్పాదకులును దాని ననుభవించువారును కూడ లాభము పొందుటకును సామ్రాజ్యమువారు తగు నేర్పాటులు గావింపవలయునను సామ్రాజ్యలాభవిధానసూత్రము (Imperial Preference) ౧౯౨౩లో సామ్రాజ్యసభయందు అంగీకరింపబడి యుండెను. ఆప్రకారము విదేశములనుండి దిగుమతి యగు సరకులకన్న సామ్రాజ్యమునుండి దిగుమతి యగు సరుకులపై తక్కువ సుంకములు విధించుపద్ధతి యవలంబింపబడెను. ఈ "సామ్రాజ్యలాభ" విధానమునుబట్టి సామ్రాజ్యములో బ్రిటీషుదీవులవారు దిగుమతిచేయు ఆహారపదార్థములు, గోధుమలు, పాడిదినుసులు, చేపలు, కోళ్ళు, కోడిగుడ్లు, తేనె, మున్నగు వస్తువులును, పొగాకు, కలపమున్నగు వస్తువులును సామ్రాజ్యములో తయారగునట్టివానినే బ్రిటీషుదీవులలో విక్రయించుటకు వీళ్ళు కలిగించి పరస్పరలాభము కలిగించుటకు "సామ్రాజ్య ఆర్థిక సంఘము (Imperial Economic Committee) నొక దానిని స్థాపించిరి.

ఈ సంఘము మార్చి ౧౯౨౬ లో సమావేశమైనది. సామ్రాజ్యమువారెల్లరు నిష్టపడి సామ్రాజ్యమునకు లాభకరముగ ప్రవర్తింపవలయు ననియు సామ్రాజ్యముయొక్క అర్థోత్పత్తిని సామ్రాజ్యమువారు బాగుగ వినియోగపరచుకొనునట్లు చేయగలందులకును దానిని గూర్చిన ప్రచారము, ప్రకటన బాగుగ చేయవలయు ననియు, ఆయా వస్తువు లెచ్చట తయారగుచున్నవో స్పష్టముగ తెలుపుచుండవలయు ననియు, సామ్రాజ్యవర్తక మభివృద్ధి పొందుటకుగల ఆటంకములను

గూర్చి శాస్త్రీయ ఆర్థికపరిశోధనలు చేయవలయుననియు, దీని విషయమున సామ్రాజ్యమందలి ప్రభుత్వములెల్ల తగినచర్య తీసికొనవలయుననియు తీర్మానించిరి. మఱియు వాణిజ్యఆచారములు పరిశీలించి శాస్త్రపరిశోధనచేసి సామ్రాజ్యములోని మంచిరకము వస్తువులు బ్రిటీషుదీవులలో విరివిగా సరఫరాయగునట్లును, అవి విదేశవస్తువుల పోటీకిగూడ నిలువగలట్టివిగ నుండునట్లును, చేయుటకు వివిధ సరుకులకు, వ్యాపారములకు, గల అవకాశములను పరిశీలింపవలెననియు తీర్మానించిరి. ఈ కార్యములకొరకు సమకూర్చబడిన నిధి ౧౦,౦౦,౦౦౦ పౌనులు. వ్యయము చేయతగిన పద్ధతులు నిర్ణయించి దానినిగూర్చి అధినివేశరాజ్యాంగమంత్రికి సలహా నిచ్చుట కొక సామ్రాజ్య క్రియ ప్రోత్సాహక సమితి (Empire marketting Board) నిర్మించుట యావశ్యకమని తీర్మానించిరి.

బ్రిటిషుసామ్రాజ్య క్రియప్రోత్సాహక సమితి:—౧౯౨౬ మే నెలలో స్థాపింపబడెను. ఇదివరకు విదేశసరకులు తెప్పించు బ్రిటీషువారిని ఆసరకులకు బదులు అధినివేశముల నుండి సరకులు తెప్పించునట్లు జనులందును బజారులలోను కదలిక పుట్టించి అధినివేశవర్తకమును బ్రిటీషుదీవుల వర్తకమును ప్రోత్సహించుటకు వలసినప్రచారము, శాస్త్రపరిశోధన, ఆర్థిక విచారణమును సలుపుటయే యీ సమితివారి పని. అందు కొరకు బ్రిటిషుదీవులయొక్కయు, అధినివేశములయొక్కయు, ఇతరసామ్రాజ్య భాగములయొక్కయు, ప్రభుత్వముల ప్రతినిధులును ఈ విషయములందు తెలివితేటలుగల ఇతరులును,

ఈ సమితిలో సభ్యులుగ నియమింపబడుదురు. ఈ సమితి రాజకీయములతో జోక్యము కలిగించుకొనదు. అందువలన అన్ని రాజకీయపక్షములు దీనికి సహాయము చేయును. ఈ సమితివారు శాస్త్రపరిశోధన స్వయముగ చేయరుగాని, అట్టిసంస్థలకు తగు సహాయము చేయుదురు. ఉష్ణదేశముల పరిస్థితులకు వలసిన పరిశోధనలు, వృక్షజాతులు, కూరగాయజాతుల పరిశోధన, కీటకనివారణ పద్ధతులేగాక వివిధపదార్థములను ఎగుమతి చేయుపద్ధతులు, నిలువచేయుపద్ధతులనుగూడ సంస్కరించి అభివృద్ధి చేయుచుందురు.

వాణిజ్యము - నానారాజ్యసమితి:— ప్రపంచరాజకీయమండలి యగు (లీగ్ ఆఫ్ నేషన్సు) నానారాజ్యసమ్మేళనమందు సైతము బ్రిటీషుసామ్రాజ్యమువారు తమ వాణిజ్యవ్యవహారాభివృద్ధికొరకు పెక్కు ప్రయత్నములను చేయుచున్నారు. స్వేచ్ఛావ్యాపార సౌకర్యములు సంపాదించుటకును, కొన్ని ప్రయత్నములు చేసి ౧౯౨౭ లో ఎగుమతి దిగుమతి నిషేధములను, ఆటంకములను నియమములను తీసివేయుటకొరక అంతర్జాతీయసభ గావించిరి. ౧౮ జాతు లీపద్ధతి నంగీకరించెను. ఇంతియే గాక వాణిజ్య వివాదలను మధ్యస్థుల తీర్పులవలన తీర్మానించుకొనుటకును ౧౭ రాజ్యము లంగీకరించెను. దీనివలన వర్తకులకు కొంచెము లాభము కలిగినది. ఇట్లే ఇటీవల జరుగుచున్న అన్ని అంతర్జాతీయ సభలయందును బ్రిటీషుసామ్రాజ్య వాణిజ్యాభివృద్ధిని గూర్చిన విషయములు ముఖ్యాంశములుగ చర్చింపబడుచున్నవి.

వాణిజ్యవ్యవస్థ-బ్రిటీషుప్రజలు:—ప్రపంచమునందలి వాణిజ్య వ్యవస్థలందు బ్రిటీషు వాణిజ్యవ్యవస్థ చాలకట్టుదిట్టములు కలిగి ప్రభుత్వమువారి సహాయమునకు పాత్రమై సామ్రాజ్య వ్యవహారములం దెల్ల ప్రధానస్థానము నాక్రమించుచున్నది. వ్యాపార వాణిజ్య పరిశ్రమల ప్రోత్సాహము కొరకేర్పడిన సాధారణసంఘములు ఇంగ్లాండులో చిరకాలము నుండి కలవు. వర్తకుల బాకీలు వసూలుచేసి దివాలాకోరులనుండి వారిని కాపాడుటకు నేడు వాణిజ్యసంరక్షణ సంఘము లనేకము లున్నవి. అట్టి సంఘములెల్ల కలిసిన వర్తక సంరక్షణ సంఘముల సమ్మేళన మొకటి స్థాపింపబడినది. దీనిలో వర్తకులు, ఉత్పాదకులు, పారిశ్రామికుల సంఘములు సభ్యులుగ నున్నవి. ప్రభుత్వమువారు వర్తకసంరక్షణ నియమముల జేసిరి. వర్తక పంచాయితీ న్యాయసభ లేర్పరుపబడినవి. విద్యావంతులు వాణిజ్యమున జేరుటకు వాణిజ్యకళాశాలలు కలవు. వివిధ పరిశ్రమలవారు వేర్వేరు సంఘములను స్థాపించి ఆయా పరిశ్రమల వ్యాపారాభివృద్ధికొరకు కట్టుదిట్టములు చేసికొనుచున్నారు. వివిధవస్తువుల కొనుగోలు, అమ్మకము వ్యాపారము బాగుగ నెరవేరుటకు మంచి "మచ్చుల చావళ్ళు" స్థాపింపబడినవి. బ్రిటిషు నూలుపారిశ్రామికసంఘమువారు చాల బలవంతులైన వర్తకసంస్థ. బ్రిటిషు వర్తకసంఘములెల్ల బలవంతములు ధనవంతములై ప్రభుత్వమున పలుకుబడి కలిగి యున్నవి. పారిశ్రామికుల యొక్కయు వస్తుఉత్పాదకుల యొక్కయు అభిప్రాయములను గమనించి ప్రభుత్వము

వారు వాణిజ్య పరిశ్రమల నభివృద్ధి చేయుటకును కార్మికులయొక్క స్థితిగతులను బాగుచేయుటకు ననేక సంస్కరణములను చేయుచునేయున్నారు. ఇంక నేమైన సంస్కరణములు గావలసినచో ప్రభుత్వమువారివలన చేయించుకొనగల శక్తియు అచ్చటి పారిశ్రామికులకును వర్తకులకును కలదు. నిజముగ బ్రిటీషు ప్రభుత్వము ప్రజల ఎన్నికలపైన నాధార పడియున్నందునను దేశములో వాణిజ్య పరిశ్రమలవలన జీవించువారే అధిక సంఖ్యాకులై నందునను వీరి యభిప్రాయములకు వ్యతిరేకముగ ప్రభుత్వము నడువ జాలదు.

బ్రిటిషు పరిశ్రమల ఫెడరేషను:—బ్రిటీషుపరిశ్రమల సంయుక్తసంఘమను నొక (Federation of British Industries) సంఘము ౧౯౧౬ లో స్థాపింపబడినది. ఈసంఘము పారిశ్రామికోత్పాదకులయొక్కయు ఇతరవస్తువుల నుత్పత్తి చేయువారియొక్కయు క్షేమముకొరకు కేర్పడిన గొప్ప అనుద్యోగ సంస్థయైయున్నది. ౨౫౦౦ కంపెనీలు ౨౦౦ సంఘములు దీనిలో చేరినవి. ౧౯౨౩ లో నీ సంఘము రాజుగారి పట్టా (Charter) పొందినది. దీనికి ౧౬ జిల్లాలలో ప్రాతినిధ్యము కలదు. ౧౦౦ ప్రతినిధులు గల కార్యనిర్వాహక సంఘము కలదు. ఈ సంఘమువారికి ఇంగ్లాండులోని అన్ని రాజకీయ పక్షముల నాయకులందును ప్రభుత్వవర్గమువారియందును గూడ విశేషమగు పలుకుబడి కలదు. ఈ సంఘమువారి కొక దేశాంతర ఉపసంఘము (Overseas Committee)

కలదు. వీరికి విదేశరహస్యములు దెలుపు విలేఖరులు, ప్రతి నిధులును గలరు. మఱియు ఖండాంతరములందలి అర్థోత్పాదక పారిశ్రామిక సంఘములతోను, అంతర్జాతీయ వర్తక సంఘములతోను సంబంధము కలదు. ఈసంఘము బ్రిటీషు దీవుల ప్రభుత్వమువారి ద్వారమునను స్వయముగనుగూడ విదేశరాజ్యముల ప్రభుత్వములతో రాయబారములు సలిపి బ్రిటీషు పరిశ్రమలకు కావలసిన సౌకర్యములను సంపాదించు చుండును. ఈ సంఘముయొక్క ముఖ్యోద్దేశ్యము బ్రిటీషు పరిశ్రమలను అబివృద్ధిచేసి వానిని సంరక్షించు మార్గముల నరసి ఆపనులు చేయుట; అవసరమైన ప్రజాభిప్రాయమును కలిగించి ప్రభుత్వమువారు తమ కోరికలను నెరవేర్చునట్లు ఒత్తిడి కలిగించుట. సామ్రాజ్యాంతర్భాగములుగాని ఇతర దేశములుగాని బ్రిటీషు వస్తువులపైన దిగుమతి పన్ను విధించె ననుకొనుడు; తత్క్షణమే యీ సంఘమువారు ప్రచారము సాగించి తమ ప్రభుత్వమువారు జోక్యము కలిగించుకొనునట్లు చేయుదురు. ఆయా దేశములందు సైతము రాజకీయాందోళనము సలుపుదురు. మనదేశమున విదేశవస్త్ర సుంకముల చట్టవిషయమున వీ రెంతో పనిచేసి విజయులైరి.

వాణిజ్యవ్యవహారములను గూర్చిన సాధారణ విషయములును, పన్నులవిధానమును, కేవులరేట్లు, బొగ్గు, కిరసనునూనె, రైళ్ళు, నౌకలు ఇతర ఆర్థిక విషయములను గూర్చియు నీసంఘమువారు వ్యవహరింతురు. ఇదిగాక భీమావ్యాపారమునకు ప్రకటనశాఖకు సంబంధించిన ప్రత్యేక ప్రతినిధులు

గలరు. ఎగుమతి వర్తకులకు వీరనేకవిధములుగ సహాయము చేయుదురు. విదేశములందు బేరములు కుదుర్చుదురు. తగవులు తీర్చుదురు. క్రొత్తవారికి పరిచయము కలిగింతురు.

ఇట్లు బ్రిటీషుదీవుల ప్రజలు, ప్రభుత్వము కూడ తమ దేశ వాణిజ్య పరిశ్రమలను అధినివేశముల వాణిజ్య పరిశ్రమలను అభివృద్ధి జేయించి ప్రపంచ వ్యాపారలాభము నేకచ్ఛత్రముగ ననుభవించుటకు వలసినపను లెల్ల చేయుచున్నారు. అందువలననే బ్రిటీషుసామ్రాజ్యము స్వభావమునుబట్టి రాజకీయసామ్రాజ్యముగాక ప్రపంచవాణిజ్య ఆర్థికసామ్రాజ్యమని చెప్పుట కెంతయు తగియున్నది.

---

# 3

# స్వరాజ్య ప్రయోజనము.

స్వరాజ్యమువలన అధినివేశములకు కలిగినప్రయోజన మేమి? అధినివేశముల రాజ్యాంగములు ప్రజాప్రభుత్వము లగుటవలన రాజకీయముగా నా రాజ్యాంగములకు ప్రపంచ మునందలి స్వతంత్రరాజ్యములతో సరిసమాన గౌరవము కలుగుటయే గాక ఆ యారాష్ట్రముల ప్రజలకు శాంతి భద్రతలును స్వాతంత్ర్యసౌఖ్యములును కలిగినవి. మఱియు ప్రజలకు రాజకీయముగ ప్రభుత్వ పరిపాలనమున పలుకు బడియు కొంత అధికారమును గూడ గలిగినవి.

ఆ యా ప్రజాప్రభుత్వములు ప్రజాప్రతినిధుల శాసన సభలకు బాధ్యతకలిగియున్నందున ప్రజల క్షేమలాభముల కొరకే శాసననిర్మాణము, కార్యనిర్వహణము చేయసాగినవి. పరిపూర్ణబాధ్యతాయుత స్వపరిపాలనము కలిగినంతనే అధి నివేశప్రభుత్వములు చేసిన మొదటి రాజకీయసంస్కరణము, ప్రజలకు గల ఎన్నికహక్కుల నధికము చేయుటయే. నియో జకుల కుండవలసిన ఆస్తినియమము, విద్యానియమము, నియోజకులు పురుషులుగ నుండవలయునను నిబంధన, పౌరు లుగ నుండవలయునను నియమములలో కొన్నిటివలన జన సామాన్యమునకు ఎన్నికహక్కు సులభసాధ్యము గానందు నను, సామాన్యప్రజలు ప్రభుత్వాధికారములందు పాల్గొని

దానివలని ప్రయోజనము పొంది సరియైన ఆలన పాలన పొందుట కవకాశము లేకున్నదనియు, ఉదారప్రజాప్రభుత్వ నాయకులును ప్రజాప్రతినిధులును గలిసి ఆ నియమములందు ముందుగ ఆస్తివిలువను తగ్గించివైచిరి. న్యూజిలాండులో ఆస్తినియమము నసలే తీసివైచిరి. ఆస్ట్రేలియాలోను న్యూజిలాండులోను స్త్రీలకుగూడ ప్రాతినిధ్య మొసగబడెను. ఈ సంస్కరణమువలన సామాన్యప్రజలకు గూడ చాల మందికి ప్రభుత్వములందు పలుకుబడి కలిగెను. సార్వజనిక నియోజనాధికారపద్ధతి అభివృద్ధి జెందినకొలది ప్రజా ప్రభుత్వనామము సార్థకమై ప్రభుత్వములు ప్రజలకు వశములై ప్రజాహితైక కార్యములను చేయుట యధిక మయ్యెను. శాసననిర్మాణము సామాన్య ప్రజాభిప్రాయమును బట్టియే చేయబడసాగెను. ప్రజల క్షేమలాభములను రాజకీయ ఆర్థిక సాంఘికాభివృద్ధినే పరమలక్ష్యముగ నుంచుకొని ఆప్రభుత్వములు పరిపాలనము చేయుచున్నవి. ఆయారాజ్యముల శాసన సభలందలి ప్రజాప్రతినిధులు మాత్రమేగాక కార్యనిర్వాహక మంత్రివర్గమును, పరిపాలన శాఖలందలి ఉద్యోగులును సామాన్యప్రజల యభిప్రాయములను గూడ మన్నింపవలసినవారైరి. తాము జన సామాన్యము నేలు ప్రభువులుగాక ప్రజలసేవకుల మని గ్రహించిరి. ప్రజా ప్రతినిధులకు బాధ్యతలేని భరతఖండ ప్రభుత్వమునందువలెగాక అచ్చటి ప్రభుత్వోద్యోగు లెల్లరు అడకువతో ప్రజాసేవ చేయుచుందురు. ఉదాహరణమునకు

అచ్చటి పోలీసుశాఖ ప్రభుత్వముయొక్క నిరంకుశపాలనము నకు స్వాతంత్ర్య నిగ్రహ విధానమునకు తోడ్పడు యంత్రము గాక ప్రజాసేవకొరకు, సహాయముకొరకు, రక్షణకొరకు నేర్పరుపబడిన సేవకసంఘముగానున్నది.

ఇక ప్రజలకు గల వ్యక్తిస్వాతంత్ర్యము అనగా అక్రమముగ నిర్బంధింపబడకుండు హక్కు, వాగ్రచనా ముద్రణ ప్రకటన స్వాతంత్ర్యము, శాంతియుతముగ మీటింగులు చేసికొను సమావేశస్వాతంత్ర్యమును ఇంగ్లాండునందు వలెనే సామాన్యధర్మములుగా నంగీకరింపబడి ప్రభుత్వవర్గముచే మన్నింపబడుచున్నవి. అధినివేశములందు ధర్మపరిపాలన శాఖయు నింగ్లాండునందు వలెనే పరిపాలకవర్గమునకు లోబడని స్వతంత్ర ధర్మసంస్థయై ప్రజలయొక్క వ్యవహారధర్మములను చక్కగ పరిష్కరించుటయే గాక ప్రజల స్వాతంత్ర్య స్వత్వములను గూడ చక్కగ కాపాడి ప్రభుత్వమువలన అన్యాయములు జరుగకుండ చేయుచున్నది.

ప్రభుత్వాదాయవ్యయవిధానము - పన్నుల పద్ధతి:

ప్రపంచమునందుగల ఇతర స్వతంత్ర ప్రజాప్రభుత్వములవలెనే అధినివేశములుగూడ బీదల ననలే బాధించనట్టియు, ధనికులకుగూడ అధిక భారముగానట్టియు, పన్నులనే విధించుపద్ధతిని అవలంబించినారు. మఱియు సామాన్యజనుల జీవనాధార వస్తువులపైన సుంకములు విధింపక కేవల సుఖాసక్తుల కుపయోగించు వస్తువులపైననే హెచ్చుసుంకములను విధించు

చున్నారు. ప్రభుత్వాదాయమున చాలభాగమునుంకములవల
ననే గ్రహించుచున్నందున విదేశవస్తువుల పోటీనుండి స్వదేశ
పరిశ్రమలను కాపాడుటకు నవకాశము కలుగుచున్నది.
అదిగాక ప్రభుత్వమువారు విధించు ఆదాయముపన్ను, అధిక
లాభములపన్ను, వ్యాపారసంఘులాభములపన్ను, సామాన్య
జనులను బాధించవు గనుక నవియు కొంచె మధికముగ నుం
డును. జనులకు దుర్వ్యసనముల కవకాశము కలిగించు సారా
యము మున్నగు నిషావస్తువులపైన "ఆబ్కారీ" పన్నులు
నధికములే. భూమిపన్ను కర్షకులను బాధించకుండ స్వల్ప
ముగ నున్నది. ఉప్పుపైన అసలే పన్నులేదు. ఈవిధానమున
కును భరతఖండమునందలి పన్నుల విధానమునకును చాల
తారతమ్యము కనబడుచున్నది. మనదేశమున పన్నుల మొ
త్తములో నూటికి ౨౭.౩ వంతులపైబడి భూమిపన్ను ౪.౯
వంతులు ఉప్పుపన్ను విధింపబడుచున్నవి. ఆబ్కారీపైన నూ
టికి ౧౩.౯ వంతులుగ నున్నది. పన్నులభారము చూచినను
బీదలు ధనికులకన్న నూటికి ౪౦ వంతు లధికముగ భరించు
చున్నట్లు అర్థశాస్త్రజ్ఞులు నిర్ణయించినారు.

అధినివేశములందలి ప్రభుత్వము ప్రజలవలన గ్రహించు
పన్నులు ప్రజలపైన పంచినచో సాలుకు ఒకమనిషికి చెల్లించు
మొత్తము మనదేశముకన్న చాల అధికముగనే కనుపడు
చున్నది. అట్లే ఆదేశముల అర్థసంపదయు ప్రజల దామాషా
ఆదాయముగూడ నధికములే.

## రోజు 1 కి మనుష్యుని దామాషా ఆదాయము.

| దేశము. | ప్రాతఅంచనా. | క్రొత్తఅంచనా. | సాలు ౧కి మనుష్యుడు భరించవలసిన పన్ను. |
|---|---|---|---|
| | రు. అ. పై. | రు. అ. పై. | పౌన్లు. షి. పెన్నిలు. |
| అమెరికా | ౩- ౦- ౦ | ౫- ౦-౧౧ | ౬- ౧- ౧౧ |
| ఇంగ్లాండు | ౨- ౧- ౮ | ౩- ౪- ౯ | ౧౫- ౨- ౮ |
| ఆస్ట్రేలియా | ౨- ౪- ౦ | ౪- ౦- ౮ | ౯- ౧- ౬ |
| కెనడా | ౧-౧౦- ౪ | ౩-౧౨- ౯ | ౬-౧౨- ౪ |
| జర్మని | ౧- ౩- ౮ | ౧- ౬- ౪ | ౫- ౬- ౫ |
| జపాను | ౦-౧౨- ౯ | ౦-౧౪- ౩ | ౨- ౧౧- ౮ |
| భరతఖండము | ౦- ౧- ౭ | ౦- ౩- ౨ | ౦- ౮- ౦ |

దేశసంపద, పన్నులపద్ధతియు చూచినచో అన్ని అధినివేశములలోని దామాషా ఆదాయము ఇంగ్లాండుతో సరిపోలుచున్నట్లు తెలియగలదు.

భారతదేశమున మాత్రము ప్రజల దామాషా ఆదాయము అతిహీనముగ నున్నది. ఈ అంకెయైనను ధనవంతుల ఆదాయము చేర్చగా వచ్చినది. దేశప్రజలలో నూటికి ౭౦ వంతులగు కర్షకుల దామాషా ఆదాయము నేడు రోజుకు ఒక అణాకన్న నెక్కువలేదని అర్థశాస్త్రజ్ఞులు నిర్ణయించినారు.

అధినివేశ ప్రభుత్వములు ప్రజలవలన గ్రహించు పన్నులే గాక ఇతర విధములగు ఆదాయములు గూడ కలిపి ఆ దేశప్రజల ఆర్థిక సాంఘికాభివృద్ధికి క్షేమమునకు వలసిన పనులకే చాలవరకు వినియోగించుచున్నారు. విద్య, వైద్యము, ఆరోగ్యము, దారిద్ర్యనివారణము, ఆర్థికాభివృద్ధి సాధనములు, మున్నగువాని కధికధనము వెచ్చించి సైన్యము బు

ణము, పరిపాలనము, మున్నగువానికి మితవ్యయము చేయుచున్నారు. *ఆయా దేశముల సైనికవ్యయము చూచినచో అధినివేశము లెంత తక్కువ వ్యయముచేయుచు న్నవో తెలియును.

౧౯౨౭ - ౨౮ లో మొత్తము వ్యయములో

సైనికవ్యయము నూటికి :

| | |
|---|---|
| భరతఖండము | ౪౫ . ౨౯ |
| జపాను ... ... | ౨౬ . ౫౭ |
| ఇటలీ ... ... | ౨౩ . ౪౬ |
| ఫ్రాన్సు ... ... | ౧౯ . ౭౫ |
| అమెరికా ... ... | ౧౬ . ౦౯ |
| బ్రిటిషుదీవులు ... ... | ౧౪ . ౭౫ |
| జర్మనీ ... ... | ౭ . ౧౬ |
| ఐరిషుఫ్రీస్టేటు ... ... | ౭ . ౨ |
| న్యూజిలాండు ... ... | ౩ . ౯ |
| కెనడా ... ... | ౨ . ౯ |
| దక్షిణాఫ్రికా ... ... | ౨ . ౪ |
| ఆస్ట్రేలియా ... ... | ౨ . ౪ |

---

* 'ఐరిషుఫ్రీస్టేటు' అధ్యాయము చివర ఆదాయ వ్యయ పట్టిక చూడుడు.

వేతనముల పద్ధతి:

| దేశము | దేశములో దామాషాగ సాలుకు మనిషి 1కి ఆదాయ మెన్ని రూపాయలు | పట్టణములందు సాలు 1కి మనిషి 1కి వచ్చు కూలి. రూపాయలు | సాలుకు ప్రభుత్వము లోచిన్న గుమాస్తాల వంటి ఉద్యోగుల జీతములు. రూపాయలు | సాలుకు ప్రభుత్వము లో పెద్దఉద్యోగస్థుల జీతములు రూపాయలు |
|---|---|---|---|---|
| దక్షిణాఫ్రికా సమితి | ... | ... | ౧,౭౬౬ | ౨౧,౩౩౩ |
| బ్రిటీషుదీవులు | ౧,౨౪౦ | ౧,౩౩౩ | ౧,౨౬౬ | ౪౦,౦౦౦ |
| కనడా | ౧,౪౨౦ | ౨,౬౨౦ | ౧,౬౫౦ | ౨౯,౪౦౦ |
| అమెరికా | ౧,౭౫౦ | ౨,౮౫౦ | ౩,౧౨౫ | ౨౯,౪౦౦ |
| జర్మనీ | ౫౨౦ | ౧,౧౪౦ | ౧,౦౦౦ | ౧౪,౮౬౦ |
| జపాను | ౨౮౫ | ౬౯౫ | ౬౫౦ | ౭,౭౦౦ |
| భరతఖండము | ౯౪ | ౨౪౦ | ౩౬౦ | ౪౭,౦౦౦ |

ప్రభుత్వ ఋణ పద్ధతి:

అధినివేశ రాజ్యముల యభివృద్ధికి, సాధనములైన రైళ్లు రాకపోక మార్గములు, నౌకాశ్రయములు, జలాధారములు, తంతులు మున్నగు నిర్మాణముల కొరకమితధన మావశ్యక మైనందున ఆదేశముల ప్రభుత్వములు కొన్నికోట్ల పౌనులు ఋణముచేసెను. *వారు జేసిన ఋణములందు నూటికి డెబ్బది

*"ఈ ప్రకరణము చివరనున్న వివిధదేశముల జనసంఖ్య ఆదాయము, ఋణము" అను పట్టిక చూడుడు.

మైనవంతు లిట్టివే. వారు నిర్మించిన ప్రయోజనకర సాధనములవలన అర్థసంపద, అర్థోత్పత్తి, వాణిజ్యము ద్విగుణీకృతమయ్యెను. అందువలన వారి ఋణముల వడ్డీలను అసల్లునుకూడ కొంతవరకు ఏటేట తీర్మానింపగలుగుచున్నారు. కెనడా దేశమున ౧౯౨౩ లోనుండిన ఋణమున ౧౯౨౮ నాటికి ౧౬ కోట్ల డాలర్లు తగ్గిపోయెను. ఋణము తగ్గినను తగ్గకున్నను అన్ని అధినివేశ రాజ్యములవారి అర్థసంపద, ఆర్థికపరపతి యత్యధికముగ నున్నవి. అందువలన వారి ఋణపత్రములకు విలువ యధికము. వారి కీఋణము భారముగ లేనేలేదు.

ఋణవిషయమున ఐరిషు ఫ్రీస్టేటు చాల యదృష్టవంతమగు దేశమని చెప్పవచ్చును. ౧౯౨౨ లో అధినివేశ స్వారాజ్యము పొందునాటికి బ్రిటీషుదీవులకు ౭,౭౨,౧౦,౦౦,౦౦౦ పౌనుల ఋణ ముండెను. దీనిలో న్యాయముగ భరింపవలసినట్లు తీర్మానింపబడు మొత్తము నిచ్చుకొనుట కీరాజ్యమువా రంగీకరించియుండిరి. అంతట సాలుకు ౭,౫౦,౦౦౦ పౌనులచొప్పున ౬౦ సంవత్సరము లిచ్చుకొనవలసి వచ్చెను. అయితే బ్రిటీషువారికి నెయ్యమగు ఉత్తర ఐర్లాండు దేశమునకును ఐరిషు ఫ్రీస్టేటువారికిని వచ్చిన సరిహద్దు వివాదమందు బ్రిటీషువారితో వీరు పోరాడగా వీరిపోరు పడలేక వారీఋణమును ౧౯౨౫ లో వదలుకొనిరి. ఇట్లు ఋణవిమోచనమై ఐరిషు ఫ్రీస్టేటువారు తాము చేసికొనిన మూడుకోట్ల పౌనులుమాత్రమె నేడు లోకుల కివ్వవలసియున్నారు.

భరతఖండము బ్రిటీషువారి వశమైనదిమొదలు ఋణము పెరిగి పెరిగి ౧,౧౧౩ కోట్ల ౨ లక్షలరూపాయలింకను నిలిచి యున్నది. మన మింతవరకు ౧,౦౪౯ కోట్ల ౨౦ లక్షల రూపాయిలు వడ్డీ క్రిందనే చెల్లించి యుంటిమి. దీనిలో చాల భాగము సామ్రాజ్యలాభముకొరకే వినియోగింపబడెను. దీనిలో ౨౨౯ కోట్ల రూపాయిలైనను బ్రిటీషువారు మనకు ముజరా యివ్వవలసియున్నారని కాంగ్రెసువిచారణసంఘమువారు సూచించి యున్నారు. ఈ ఋణమందు ౧౨౩ కోట్ల రూపాయిల వ్యవసాయజలాధారములును, ౨౩౬ కోట్ల రూపాయిల విలువగల రైళ్ళును అర్థోత్పాదక ధనమని మనకు కాగితములపైన చూపుచున్నారు. కాని ఈ రైళ్ళు విశేష ధనవ్యయమునకు కారణములై సైన్యముల రాకపోకలకే ఉపయోగకరములుగ నున్నవి. మఱియు విదేశవర్తకులకే లాభకరములుగ నున్నవి. విదేశరైళ్ళతో పోల్చిచూచినచో వీనివలన వచ్చు లాభము శూన్యమని చెప్పవచ్చును. అందువలన మన ఋణము అధినివేశఋణములవలె ఉపయుక్త అర్థోత్పాదక ప్రయోజకర ఋణముగాకున్నది. మన అర్థసంపదను వర్తకమును చూచినను మన కీఋణభారము తగనిదిగనే కనబడుచున్నది. ఈ ఋణతీర్మానముకొరకు అధికమొత్తము వినియోగింపవలసి వచ్చి ప్రజల క్షేమము వెనుకబడుచున్నది. ఋణతీర్మానవ్యయము అధినివేశములందు ప్రజల శ్రేయమున కాటంకము కలిగించుటలేదు.

అర్థోత్పత్తి - అర్థసంపద:

పదునారవ శతాబ్దములో నేమూలనున్నవో ఎవ్వరెఱుగని మారుమూలభూములు, అడవిదేశములు నేడు సకల సంపదల కిరవులై నాగరికత కాటపట్టులుగ నుండి ఐరోపాదేశములతో సరిసమానభాగ్యము లనుభవించుచున్నవి. నేడు ఆస్ట్రేలియా న్యూజిలాండు కెనడా దక్షిణాఫ్రికాల దేశాదాయము ప్రజల కొక్కొక్కనికి పంచిచూచినచో బ్రిటీషు దీవులఆదాయముకన్న నధికముగ నున్నది. అచ్చటి వాణిజ్య వ్యవసాయ పరిశ్రమలు మహోన్నతి జెందినవి. భారతదేశము దారిద్ర్యమున బడియుండగ నిన్న మొన్న వలస కేగిన ప్రజ లిట్లభివృద్ధి చెందగలుగుటకు కారణ మచ్చటి ప్రజలకభివృద్ధి మార్గము లధికమగుట. అచ్చటి ప్రభుత్వము లాదేశప్రజలకు పెక్కువిధములుగ తోడ్పడి అర్థోత్పత్తి సాధనముల నెల్ల అభివృద్ధి చేయుట. రాకపోకలు, జలాధారములు, రైళ్ళు, నౌకాశ్రయములు, విద్యుచ్ఛక్తి యంత్రములును విశేషధనవ్యయ కారణములుగ నుండును. బలవంతమును ధనవంతమునగు ప్రభుత్వమువారు సులభసాధ్యములుగ చేసిననేగాని అవి సామాన్యులకు సౌలభ్యములు కావు. ఈ దేశముల ప్రభుత్వములు వీనిని ప్రజల కందుబాటు చేసిరి. ఆర్థికాభివృద్ధికి వలసిన శాసనములను జేసిరి. సంరక్షణ సుంకములను విధించిరి. స్వదేశీయ పారిశ్రామికులకు ప్రోత్సాహక బహుమతు లొసగిరి. అభివృద్ధిమార్గము లరయుటకు శాస్త్రపరిశోధనలు

సలిపిరి. ఈ ప్రభుత్వము లిందుకొఱకు చేయని కార్యమే లేదని చెప్పవచ్చును.

అధినివేశప్రభుత్వములు వాణిజ్యవ్యవసాయపరిశ్రమల యభివృద్ధికొఱకు శాసనముల జేసియు, ధన మిచ్చియు స్వయముగా తోడ్పడుటయేగాక వాని యభివృద్ధికి సాధనములగు సహకార భీమాబ్యాంకి ఉద్యమములను ప్రోత్సహించి అవి చక్కగ వర్ధిల్లునట్లు కట్టుదిట్టములు శాసనములు చేయుచున్నవి. భీమావ్యాపారము దేశాభివృద్ధికి తోడ్పడిన ట్లేవ్యాపారము తోడ్పడజాలదు. ఏలనన, ప్రజలకు సాహాయ్యము సౌఖ్యము కలిగించు జీవనాధారమార్గములను గల్పించుటయే గాక, విశేషధనమును ప్రోవుజేసి ఆమూలధనమునెల్ల దేశాభివృద్ధికరకార్యములందు పెట్టుబడులక్రింద నుపయోగించును. కెనడా దేశములోని రైళ్ళలో సగము భీమాకంపెనీలవే. ఆ దేశముయొక్క వాణిజ్యపరపతి ప్రోత్సాహకనిధులు, వ్యవసాయ ఋణవిమోచననిధులు భీమాకంపెనీల పెట్టుబడులవలననే స్థాపింపబడినవి. ప్రభుత్వఋణములో కొంతభాగము భీమాకంపెనీల పెట్టుబడియే. ఇట్లు దేశమునందలి అన్ని సంస్థలను విరివిగ పోషింపగల భీమావ్యాపారము కెనడాప్రభుత్వముయొక్క ముఖ్యపోషణమున నుండుటలో నాశ్చర్యము లేదు. నేడా దేశమున ౧,౫౦౦ కోట్ల రూపాయల భీమావ్యాపారము జరుగుచున్నది. అమెరికా బ్రిటీషుదీవుల తరువాత కెనడా దేశమే అగ్రస్థాన మలంకరించుచున్నది. ఆస్ట్రేలియాలో ౬౦౦ కోట్ల రూపాయిల వ్యాపారము, న్యూజిలాండులో

౧౫౯ కోట్లరూపాయిల వ్యాపారము, భరతఖండమున ౬౦ కోట్లరూపాయిల వ్యాపారము జరుగుచున్నది. ఈభీమాకంపెనీలవలన నా దేశములయొక్క వాణిజ్య మభివృద్ధి జెందినది.

అధినివేశ ప్రభుత్వములు బ్యాంకివ్యాపారమునను శ్రద్ధవహించినవి. కెనడాలో ౧౧ గొప్పబ్యాంకులు ౪,౦౬౧ చిన్నశాఖలు కలవు. న్యూజిలాండులో ౬ పెద్దబ్యాంకులు ౫౦౪ బ్రాంచీలు గలవు. ౧౯౨౧ లో దక్షిణాఫ్రికాలో ప్రభుత్వమువారి ఆదరమున పెద్దరిజర్వుబ్యాంకి స్థాపింపబడెను. దీనిమూలధనము ౧౦ లక్షల పౌనులు. దీనిలో 3 లక్ష లితర బ్యాంకులే పెట్టుబడి పెట్టినవి. ఈ బ్యాంకు లెల్ల ఆదేశముల వాణిజ్యవర్తకసంఘముల కెల్ల సాహాయ్యము చేయుచుండును. పెద్ద బ్యాంకులలో ప్రభుత్వమువారికి రిజర్వు నిలువధన ముండును. వానినోట్లకు చలామణి గౌరవము కలదు. వానికి హామీగా నూటికినలుబదివంతుల బంగారము నిలువయుండును.

పాడిపంటల యభివృద్ధికి సహకారోద్యమము వంటిది లేదని అధినివేశములవారు గ్రహించిరి. వీనికి వలసిన శాసన నియమములను చేసియు, ముందుగా సహకారసంఘములను నెలకొల్పియు, వానిని జాగ్రత్తగా పరిశీలించి కాపాడియు ప్రభుత్వమువా రనేకవిధములుగ తోడ్పడుచున్నారు. పాడి దినుసులుచేయు సంఘములు, ఉన్నిసంఘములు, వ్యవసాయ పరపతి సంఘములు, యూనియనులు, వివిధపరిశ్రమలకు చెందిన సహకార క్రియవిక్రయ ఉత్పత్తిసంఘములు, సమ్మేళనములు, అసంఖ్యాకములుగ నభివృద్ధి జెందుచు అచ్చటి పాడి

పంటలను, పరిశ్రమలను, వాణిజ్యములను ప్రోత్సహించి లాభకరములుగా చేయుచున్నవి.

అధినివేశముల ప్రభుత్వములు తమ దేశవాణిజ్య వ్యవసాయపరిశ్రమల యభివృద్ధికొరకు చేసినకృషియు ధన వ్యయమును సఫలత గాంచెనని ఆ యా దేశముల పాడిపంటలు, పశుసంపద, రైలుదారి, నితర దేశములతో పోల్చిచూచినచో తారతమ్యము తెలియగలదు. అధినివేశములందలి కృషి సంపదయు, పశుసంపదయు మొదట హీనస్థితియం దుండెను. అట్టిదేశములు స్వరాజ్యము సంపాదించిన పిదప అత్యద్భుతముగ అభివృద్ధి జెందెను.*

---

* వివిధ దేశములకృషిసంపద.

మంచి ప్రకృతిసంపద కలిగియు, మంచి నాగరికత కలిగియు పారిశ్రామికముగ భారతదేశము తక్కిన అన్నిదేశములకన్న వెనుకబడియుండుట జగద్విదితము.

మన జనసంఖ్యలో నూటికి ౭3 మంది కృషివలన జీవించుచున్నారు. ౧౭ మందిమాత్రము పరిశ్రమలు ఎగుమతి దిగుమతులు చేసి జీవించుచున్నారు. తక్కిన దేశములలో నిందుకు భిన్నముగ నున్నది. మనదేశము కృషి సంపదయం దైన బాగున్నదా?

| దేశము | మొత్తపు భూమిలో సాగు కుపయోగించు భూమి నూటికి యెన్ని వంతులు | పచ్చిక బయళ్లు నూటికి ఎన్ని వంతులు. | తోటలు ఎన్ని వంతులు. | ఇతర పంటలు నూటికి ఎన్నివంతులు. | అడవులు ఎన్నివంతులు. | నిరుపయోగమైన భూమి ఎన్నివంతులు. |
|---|---|---|---|---|---|---|
| ఫ్రాన్సు | ౪౮.౬ | ౨౦.౨ | ౩.౫ | ౨.౨ | ౧౭.౭ | ౮.౮ |
| బ్రిటీషు దీవులు | ౨౬.౭ | ౪౩.౪ | .౪ | .౧ | ౪.౬ | ౨౪.౮ |
| జర్మనీ | ౫౦.౪ | ౧౬.౯ | ౧.౨ | ... | ౨౮.౪ | ౪.౧ |
| ఇటలీ | ౫౧.౯ | ౨౧.౨ | ౪.౫ | ౧.౨ | ౧౮.౩ | .౩.౯ |
| కెనడా | ౩౧.౪ | ౧౮.౭ | .౬ | ... | ౨౬.౫ | ౨౩.౫ |
| ఆస్ట్రేలియా | ౨౧ | ౫౦ | ... | ... | ... | ౨౦ |
| భారతదేశము (బ్రిటీషు రాజ్యము) | ౬౨ | ... | ... | ౧.౦ | ౧౪ | ౨౩ |

పైన చూపబడిన అంకెలనుబట్టి తక్కిన దేశములకన్న మనకు సారవంతమైన భూమి చాల కలదని తెలియుచున్నది. అయినను మన కర్షకులు దరిద్రులగుటను, ప్రభుత్వ ముపేక్షించుటను పంట బాగుగ లేదు.

౧౯౧౯-౨౦, ౨౦-౨౧ సంవత్సరములలో దామాషా పంటలు.

ఎకరమున కెన్ని పౌనులు.

| దేశము | గోధుమ | బార్లీ | మొక్కజొన్న | అవిశె | వరిధాన్యము |
|---|---|---|---|---|---|
| బ్రిటీషు దీవులు | ౧౭౬౧ | ౧౫౫౦ | ... | ... | ... |
| ఫ్రాన్సు | ౧౧౭౫ | ౧౦౧౫ | ౭౭౨ | ౪౨౯ | ౫౩౪ |
| ఇటలీ | ౯౦౦ | ౮౮౫ | ౧౩౫౪ | ౪౬౩ | ౩౫౦౦ |
| అమెరికా | ౮౮౫ | ౧౦౮౮ | ౧౬౭౪ | ౩౩౦ | ౧౮౫౫ |
| కెనడా | ౮౪౭ | ౧౦౮౮ | ౩౦౪౬ | ౩౨౧ | ... |
| ఆస్ట్రేలియా | ౮౮౫ | ౭౦౨ | ౧౪౨౫ | ౩౪౮ | ... |
| జపాను | ౧౩౧౭ | ౧౪౯౬ | ౧౪౭౮ | ౪౦౧ | ౩౨౩౨ |
| భరతఖండము (బ్రిటీషు రాజ్యము) | ౬౮౮ | ౯౯౪ | ౧౧౬౩ | ౨౫౫ | ౧౩౩౬ |

ఇట్లు ప్రకృతసంపద కలిగియు భారతదేశము వ్యవసాయమున వెనుక బడినది. వ్యవసాయాభివృద్ధికొఱకు ఇంగ్లాండు మున్నగు ప్రభుత్వములు చాల సొమ్ము వ్యయము చేయుచున్నవి. అధినివేశము లమితవ్యయము చేయుచున్నవి. భారతదేశమున నిది చాల స్వల్పము.

వేయిమంది జనసంఖ్యకు అయా దేశములలో వ్యవసాయముకొరకెంత వ్యయము?

| | | |
|---|---|---|
| బ్రిటీషుదీవులు | ౯౬౦ | రూపాయిలు |
| జర్మని (యుద్ధపూర్వము) | ౯౪౫ | ,, |
| అమెరికా | ౧౦౨౦ | ,, |
| (అధినివేశము లమెరికాతోబాటు) | | |
| భారతదేశమున | ౭౯ | రూపాయిలు! |

| దేశము | ౧౯౨౦ లో ౧౦౦ మందికి ఎన్ని పశువులు | ౧౯౧౨ లో ౧౦౦ మందికి ఎన్నిగొఱ్ఱెలు |
|---|---|---|
| ఆస్ట్రేలియా | ౨౫౯ | ౧౬౭ |
| న్యూజిలాండు | ౧౫౦ | ౧౮౫౪ |
| దక్షిణాఫ్రికా | ౧౨౦ | ౫౭౮ |
| ఐక్యరాష్ట్రీయ ఫ్రీస్టేటు (౧౯౧౨) | ౧౩౬ | ౧౦౫ |
| కెనడా | ౮౦ | ౩౭ |
| భరతఖండము | ౬౧ | ౭ |





౧౯౨౪ నాటికి పదివేల ప్రజలకు రైలుదారి ఎన్నిమైళ్లు?

| | | | |
|---|---|---|---|
| ఆస్ట్రేలియా | ... | ... | ౪౭. ౧ |
| కెనడా | ... | ... | ౪౫. ౬ |
| న్యూఫౌండ్లాండు, | ... | ... | ౩౬. ౨ |
| న్యూజిలాండు | ... | ... | ౨౫. ౩ |
| దక్షిణాఫ్రికా | ... | ... | ౧౭. ౦ |
| అమెరికా సయుంక్తరాష్ట్రములు | | | ౨౩. ౬ |
| ఫ్రాన్సు | ... | ... | ౮. ౫ |
| జర్మనీ | ... | ... | ౬. ౦ |
| ఇంగ్లాండు, బ్రిటీషుదీవులు | | ... | ౫. ౫ |
| భరతఖండము | ... | ... | ౧. ౬ |

రైళ్ళ నిర్మాణమునందు వలెనే అధినివేశములలోని ఎగుమతి దిగుమతి వర్తకముయొక్క అభివృద్ధి చూచినచో ప్రజాప్రభుత్వములు చేసిన కృషి సఫలత జెందినట్లు తెలియగలదు.

దేశములో సాలు ౧ కి జరుగుచున్న మొత్తము వ్యాపారము సగటున తల ౧ కి చూచినచో నిట్లున్నది.

| | | |
|---|---|---|
| న్యూజిలాండు | ౬౭ | పౌనులు. |
| ఆస్ట్రేలియా | ౪౯ | ,, |
| కెనడా | ౪౯ | ,, |
| ఇంగ్లాండు | ౩౯ | ,, |
| భరతఖండము. | ౧ | ,, |

పదునైదేండ్లలో అధినివేశరాజ్యముల వర్తకము ద్విగుణీకృత మయ్యెను.

| దేశము | దిగుమతి వర్తకము (సాలు దామాషా) | |
|---|---|---|
| | ౧౯౧౧ - ౧౩ | ౧౯౨౪ - ౨౬ |
| | పౌనులు | పౌనులు |
| కెనడా | ౫౪,౮౭,౭౮,౦౦౦ | ౯౧,౮౩,౮౫,౦౦౦ |
| దక్షిణాఫ్రికా | ౩,౮౧,౨౯,౦౦౦ | ౬,౩౪,౦౭,౦౦౦ |
| ఆస్ట్రేలియా | ౭,౪౯,౫౮,౦౦౦ | ౧౪,౯౭,౯౭,౦౦౦ |
| న్యూజిలాండు | ౨,౦౯,౩౩,౦౦౦ | ౫,౦౨,౯౧,౦౦౦ |
| భరతఖండము | ౧౦,౭౨,౯౩,౦౦౦ | ౧౭,౪౬,౬౮,౦౦౦ |

| | ఎగుమతి వర్తకము (సాలు దామాషా) | |
|---|---|---|
| | ౧౯౧౧ - ౧౩ | ౧౯౨౪ - ౨౬ |
| | పౌనులు | పౌనులు. |
| కెనడా | ౩౦,౬౭,౬౫,౦౦౦ | ౧,౨౧,౨౧,౯౪,౦౦౦ |
| దక్షిణాఫ్రికా | ౬,౦౬,౯౯,౦౦౦ | ౭,౪౪,౬౬,౦౦౦ |
| ఆస్ట్రేలియా | ౭,౯౦,౩౪,౦౦౦ | ౧౪,౩౩,౬౦,౦౦౦ |
| న్యూజిలాండు | ౨,౧౨,౬౧,౦౦౦ | ౫,౧౦,౫౦,౦౦౦ |
| భరతఖండము | ౧౫,౭౧,౯౩,౦౦౦ | ౨౬,౩౧,౭౪,౦౦౦ |

అధినివేశరాజ్యముల వాణిజ్యమున మొదట కేవలము ప్రకృతిసంపదకు పాడిపంటలకు సంబంధించిన ముడివస్తువులే ఎగుమతి చేయబడుచుండెను. తరువాత వివిధ ఖనిజ జంతువృక్ష సంబంధములగు పాడిపంటల నెల్ల తమపారిశ్రామికనైపుణ్యముచేత నిర్మాణవస్తువులుగ జేసి అధిక విలువగల వానిగ మార్చి ఎగుమతి చేయసాగిరి. శాస్త్రపరిశోధనలు, సహకారము, సాముదాయిక ఉత్పత్తియు వారి వ్యవసాయపరిశ్రమల నత్యద్భుతముగ నభివృద్ధి చేసినవి. నేడు వారు చేయని పరిశ్రమయే లేదని చెప్పవచ్చును. వారి పరిశ్రమలను చూచినచో మన దేశముకూడ అభివృద్ధి పొందుట కవకాశము కలదని తెలియగలదు.

కెనడాలోని ముఖ్యపరిశ్రమలు కాగితములు, పిండి, మాంసము, వెన్న, జున్ను, కలప, నార, ప్రత్తి, మోటార్లు, విద్యుచ్ఛక్తి వస్తువులు, రబ్బరు, పంచదార మొదలగునవి. ఏటేట ౧౯ కోట్ల డాలర్ల కాగితములు, ౧౯ కోట్ల డాలర్ల పిండి, ౧౬ కోట్ల విలువ మాంసము, ౧౨ ౧/౪ కోట్ల విలువ జున్ను వెన్న తయారగుచు ఎగుమతులందు ప్రాముఖ్యము వహించినవి. దక్షిణాఫ్రికాలో మొదట గొఱ్ఱెల ఉన్ని, పాడిదినుసుల వ్యాపారమే జరుగుచుండెను. నేడు ౯౦ కోట్ల పౌనుల విలువగల వివిధపారిశ్రామిక వస్తుజాల ముత్పత్తి చేయబడుచున్నది. ఎగుమతులలో ముఖ్యవస్తువులు బంగారు, ఉన్ని, వజ్రములు. ప్రపంచములోని బంగారములో సగము దక్షిణాఫ్రికావారు ఉత్పత్తి చేయుచున్నారు. ఇక పాడిదినుసుల

ఉత్పత్తికి వీరు స్థాపించిన డయిరీఫారములు క్రీమరీలు చాల గొప్పవిగా నున్నవి. ప్రభుత్వమువారు ఈపరిశ్రమల కెల్ల జాగ్రత్తగ కట్టుదిట్టములు చేయుచున్నారు. దక్షిణాఫ్రికా వర్తకములోని తోటలవలన నుత్పత్తియగు వస్తువులు, పంచదార మున్నగునవి వివిధములు కలవు. ప్రపంచమున వీరెగుమతిచేయని పారిశ్రామిక వస్తువులే లేవు.

ఆస్ట్రేలియాదేశము చాలవరకు పచ్చికబయళ్ళదేశము. అందువలన గొఱ్ఱెలు పశువులకు సంబంధించిన మాంసము, వెన్న, పాడిదినుసులు, ఉన్ని మొదలగు ఇతరవ్యాపారము లధికము. దేశముయొక్క ఎగుమతివ్యాపారమున నూటికి ౫౨ వంతులు గొఱ్ఱెలఉన్ని, జీవజంతువుల మాంసము, తోళ్ళు, వెన్న, జున్ను మొదలగు పాడిదినుసులకు సంబంధించినవే. వ్యవసాయమునకు సంబంధించిన దిగుమతులు నూటికి ౨౮ వంతులు. పాడిదినుసులు మున్నగునవి కౌశలపరిశ్రమలచేత రూపాంతరము నొందుటవలన నధికవిలువ కలిగి లాభకరముగ నున్నవి. ఆస్ట్రేలియావారు నేడు తమ పరిశ్రమలను బాగుగా నభివృద్ధి చేయుచున్నారు. ప్రతిసాలున ౮౫ కోట్ల పౌనుల విలువ అర్థోత్పత్తి యగుచున్నది.

న్యూజిలాండులో మొదట జీవజంతువులే లేవు. అట్టిదేశమున నేడు మొత్తము ఎగుమతిలో నూటికి ౯౮ వంతులు పాడిదినుసులు, గొఱ్ఱెల ఉన్ని, వెన్న, జున్ను, మాంసము మొదలగువానికి సంబంధించిన వ్యాపారమే. ఆ దేశములోని

"గ్లాక్సో" పాలడబ్బాలను మన దేశమునకు సైతము ఎగుమతి చేయుచున్నారు!

ఐరిషు ఫ్రీస్టేటు వ్యవసాయదేశమే. గోధుమలు, కూరగాయలు, బంగాళాదుంపలు విరివిగ పండును. పాడిపంటలు బాగున్నవి. వస్తునిర్మాణపరిశ్రమ నేడత్యద్భుతముగ నభివృద్ధిగాంచుచున్నది. ఐరిషుఫ్రీస్టేటుయొక్క ఆర్థికాభివృద్ధిచరిత్రచూచినచో స్వతంత్రరాజ్యము పొందగలుగు అభివృద్ధి తెలియగలదు. ఐరిషుఫ్రీస్టేటు స్థాపింపబడిన రెండేండ్లకే ౧౯౨౪ లో ఒక చట్టమువలన ఎగుమతి చేయబడు కోడిగుడ్లయొక్క జాతి, పరిశుద్ధత, ఎగుమతి విధానము, నిలువచేయు పద్ధతులు, నిర్ణయించుట కేర్పాట్లు చేయబడెను. చెడ్డగుడ్లు నిషేధింపబడుచున్నవి. మఱియొక చట్టమువలన వెన్నవ్యాపారమునకు తగిన కట్టుబాట్లు చేయబడెను. రిజష్టరు చేయబడిన "క్రీమరీ" కంపెనీలు పాడిదినుసుల కార్ఖానాలు ఎగుమతి వర్తకులు మాత్రమే వెన్న ఎగుమతి చేయునట్లు శాసింపబడెను. వెన్నయొక్క ప్రాశస్త్యమును కట్టుదిట్టముచేసి మునుముందు ఐరిషుదేశముయొక్క వెన్న కొకవర్తక చిహ్నము నేర్పరుప దలచిరి. పాడిదినుసుల వ్యాపారుల సహకార సమ్మేళనసంస్థ నేర్పరచి ప్రజలు విడివిడిగ పెట్టుకొనిన పాడిదినుసుల శాలలను ప్రభుత్వమువారు కొనివేసి వెన్న వ్యాపారమునకు జాతీయార్థిక విలువ నిచ్చిరి. ౧౯౨౫ లో నొక శాసనమువలన పశుజాతిని సంస్కరించుటకొరకు ఆంబోతులను గొఱ్ఱెపొట్టేళ్లను పెంచువారు ప్రభుత్వమువారి అను

మతి పత్రములు పొందవలెనని శాసించిరి. ప్రభుత్వమువా రిందుకొరకు చచ్చు ఆంబోతులను గొఱ్ఱెపొట్టేళ్లను వధించుట కుత్తర్వు లిచ్చి అనేక జంతువులను కొనివేసి పశుజాతిని సంస్కరించిరి. మొదట దీనివలన ప్రజలకు అసంతృప్తి కలిగెను. కాని తరువాత ఆరు వత్సరములలో పశుజాతి పూర్తిగా బాగుపడి, విలువహెచ్చినపిదప తమ హితముగోరిన జాతీయ ప్రభుత్వము చేసినపనికి సంతసించిరి. వీనిని గూర్చి మొదట విమర్శించిన బ్రిటీషువారే నేడీ విధానమును అనుకరింప జూచుచున్నారు. పశుజాతిని సంస్కరించినట్టులే ఐరిష్ ప్రభుత్వమువారు కోళ్లు బాతులు మొదలగు పెంపుడు పక్షిజాతిని, ధాన్యదినుసులను సంస్కరించినారు. ప్రభుత్వమువారు వ్యవసాయ పరపతిసంస్థ నేర్పరచి దీర్ఘవాయిదాల పైన రైతులకు ఋణము లిచ్చియున్నారు. వ్యవసాయ సహకారోద్యమమునకు తోడ్పడదలచి ౧౯౨౭ లో నొక శాసనముజేసి ౫,౦౦,౦౦౦ పౌనుల మూలధనముతో నొక గొప్ప పరపతిసంస్థను స్థాపించుట కవకాశము కల్పించినారు. దేశప్రజలకు వ్యవసాయ వృత్తి విద్య నొసగియు నీటివసతి కల్పించియు మురుగుకాల్వల ఏర్పాటులను చేసియు ౭,౬౦,౦౦౦ యకరముల బంజరుభూమిని కొనివేసి రైతులకు దరఖాస్తులపైన నిచ్చి ప్రజల ఒత్తిడిని తగ్గించియున్నారు.

పరిశ్రమల విషయమున ఐరిషు ఫ్రీస్టేటువారు చేయుచున్న కృషియు ప్రశంసనీయమే. విదేశవస్త్రములపైనను నితర సరకులపైనను అధికసుంకములను విధించి స్వదేశపరి

శ్రీమలను సంరక్షించుటయేగాక పారిశ్రామికులకు ప్రోత్సాహకబహుమతు లొసగుచున్నారు. పరిశ్రమాలయములకు కర్మాగారములకు వలసిన ఆవిరి, గ్యాసు, మోటారుశక్తి, విద్యుచ్ఛక్తియు సులభసాధ్యములగుటకు వలసిన సహాయమును పరిపాలకవర్గమువారే చేయుచున్నారు. ఇంతటితో తృప్తిజెందక మన మైసూరు సంస్థానమువారివలెనే ఆదేశములోని "షానన్" జలాధారమునుండి విద్యుచ్ఛక్తిని విరివిగనుత్పత్తిచేసి దేశములోని కర్మాగారములకు పరిశ్రమలకు తోడ్పడగల గొప్పప్రణాళికను తయారుచేసిరి. ౧౯౨౪ లో వర్తక పరపతి చట్టముప్రకారము పరిశ్రమల ప్రోత్సాహము కొరకు చౌకవడ్డీలపైన ౭,౫౦,౦౦౦ పౌనులు పారిశ్రామికులకు ఋణములిచ్చు విధానమును తీర్మానించిరి. ఏసంస్థయైన నట్లు చేయదలచినచో ౩,౦౦,౦౦౦ పౌనుల ఋణమువరకు తాము పూచీపడెదమనియు ౧౯౨౫ లో నొక శాసనముజేసిరి.

ఆర్థికక్షేమము - కార్మికులు :— కార్మికుల యోగక్షేమముల నారసి వారిజీవితావిధానమును సంస్కరించి వారికి సౌఖ్యము, జ్ఞానము, ఆరోగ్యము కలిగించి వారిని కాపాడిన గాని దేశసంపద వర్ధిల్లదనియు జాతీయాభివృద్ధి కానేరదనియు అధినివేశ ప్రభుత్వములు గ్రహించి యందుకొరకనేకశాసనములను జేసిరి. ఈ విషయమున తక్కిన అన్నిదేశములకన్న ఆస్ట్రేలియా ప్రాముఖ్యము వహించుచున్నది. ఆస్ట్రేలియా కామన్వెల్తు "కార్మికులపాలిటి స్వర్గ"మని పిలువబడుచున్నది. ఆస్ట్రేలియా ప్రభుత్వమువారాదేశమును తెల్లవారిదేశముగా

చేయ సంకల్పించి ౧౯౦౧ మొదలు పెక్కు కట్టుబాట్లుచేసిరి. అచ్చటి తెల్లకార్మికులకు పోటీగా నల్లవారురాకుండగా కట్టుదిట్టములు చేసియున్నారు. యుక్తవయస్సువచ్చిన పురుషులకెల్లరకు ఎన్నికహక్కులిచ్చినందున కార్మికులు రాజ్యాంగమున అధికసంఖ్యగల నియోజకులుగ నున్నారు. అచ్చటి కార్మికులెల్లరు సంఘములుగా నేర్పడి రాజకీయ వ్యవహారములందు బలవంతులైనారు. ౧౯౨౭ లో ఆదేశముననున్న ౩౮౫ కార్మికసంఘములందు ౯,౧౧,౬౫౨ సభ్యులున్నారు. జీవనాధారమునకు తగినవేతనము వారమునకు ౪౪ గంటలు మాత్రము పనిచేయుట అను కార్మికక్షేమ సిద్ధాంతములు ప్రబలినవి. ౪౮౫ కార్మికయజమానుల సంఘములున్నవి. ఇవి బలవంతములై ౧,౨౨,౭౪౦ సభ్యులు కలిగియున్నవి. ఈ కార్మికసమస్యవిషయమున ప్రజాప్రభుత్వము చాలా శ్రద్ధ వహించుచున్నది. పైన చెప్పబడిన కార్మికసిద్ధాంతములు చాల ప్రదేశములలో ఆచరణము జరుగు చున్నవి. కార్మికులు చీటికి మాటికి సివిలు కోర్టులకు బోయి నష్టపడకుండగ ప్రభుత్వమువారు నిర్బంధ మధ్యస్థ తీర్మానపద్ధతి (Compulsory Arbitration System) శాసనమూలమున స్థాపించి కార్మికులకును యజమానులకును వచ్చు వేతనములను గూర్చిన వివాదలును ఇతర పారిశ్రామిక వివాదములును పరిష్కరించుటకు మధ్యవర్తి సంఘసభలను నెలకొల్పిరి. ఈసభల తీర్పులవలన వేతనములు, కూలి, ౧౯౧౧ కన్న ౧౯౨౬ లో నూటికి ౭ వంతులు హెచ్చినవి. పనిలేని రోజులుకూడ కలు

పుకొని ౧౦౦ కి ౪౼౯ వంతులు తీసివేసినను ౭ వంతులు హెచ్చినది. నిరుద్యోగసమస్య లేకుండ జేయుటయేగాక కార్మికులందు ప్రతి స్త్రీయు పురుషుడు బాలబాలికలుగూడ సౌఖ్యముగ జీవించుట కవకాశముగల్పించు విధానమును స్థాపించవలెనని అచ్చటి ప్రభుత్వమువారి యభిప్రాయము. ఇందు కొరకు శాసనవిధు లనేకములు చేయుచుందురు. దేశమునందలి శాసనసభలందు అత్యధిక కార్మిక ప్రాతినిధ్యముగల దేశమున నిట్టిది జరుగుటలో నాశ్చర్యములేదు.

దక్షిణాఫ్రికా ప్రభుత్వమువారును తమ తెల్లజాతి పారిశ్రామికుల క్షేమముకొరకు దేశములోని ఆదిమవాసులు వృత్తికళలందు కౌశలపరిశ్రమలందు జీవించుటను నిషేధించుటయే గాక గనుల చట్టము మున్నగు చట్టములుచేసి అనేక ప్రత్యేక వృత్తులు వ్యాపారములు పరిశ్రమలు భారతీయులుకూడ చేయరాదనియు శాసించిరి. ఇట్టి శాసనము లనేకములు కలవు. దక్షిణాఫ్రికాప్రభుత్వముకూడ ఆదేశమును తెల్లవారిదేశముగ జేయవలయునని సంకల్పించి అట్టికృషి సల్పుచున్నది. దక్షిణాఫ్రికాలోకూడ తెల్లకార్మికులు, ప్రభుత్వమున గొప్ప పలుకుబడి సంపాదించినందున వారికి చాల హక్కులుకలవు.

ఐరిషుఫ్రీస్టేటువారును తక్కిన అధినివేశములవలెనే పారిశ్రామికుల క్షేమమునుగూర్చిన శాసనములను జేసిరి. అచ్చటి విశేషములలో నొకటి ౧౯౨౯ మొదలు నిరుద్యోగ సమస్య లేకపోవుట. దీనికి గారణము ఐర్లాండువారు

ప్రతియేట చాలసొమ్ము వ్యయముచేసి ప్రజోపయోగకార్య ములు జేయుచు, అనేకులకు పనులు గల్పించుటయే. ౧౯-౨౭-౨౮ లో ఆదాయము రాగలట్టియు పనులు గల్పింపగలట్టియు కార్యములకు ౭౪ లక్షల పౌనులు వ్యయము చేయబడెను. రోజుకు రెండణాలన్నర దామాషా ఆదాయముతో యావజ్జీవము గంజితాగుచు కూడు గుడ్డలు లేక, నిలువనీడలేక, అపరిశుభ్రము ననారోగ్యమునగు జీవనము గడపుచు రోగముచ్చినప్పుడు వార్థక్యమున నిరాధారులై పశువులవలె రాలిపోవు జనసామాన్యము, కార్మికులు, రైతులుగల మన దేశవాసులకు పాశ్చాత్యదేశములందును, ఆదేశములతో సరిసమాన సౌఖ్యము ననుభవించు అధినివేశ రాజ్యములలోను ప్రజలు, కార్మికులు, రైతులు గడపు జీవనవిధానము, వారు పొందు సౌఖ్యము సులభముగా అర్థముకావు. అచ్చటి కూలివాడు మన దేశమునందు వలె మాసి తుత్తునియలైన గోచియు బట్టయు తలగుడ్డయుగాని ధరించడు. కంపుగొట్టు పాకలలో జీవించడు. చదువురాక అజ్ఞానమునబడియుండుట కంగీకరించడు. రోజుకు రెండురూపాయలు మొదలు ఐదురూపాయిల వరకును దామాషాగా సంపాదించి మన దేశములోని మూడువందలు తెచ్చుకొను ప్రభుత్వోద్యోగికన్న హెచ్చుసౌఖ్య మనుభవించును. వారియిండ్లకు, విశాలమైన పడకగది, వంటగది చావడియు నుండును. కొందరు చిన్నచిన్న తోటలు కూడా వేసికొందురు. నేలపైన తివాచి, కిటికీలకు తెరలు కూడా కట్టుకొందురు. కుర్చీలు బల్లలు వేసికొందురు. ప్రతి పురుషుడు

స్త్రీయు ఒడలినిండ చొక్కా, షరాయి, గౌను, కాళ్ళకు జోళ్ళు, తలపైన కుళ్ళాయి ధరించి తీరవలెను. పుష్టికరమగు మాంసాహారము, కోడిగుడ్లు, రొట్టె, వెన్న, పాలు, పండ్లు, మురబ్బాలు తిందురు. వారికి వ్రాయను చదువను వచ్చియుండును. పిల్లలకునిర్బంధోచితవిద్య గరపబడును. వారికి ఉచితముగా మధ్యాహ్నభోజనమును పాఠశాలాధికారు లేర్పాటుచేయుదురు. సాధారణకార్మికులు క్లబ్బులో వార్తాపత్రికలు జదువుదురు. మఱియు వారు కుటుంబములతో వారమున కొకమారైనను సినీమాకు పోవుదురు. కార్మికులలో స్త్రీపురుషులకు నిరుద్యోగభీమా చేయబడును. పనిలేక అల్లాడుకాలమున వారికి వేతనము లొసగ బడును. ఇదియులేనివారికి ప్రభుత్వము, మునిసిపాలిటీ, ప్రజాసంఘములు జీవనభృతి నొసగుదురు. ఇట్లని ఆదేశములలో దారిద్ర్యము లేదనికాదు. ఇట్టిసుఖమున కలవాటుపడినవారికి దారిద్ర్య మెంత దుర్భరమో యోజింపుడు. ఇటీవల ఆర్థికదుస్థితివలన నిరుద్యోగసమస్యతో పాటు ఆత్మహత్యలు ఇంగ్లాండులోకూడ అధికమైనవి.

అర్థవిభజన : సమానసౌఖ్య విధానము.

సామాన్యజను లెల్లరు దారిద్ర్యమున బడియుండగ ధనవంతులు సంపదలతో తులతూగు పద్ధతి, సామాన్యజనులకు ప్రభుత్వములందు పలుకుబడి హెచ్చినతోడనే నశించితీరును. అధినివేశ ప్రభుత్వములందు సామాన్యజనులకు నియోజనాధికారము లధికము లైనంతటనే జనసామాన్యముయొక్క జీవన

విధానమును సంస్కరించి, సౌఖ్యజీవనాధారములను గల్పించి దేశసంపదను జనసామాన్యమెల్ల సమానముగ ననుభవింప వలెనను సూత్రము అధినివేశ శాసనసభలందు ప్రభుత్వ మందు గూడ వర్ధిల్లెను. "అర్థవిభజన సరిసమానముగ నుండ వలె"నను సాంఘికవాదము (Socialism) ను పురస్కరించు కొని అధినివేశ ప్రభుత్వములు కొన్ని శాసనములు నియమ ములు చేయుచున్నవి. ఆస్ట్రేలియాలో సారవంతమగు భూము లు తక్కువ. పచ్చికబయళ్లధికము. ప్రభుత్వమువారి వశమున గల భూములను ధనికులు విక్రయముపొంది యవి వారివశము లైనచో వానివలన సామాన్యజనులు పొందదగిన లాభము లెల్ల పొందుటకు వీలు లేకపోవునని తలచి, అట్టి యన్యాక్రాంత ములు ప్రభుత్వమువారు చేయరాదని ప్రజాప్రతినిధులు చెప్పగా, ఎంతో యవసరము కలిగినగాని ప్రభుత్వభూముల నన్యాక్రాంతము జేయరా దను నియమము ఆస్ట్రేలియాలో చేయబడినది. మఱియు విక్రయింపవలసి వచ్చినప్పుడు సామాన్యప్రజలు కొనుటకు వీలగునట్లు చిన్నచిన్న భాగము లుగనే విక్రయింపవలెననిరి.

విద్యాభివృద్ధి:

దేశక్షేమమునకు జాతీయాభివృద్ధికి దేశసంపద యధికమగుటకు ప్రజలెల్లరు కొంచెముగనో గొప్ప గనో చదువుకొన్నగాని వీలులేదనియు, ప్రజలు విద్యా వంతులైనతప్ప ప్రభుత్వముయొక్క సంస్కరణ ప్రయత్న

ములయొక్క లాభమును గుర్తెరిగి దేశశ్రేయమును కలిగించు పనులకు తోడ్పడజాలరనియు, ప్రజల ఆర్థికసాంఘిక నైతికాభివృద్ధి వారిజ్ఞానాభివృద్ధిని బట్టియుండుననియు, అధినివేశ ప్రభుత్వములవారు బాగుగగ్రహించి, విద్యాభివృద్ధికి చాలతోడ్పడుచున్నారు. ఆస్ట్రేలియాలో విద్యావిధాన మత్యద్భుతముగ నున్నది. అచ్చట జనసామాన్యమునకు మారుమూలల నున్నవారికిగూడ విద్యాలాభము గలిగించుటకు ప్రభుత్వ మనేక విధములుగ ప్రయత్నించుచున్నది. తాత్కాలిక పాఠశాలలు (Provisional Schools) ఏప్రదేశముననైనను నెలకొల్పుటకు వీలుకలదు. పాఠశాల భవనము నా యా స్థానికసంస్థయో జనులో సిద్ధపరుపవలెను. దానికి వలసిన ఉపాధ్యాయులు ఇతర సహాయము ప్రభుత్వమువారే సమకూర్తురు. ఎవరైన పాఠశాల నెలకొల్పినచో ప్రభుత్వమువారు విద్యార్థికి ౧కి ౫ పౌనులు విరాళమిత్తురు.వీనికి "సబ్సిడైజ్డ్" పాఠశాల లని పేరు. దక్షిణ ఆస్ట్రేలియాలో ౬గురు విద్యార్థు లున్నచోట్ల నొక్కొక పాఠశాల స్థాపింపవచ్చును. దేశములోని మారుమూలలకు పోయి విద్యచెప్పుటకు సంచార అధ్యాపకులు స్త్రీయుపాధ్యాయినులు నియమింపబడిరి. ప్రాథమికవిద్య అన్నిరాష్ట్రములలో ౭–౧౪ సంవత్సరముల వయస్సు పిల్లలకు ఉచితముగను నిర్బంధముగను గరపబడుచున్నది. ఇదిగాక తపాలద్వారమున విద్యనేర్పు పద్ధతియు కలదు. వ్యవసాయవృత్తి విద్య బాగుగ అభివృద్ధిచేయబడినవి. మాధ్యమిక విద్యకూడ అభివృద్ధి చేయబడినది.

ప్రభుత్వవిరాళములు పండితవర్షాశనములు (Scholarships) చాలమంది మాధ్యమిక విద్యను పొందుటకును, కొందరైనను విశ్వవిద్యాలయ విద్యపొందుటకును తోడ్పడుచున్నవి. అన్ని రాష్ట్రములు ఉన్నతపాఠశాలలను నెలకొల్పినవి. ౧౨-౧౫ వయస్సు ఆడపిల్లలకు గృహోచితవృత్తి కళాశాలలు కలవు. వాణిజ్యవిద్యను చెప్పు పాఠశాలలును కలవు. కొన్ని పాఠశాలలందు కొన్ని స్వపరిపాలనవిధానపద్ధతులను విద్యార్థులే చేయుట కవకాశ మొసగబడుచున్నది. సామాన్యముగా విశ్వవిద్యాలయమో ప్రభుత్వమువారో పరీక్షలచేయు పద్ధతి మాని పాఠశాలలే పరీక్షలుచేయు పద్ధతి కొన్ని పాఠశాలలందు నెలకొల్పబడి విశ్వవిద్యాలయమువారిచే అంగీకరింపబడుచున్నది. దక్షిణ ఆస్ట్రేలియాలో సామాన్యవిద్యకు తోడు గృహోచితవృత్తి కళలు వాణిజ్యకౌశల పారిశ్రామిక విద్యయు కూడ నేర్పబడుచున్నవి. కొన్నిచోటుల కౌశల పారిశ్రామికవృత్తి కళలు నేర్చుకొను బాలురెల్లరకు ప్రతిదినము ఒకపూటయు వారములో నొక సాయంత్రము కూడ నేదో యొక ప్రభుత్వ పారిశ్రామికకౌశల పాఠశాలలో 3 సం॥లు విద్య నేర్పవలయునని ఒకచట్టమువలన శాసింపబడెను. వృత్తి విద్యకు సంబంధించిన ఉన్నతపాఠశాలలు కళాశాలలుకూడ కలవు.

ఆస్ట్రేలియాలోని విశ్వవిద్యాలయములకు ప్రభుత్వమువారు విరాళములొసగి తోడ్పడుచున్నారు. ప్రతిరాష్ట్రమునను వ్యవసాయకళాశాలలు కృషిప్రదర్శన క్షేత్రములు

కలవు. దక్షిణ ఆస్ట్రేలియాలో గనులపరిశ్రమ కళాశాల కలదు. ఇంగ్లాండునందువలెనే ప్రభుత్వమువారి సహాయము పొందుచు విశ్వవిద్యాలయమునకు సహకారిగనున్న కార్మిక విద్యాసంఘ మొకటి ఆస్ట్రేలియాలో కలదు.

కెనడాలోని అన్నిరాష్ట్రములందును విద్యాశాఖ ఒక మంత్రి యధీనమున నున్నది. సివిలు ఉద్యోగులు ఇనస్పెక్టర్లు జిల్లాలందు పరిపాలింతురు. ప్రతిజిల్లాలోను విద్యాపరిపాలక సంఘములు గలవు. ఇవి ప్రాథమిక మాధ్యమిక ఉన్నత విద్యనుగూర్చి శ్రద్ధవహించును. ఇంగ్లాండులోని ప్రాథమిక విద్యావిధానమువంటిదే ఇచ్చటను గలదు. ౮-౧౪ సంవత్సరముల పిల్లలకు విద్య నిర్బంధము, ఉచితము. కొన్నిరాష్ట్రములలో ౧౬ సంవత్సరముల ప్రాయమువరకును నిర్బంధోచితవిద్య గలదు. పారిశ్రామికవృత్తి విద్యనుగూర్చియు శ్రద్ధవహించుచున్నారు. ఇటీవల అన్నిపట్టణములందును వృత్తికళలపారిశ్రామిక పాఠశాలలు నెలకొల్పబడినవి. వ్యవసాయికవిద్య అభివృద్ధి పొందినది. చిన్న కృషిపాఠశాలలు మొదలు గొప్ప కళాశాలలవరకును గలవు. వీనిలో కొన్ని ప్రపంచములోనెల్ల ప్రాముఖ్యత వహించినవి. మాధ్యమికవిద్యకూడ ఇంగ్లీషు మాట్లాడువారి కెల్లరకు నుచితమే. ఐరోపాదేశమునుండి వలస వచ్చిన వివిధభాషలవారి విద్యనుగూర్చి పశ్చిమకెనడా వారు చాల చిక్కులు పడుచున్నారు. ఏబదివత్సరములనుండి అత్యంతాభివృద్ధి గాంచుచున్న అమెరికా విశ్వవిద్యాలయ పద్ధతులెల్ల కెనడావిశ్వవిద్యాలయములందును నెలకొల్పబడినవి. కొన్ని

విశ్వవిద్యాలయములను రాష్ట్ర ప్రభుత్వములే పోషించు చున్నవి. కొన్ని జనులపోషణలో నున్నవి.

దక్షిణాఫ్రికాలో ౧౯౦౭ మొదలు అన్ని రాష్ట్రము లందును ప్రాథమికవిద్య ఒకేవిధమగు పద్ధతులపైన నభివృద్ధి గాంచుచున్నది. అచ్చట పాఠశాలలందెల్ల ఇంగ్లీషు డచ్చిభాష లు వాడబడుచున్నవి. అన్ని రాష్ట్రములందును ప్రాథమికవిద్య ఉచితముగ గరపబడు చున్నది. కేపుకాలనీలోను ఆరెంజిస్టేటులోను తెల్లవారి పిల్లలకు ౧౬ సంవత్సరముల వరకును, నేటాలు ట్రాన్సువాలులలో తెల్లవారి పిల్లలకు ౧౪ సంవత్సరముల వరకును విద్య నిర్బంధముగ శాసింప బడినది. ఆరవఫారము లోపుగనే కడతేరిన పిల్లలు పాఠశాల మాన వచ్చును. అన్ని రాష్ట్రములలోను పాఠశాలలకు వైద్యసహాయ శాఖకలదు. ఆస్ట్రేలియాలోవలెనే మారుమూలల నుండు పిల్ల లకు విద్యగరపు ప్రయత్నములజేసి కొన్నిపొలముల దగ్గర నొక్కొక పాఠశాలచొప్పున నెలకొల్పి వానికి ప్రభుత్వమువారు విరాళము లిచ్చుచున్నారు. ట్రాన్సువాలు ఆరెంజి పరగణా లలో మాధ్యమికవిద్యకూడ ఉచితమే. ప్రభుత్వపాఠశా లలుగాక ఇతరపాఠశాలలకు ప్రభుత్వమువారు సహాయము చేయుచున్నారు. గ్రామములలోని పిల్లలకు మాధ్యమికవిద్య నొసగుట కచ్చటి ప్రాథమికపాఠశాలలయందే సౌకర్యములు

కలిగించి విద్య గరపుచున్నారు. ప్రభుత్వమువారు వర్షాశనములు విరాళములు నిచ్చుచు బాలురు, బాలికలు, ఉన్నత విద్య నేర్చుకొనుట కవకాశములు గలిగించుచున్నారు. దక్షిణాఫ్రికాలో నాలుగువిశ్వవిద్యాలయములు, పెక్కుకళాశాలలు ౬ వృత్తికళాశాలలును కలవు.

ఆదిమవాసులవిద్య యధోగతిలోనున్నదని చెప్పవచ్చును. ఇది మతాచార్యులచేతులలోనున్నది. నల్లవారు తెల్లవారి పాఠశాలలలో చదువుటకు వీలులేదు. ట్రాన్సువాలులో ౧౯౦౭ లో ఆదిమవాసులకు ప్రత్యేకపాఠశాల లేర్పరచుటకు శాసనము చేయబడెను. అట్లే తక్కిన రాష్ట్రములందును వేరు వేరుపాఠశాలలుగలవు. ౧౯౧౬ లో నొక "నేటివుకాలేజి" కళాశాల స్థాపించబడెను. ప్రభుత్వమువారు కొంతసహాయము చేయుదురు. దానిలో వసూలగు నెలజీతముల వలన, ఇతర ఉపనిధివలనను నిది పోషింపబడుచున్నది. నేడు ఉన్నతవిద్య, వృత్తివిద్య, నిమ్నజాతులవిద్య సమితిప్రభుత్వమువారే పరిపాలించుచున్నారు.

న్యూజిలాండుదేశము విద్యాభివృద్ధికొరకు జిల్లాలుగ విభజింపబడి విద్యాసంఘములు నెలకొల్పబడినవి. కేంద్రప్రభుత్వవిద్యాశాఖయే దీనిని పరిపాలించును. దేశములో ప్రభుత్వమువారి ప్రాథమికపాఠశాలలుగాక ఇతరులవి రిజస్టరు కావ

లెను. ౭-౧౮ వయస్సువారికి నిర్బంధోచితవిద్య యొసగబడుచున్నది. తక్కువ జనసంఖ్య కలచోటుల ఒంటిపూటపాఠశాలలు గలవు. ఒకే ఉపాధ్యాయుడు రెండుపాఠశాలలందు విద్య గరపును. ఈదేశప్రభుత్వముకూడ మారుమూలలనున్న విద్యార్థులకొరకు తపాలద్వారమున విద్యనేర్పుపద్ధతిని సంచారపాఠశాలపద్ధతిని నెలకొల్పిరి. "మెయోరీలు" అనాగరిక స్థితిలోనున్నచోటుల తప్ప తక్కినచోటుల తెల్లవారిపాఠశాలలందు చదువవచ్చును. అట్టిచోటుల వారికి వేరే పాఠశాలలు కలవు. కొన్నిబోర్డింగుపాఠశాలలందు మెయోరీబాలురకు ఉచిత విద్యాదాన మొసగు స్థానములు నిర్ణయింపబడినవి. ౧౯౨౦ లో జేయబడిన చట్టమువలన విద్యార్థులనెల్లరను ఆరోగ్య శాఖాధికారులు పరీక్షించుచుందురు. దంతవైద్యసహాయము చేయబడుచున్నది. మాధ్యమికపాఠశాలలు ౧౯౧౮ లో ప్రభుత్వమువారు నెలకొల్పిరి. జిల్లాలలోని ప్రాథమిక పాఠశాలలే మాధ్యమిక విద్యాబోధనముచేయు పద్ధతి నిర్ణయించిరి. ౧౯౨౫ సంవత్సరాంతము నాటికి ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలందు నూటికి ౯౬ మందికి విద్య ఉచితముగ గరపబడుచున్నది. వృత్తిసంబంధవిద్య గరపు ఉన్నతపాఠశాలలకు మాధ్యమికపాఠశాలల గౌరవము గలదు. మాధ్యమిక విద్య గరపుటకు శక్తిలేనిపిల్లల సౌకర్యముకొరకు ౧౯౨౮ లో జూనియరు హైస్కూళ్ళు స్థాపింపబడెను. విశ్వవిద్యాలయములును

విద్యగరపుసంస్థలుగ నున్నవి. కార్మికవిద్యాసంఘము విశ్వవిద్యాలయమునకు తోడ్పడి పెద్దవారికి విద్య గరపుచున్నది. ౧౯౨౫ లో ౧౩,౮౬,౦౭౬ తెల్లజనసంఖ్యలో ౨,౮౯,౫౩౭ విద్యార్థులుగ నుండి రనినచో నాదేశవిద్యయొక్క స్థితి తెలియును.

అధినివేశములందు అక్షరాస్యులు పాశ్చాత్యదేశములందువలెనే నూటికి ౯౫. ౧౯౨౭ లో జనసంఖ్యనుబట్టి చూచినచో నీదేశములందలి పాఠశాలలసంఖ్య పాశ్చాత్యదేశములకన్న నధికమే.

కెనడాలో ౨౯౦ మంది తెల్లవారికి
ఒకప్రాథమిక పాఠశాలకలదు.

దక్షిణాఫ్రికాలో ౩౫౦ ,, ,, ,,
న్యూజిలాండులో ౫౦౦ ,, ,, ,,
ఆస్ట్రేలియాలో ౫౨౦ ,, ,, ,,

భరతఖండమున ౧౮౦౦ మంది ప్రజలకు ఒక ప్రాథమికపాఠశాలకలదు. నేడు నూటికి ౮౭ మంది నిరక్షరులుగా నున్నారనుసంగతి గమనించినచో నిది యెంత యన్యాయమో తెలియును.

అధినివేశములందు ప్రజల విద్యాభివృద్ధికి జ్ఞానాభివృద్ధికి తోడ్పడు చిత్రవస్తుప్రదర్శనశాలలు, చిత్రమృగవనములు,

వృత్తుపసములు, చిత్రకళాప్రదర్శనశాలలు, విశేషముగ కలవు. ఇదిగాక వార్తాపత్రికలును విద్యాభివృద్ధికి తోడ్పడుచున్నవి. విద్యాప్రచారమును గూర్చియు విద్యాభివృద్ధినిగూర్చియు ఇంగ్లాండులో నాలుగేడుల కొకమారు జరుగుచున్న బ్రిటీషు సామ్రాజ్య ప్రతినిధుల సభవారు వివిధదేశములందలి విద్యావిధానములను గమనించి ౧౯౨౩ లో ఆస్ట్రేలియాదేశ విద్యావిధానముల నెల్ల తక్కిన దేశములవా రనుకరించుట యుక్తమని తీర్మానించి, అట్లు చేయుచున్నారు. ౧౯౨౭ లో రేడియో (దూరశ్రవణ యంత్రి) మూలమునను సినీమాల మూలమునను జనసామాన్యమునందు విద్యాభివృద్ధి చేయుట యుక్తమని తీర్మానించినారు. ఈ అభివృద్ధి మార్గములు ధనవంతములును స్వతంత్రములును నగుపాశ్చాత్య దేశములకును అధినివేశములు నప్పుడే ఉపయోగించుచు లాభము పొందుచున్నారు. ఇట్లు అధినివేశప్రభుత్వములవారు విద్యకొరకు విశేషధనము వెచ్చించి అభివృద్ధి గాంచుచుండగా మనకు చాల స్వల్పధనమే విద్యకొరకు వెచ్చింపబడుచున్నందున మనము వెనుకబడియున్నాము.

సైనికవిద్య: అన్ని అధినివేశ రాజ్య ప్రభుత్వములును తమ దేశప్రజ లెల్ల ౧౨ మొదలు ౨౬ సంవత్సరముల మధ్య నిర్బంధముగ సైనికశిక్షను పొందునట్లు శాసించిరి. ఇందువలన అవసర మైనచో దేశరక్షణమునకు దేశములోని పౌరు

లెల్లరు తోడ్పడగల స్వచ్ఛందసైన్యము తయారుగ నుండుట కవకాశము గలుగుచున్నది. మన దేశమువలె అసహాయ స్థితిలో నుండి విదేశసైన్యములను విశేషధన మిచ్చి యుంచుకొనకుండగ మితవ్యయముచేసి ఒక చిన్న స్థిరసైనికదళము మాత్ర ముంచుకొన గలుగుచున్నవి. ఇట్లే వాయువిమాన వ్యవస్థనుగూర్చినట్టియు నౌకావ్యవస్థను గూర్చినట్టియు విద్యను అధినివేశపౌరులు నేర్చుకొనుట కవకాశములు గల్పింపబడినవి.

## సాంఘిక శ్రేయము.

ఆరోగ్యము, దారిద్ర్య నివారణము:

అధినివేశ స్వరాజ్యమువలన నాయాదేశప్రజలు పొందిన లాభములలో నొకటి ఆరోగ్యాభివృద్ధి. నేడు అధినివేశములందలి దామాషా ఆయుర్దాయము, వేయిమందికి మరణించు పెద్దవారి సంఖ్యయు, శిశుమరణ సంఖ్యయు, ఇంగ్లాండుకన్న తక్కువగ నున్న దని చెప్పినచో నా దేశములందలి ప్రభుత్వములు ప్రజల యారోగ్యముకొరకు చేసిన విశేష కృషి ధన వ్యయము కట్టుదిట్టములు కొంతవరకు తెలియును. ఆ దేశ ప్రభుత్వములవారు ప్రజల యజ్ఞానము బాపి, ఆరోగ్య విధులు నేర్పి ఆరోగ్యశాసనముల జేసి ఆరోగ్యవైద్యశాస్త్ర పరిశోధనలు జేసి, తగు కట్టుదిట్టములు చేసి జనుల అంటురోగములను సామాన్యరోగములను నివారించి వైద్యసాహాయ్యము చేసి పెక్కు విధములుగ తోడ్పడుచున్నారు.

ప్రజల ఆరోగ్యమును గూర్చియు, రోగనివారణను గూర్చియు, అందుకు సంబంధించిన సాంఘిక క్షేమశాసనములను ఆస్ట్రేలియా ప్రభుత్వమువారు కడు జాగ్రత్తతో చేసియున్నారు. ప్రజల ఆహారము, మందులు, పాలు, మున్నగునవి పరిశుద్ధములై యుండుటకు శాసనములు చేయబడినవి. శిశువులు పిల్లలు ఆరోగ్యవంతులుగ నుండనిచో జాతి క్షీణించునని గుర్తించి వారినిగూర్చి ప్రభుత్వమువారు శ్రద్ధ వహించుచున్నారు. అంటువ్యాధుల నివారణము జనసామాన్యమున కావశ్యకమైనపని గనుక ప్రభుత్వమువా రందుకొరకు చాల నియమముల జేసిరి. పరిశుద్ధ జలాధారములు ఆరోగ్య విధానములు (Sanitation) సామాన్య గ్రామములందు కూడ స్థాపింపబడినవి. స్థానిక స్వపరిపాలనమువా రీవిషయములందు శ్రద్ధవహించునట్లు శాసననియమములుకలవు. వైద్యఓషధీ పరిశోధనసంస్థను (Institute of Tropical Medicine) ప్రభుత్వమువారు స్థాపించి, ఆరోగ్యవైద్య పరిశోధనలు ప్రోత్సహించుచున్నారు. వైద్యసహాయము ప్రజ లందరికిని అందుబాటులో నుండునట్లు అధినివేశములం దెల్ల దగ్గరదగ్గరగ సామాన్య వైద్యశాలలును ప్రతిజిల్లాలోను గొప్ప వైద్యాలయములును నెలకొల్పుటయేగాక ప్రజల సంస్థలకును సాహాయ్యము చేయుచున్నారు.

అధినివేశప్రభుత్వములు వ్యయవిధానమున ఇంగ్లాండు నందువలెనే దారిద్ర్యనివారణము కొరకును సహాయముక్రిందను వృద్ధుల కుపకారవేతనములక్రిందను అశక్తులకు అనాథ స్త్రీ బాలబాలికలకు నుపకారవేతనములక్రిందను ప్రసూతి స్త్రీల కుపకారవేతనములక్రిందను కొన్ని లక్షల పౌనుల సొమ్ము వ్యయము చేయబడుట కనబడును. ఇందు కొరకు ఐరిషు ఫ్రీస్టేటువారు ౧౯౨౮—౨౯ లో ౨౫ లక్షల ౪౭ వేల పౌనులు వ్యయముజేసిరి.

ఈ సత్కార్యములకొరకు ఆస్ట్రేలియాలోగూడ అధిక ధనము వ్యయము చేయబడుచున్నది. ౧౯౧౨ లో ఆస్ట్రేలియాలో చేయబడిన శాసనమువలన నా దేశములో పుట్టిన ప్రతి శిశువుయొక్క తల్లికిని ౫ పౌనుల బహుమాన మిచ్చు నట్లు శాసింపబడినది. పిల్లలకు సంరక్షణనిధులు (Endowments) ఏర్పరచు పద్ధతి నాస్ట్రేలియా రాష్ట్రములలో నొకటి ఇదివరకే చేసినది. తక్కిన రాష్ట్రములు నట్లు చేయదలచి యున్నారు. అన్ని అధినివేశములందును ప్రజాక్షేమముకొరకు కావలసిన శాసనములు చేయబడి ప్రజలకొరకేర్పడిన ధర్మకార్యములకొరకు ప్రతిసాలున కొన్నిలక్షల పౌనులు వ్యయము చేయ బడుచున్నవి. ఆస్ట్రేలియాలో ౧౯౨౫ లో ౫౨ లక్షలపౌనులు వైద్యము ధర్మము ప్రజాక్షేమముల కొరకు వ్యయము చేయబడినవి.

ప్రోత్సాహక బహుమతు లిచ్చుట (Bounties) అధిక లాభ విభాగములనిచ్చుట సంరక్షకసుంకములను విధించుట ఆర్థికవ్యాపార పరిశ్రమలందే గాక సాంఘికవిషయములందు గూడ నెలకొల్పి దారిద్ర్యనివారణము ప్రజాక్షేమము జాతీయతాభివృద్ధికి మార్గములు కలిపించుపద్ధతికి ఆస్ట్రేలియావారే దారిచూపిరి. ఐరిషు ఫ్రీస్టేటువారు దానిని చక్కజేసిరి. ఇంగ్లాండునందువలెనే ఆస్ట్రేలియాలోను ఐరిషుఫ్రీస్టేటులోను నిరుద్యోగుల క్షేమనిధి యొకటిస్థాపింపబడి పనిలేనివారికి సహాయముచేయుట కుపయోగించుచున్నది. భరతఖండమునందువలె దరిద్ర్యలా దేశములలో ఆకటికి మాడి ఎండ కెండి వానకు తడిసి చనిపోవుటకు వీలులేదు. దేశములోని ప్రతి వ్యక్తియు జీవించుటకు హక్కుగలదు. అందుకొరకు ప్రభుత్వమువారు తగిన యేర్పాటు చేయవలయునను సూత్ర మాదేశములలో సర్వజనాంగీకారము బడసినది.

భారతదేశ ప్రజల జననమరణములు శిశు మరణములు అధనివేశములవానితో పోల్చి చూచినచో మనదేశమున ప్రజారోగ్య మెంత యధోగతిలో నున్నదో తెలియగలదు. నివారింపవీలుగల రోగములవలనను ఆకటిచేతను చచ్చువారెందరుకలరో లెక్కవేసినచో నీఘోరాన్యాయము బయల్పడగలదు.

## ప్రజల ఆరోగ్యము, ౧౯౨౯—౩౦

| నె. | దేశము. | ౧౦౦౦ మంది జనసంఖ్యకు జననము లెన్ని? | ౧౦౦౦ మంది జనసంఖ్యకు మరణము లెన్ని? | ౧౦౦౦ పుట్టుకలకు ఒక సంవత్సరము లోపల శిశు మరణము లెన్ని? |
|---|---|---|---|---|
| ౧ | ఇంగ్లాండు | ౧౬.౩ | ౧౧.౪ | ౭౬ |
| ౨ | అమెరికా సంయుక్త రాష్ట్రములు | ౧౮.౯ | ౧౧.౯ | ౬౮ |
| ౩ | ఫ్రాన్సు (ఫ్రెంచిరిపబ్లికు) | ౧౭.౭ | ౧౫.౭ | ౭౯ |
| ౪ | జర్మనీ | ౧౭.౫ | ౧౧.౧ | ౮౪ |
| ౫ | ఇటలీ | ౨౬.౨ | ౧౩.౭ | ౧౨౦ |
| ౬ | కెనడాడొమినియను | ౨౪.౦ | ౧౧.౬ | ౯౨ |
| ౭ | ఆస్ట్రేలియా కామన్వెల్తు | ౧౯.౯ | ౮.౬ | ౪౭ |
| ౮ | దక్షిణాఫ్రికాసమితి | ౨౬.౬ | ౯.౧ | ౭౦ |
| ౯ | న్యూజిలాండు | ౧౮.౮ | ౮.౬ | ౩౪ |
| ౧౦ | ఐరిషు ఫ్రీస్టేటు | ౧౯.౮ | ౧౪.౧ | ౬౭ |
| ౧౧ | జపాను | ౩౩.౦ | ౨౦ | ౧౪౨ |
| ౧౨ | భరతఖండము (బ్రిటిషు) | ౩౫.౧ | ౨౯.౮ | ౧౮౯ |

దామాషా ఆయుర్దాయములు.

| | |
|---|---|
| బ్రిటిషుదీవులలో | ౫౧.౫ |
| అమెరికా | ౫౦ |
| ఫ్రాన్సు | ౪౮.౪ |
| జర్మనీ, ఇటలీ | ౪౭ |
| జపాను | ౪౧.౩ |
| భరతఖండము | ౨౩ |

అధినివేశములందును పాశ్చాత్య దేశములందువలెనే యున్నది. ఇట్టిస్థితిలో ఆరోగ్యముకొరకు వైద్యముకొరకు సాంఘికక్షేమముకొరకు మన దేశములోను ఆయా దేశములలోను చేయబడుచున్న వ్యయము పోల్చి చూడవచ్చును. తక్కిన దేశములలో ౧౮ చతురపుమైళ్ళ కొక వైద్యాలయముండగా మన దేశములో ౨౭౫౫ చ. మైళ్ళ కొక వైద్యాలయము కలదు.

ప్రజల శ్రేయముకొరకు ఆరోగ్యముకొరకు ఐరిషు ఫ్రీస్టేటు ప్రభుత్వమువారు చేయుపనులు జూచినచో ప్రభుత్వ ప్రయోజనము తెలియగలదు. ఐరిషు ఫ్రీస్టేటు రాజ్యమున బీదలగు రోగులకు వారిండ్లదగ్గరనే యుచితముగ వైద్య సహాయము చేయుటకు వసతులు కల్పింపబడినవి. బాలెంతరాండ్రకు మంత్రసానుల నుచితముగ బంపుదురు. పిచ్చివారికి ఉచితచికిత్స చేయుదురు. గుడ్డివారికి, తలిదండ్రులు లేని పిల్లలకు ఉచితముగ భోజనాది సదుపాయముల గావించుచున్నారు. అవివాహితలై బిడ్డల గనిన నిర్భాగ్యరాండ్రకును అట్టి పిల్లలకును అంగవైకల్యముగల బిడ్డలకును సహాయము చేయుచున్నారు.

నగరములందును గ్రామములందును ప్రజలఆరోగ్యము కొరకెన్నో పనులు చేయుచున్నారు. పారిశుద్ధ్యము, మంచి నీటి సరఫరా, గృహనిర్మాణము, అంటువ్యాధుల చికిత్స,

తన్నివారణము, మంత్రసానులపైన అధికారము, శిశుసంరక్షణ, గుడ్డివారి సంరక్షణము మున్నగు పనులెల్ల ప్రభుత్వ వైద్యాధికారులే జాగ్రత్తగ చక్కబెట్టుచుందురు. పశువైద్యముకొరకు నియమింపబడిన ఉద్యోగులు దేశములోని ఆహారపదార్థములను తనిఖీచేయుదురు. మాంసము, పశువులు, పాడిని, ముఖ్యముగా కనిపెట్టిచూతురు. దీనినిగూర్చి అనేక చట్టములు చేయబడినవి.

విద్యాలయములలోని బాలబాలికల ఆరోగ్యమును పరీక్షించి చికిత్సచేయు వైద్యులు గలరు. పాఠశాలలలో చదువు పిల్లలకు మధ్యాహ్న భోజనసదుపాయము లుచితముగ చేయబడుచుండును.

చికిత్స పొందుటకు, ఆరోగ్యము పొందుటకు దీన జనాశ్రయము లనేకములు కలవు. ఏ స్థానికసంస్థయైన పైన చెప్పబడిన పనులు చేయదలచినచో ఆవ్యయములో సగము ప్రభుత్వమువారే భరింతురు.

జాతీయోద్యమ భీమాపద్ధతి నెలకొల్పి ప్రభుత్వము, కూలివారు, యజమానులు, కలిసి చందా లిచ్చి జబ్బుపడిన బీదవారిసంరక్షణకు తోడ్పడుచున్నారు. నిరుద్యోగభీమా వృద్ధుల కుపకారవేతనములు కూడ కలవు. కర్షకులకు కార్మికులకు చౌకగ గృహసదుపాయములు చేయుటకు ఇతర

ప్రజోపయోగకరకార్యములు చేయుటకు ప్రభుత్వమువారు స్థానిక సంస్థలకు చౌకవడ్డీలకు ఋణ మిచ్చెదరు.

సంఘసంస్కారము:

అధినివేశప్రజాప్రభుత్వములు తమదేశ ప్రజల సాంఘిక క్షేమమునుగూర్చిన శాసనములుగూడ చేయుచున్నవి. అట్టిశాసనములలో ప్రధానమైనది మద్యపాననిషేధము. కెనడాలో మద్యపాన నిషేధోద్యమమును గూర్చిన సంఘము లనేకములు కలవు. ప్రభుత్వమువారు శాసనవిధులను గూడచేసి వారియుద్యమమునకు తోడ్పడుచున్నారు. ఆస్ట్రేలియాలో మద్యవిక్రయనిరోధమునుగూర్చిన శాసననియమములు చేసి, విక్రయించు కాలములు, ప్రదేశములు నిర్ణయించి ఆచరింపజేయుచున్నారు. న్యూజిలాండులో శాసనమూలమున మద్యపాన నిషేధమును జేసియున్నారు. ప్రతిదేశములోని ప్రజల నీతివర్తన మాజాతీయతయొక్క అభివృద్ధికి ఔన్నత్యమునకు సంబంధించిన విషయ మని గ్రహించి అధినివేశరాజ్యముల ప్రభుత్వములవా రిటీవల వివిధదుర్వ్యసనములను నిషేధించు శాసనములను, ప్రజల నైతిక ధర్మములకు సంబంధించిన శాసనములనుగూడ చేయుచున్నారు.

## వివిధదేశముల జనసంఖ్య ప్రభుత్వాదాయము, ఋణము

| దేశము పేరు. | వైశాల్యము చ॥ మైళ్ళు | జనసంఖ్య. |
|---|---|---|
| ౧. ఇంగ్లాండు (బ్రిటీషుదీవులు) | ౯౩౯౮౫ | ౪౬౦౪౦౪౮౫ |
| ౨. అమెరికా సం॥ రాష్ట్రములు | ౩౭౩౮౩౯౫ | ౧౩౭౦౦౮౪౩౫ |
| ౩. ఫ్రాన్సు | ౨౧౩౦౦౦ | ౪౦౭౪౫౮౭౪ |
| ౪. జర్మనీ | ౧౮౨౨౦౦ | ౬౩౦౦౦౦౦౦ |
| ౫. ఇటలీ | ౧౨౦౦౦౦ | ౪౩౦౦౦౦౦౦ |
| ౬. కెనడా | ౩౭౦౦౦౦౦ | ౯౯౪౦౦౦౦ |
| ౭. ఆస్ట్రేలియా | ౩౦౦౦౦౦౦ | ౬౪౮౮౭౦౭ |
| ౮. దక్షిణాఫ్రికాసమితి | ౪౭౨౩౪౭ | ౬౯౨౮౫౮౦ |
| ౯. న్యూజిలాండు | ౧౦౫౧౫౫ | ౧౪౬౩౨౭౮ |
| ౧౦. ఐరిషు ఫ్రీస్టేటు | ౨౬౬౦౦ | ౩౦౦౦౦౦౦ |
| ౧౧. న్యూఫౌండ్లాండు | ౧౬౨౭౫౦ | ౨౭౬౦౦౦ |
| ౧౨. జపాను | ౨౬౦౮౦౦ | ౮౪౦౦౦౦౦౦ |
| ౧౩. భరతఖండము, బ్రిటిషురాజ్యము | ౧౦౯౪౩౦౦ | ౨౭౧౭౪౯౩౧౨ |
| ౧౪. యావద్భారతము | ౧౮౦౫౩౩౨ | ౩౫౨౯౮౬౮౭౬ |

| దేశము | విస్తీర్ణము చ॥ మై॥ | జనసంఖ్య. | చ॥ మై ఒత్తిడి. |
|---|---|---|---|
| ఇంగ్లాండు | ౫౦౩౨౭ | ౩౭౩౫౪౯౧౭ | ౬౪౯ (ఇంగ్లాండు, వేల్సు) |
| వేల్సు | ౮౦౧౬ | ౨౫౯౩౦౧౪ | |
| స్కాట్లాండు | ౩౦౪౦౫ | ౪౮౪౨౫౫౪ | |
| ఉత్తర ఐర్లాండు | ౫౨౩౭ | ౧౨౫౦౦౦౦ | |
| మొత్తము బ్రిటీషుదీవులు | ౯౩౯౮౫ | ౪౬౦౪౦౪౮౫ | ౪౮౫.౪౧ |

| మైలు 1 కి జనసంఖ్య ఒత్తిడి. | మొత్తము రైలు దారి పొడవు ఎన్ని మైళ్లు. | ప్రభుత్వాదాయము పౌనులు. | జాతీయఋణము పౌనులు. |
|---|---|---|---|
| ౪౭౫.౪౧ | ౧౯౭౨౨ | ౮౮౫౭౯౪౯౮౫ | ౮౫౭౨౯౦౦౬౦౦ |
| ౪౦.౫౬ | ౨౬౨౦౯౧ | ౭,౦౦,౦౦,౦౦౦ | ౪౦౦౦౦౦౦౦౦౦ |
| ౧౯౩.౪౧ | ౨౫౭౦౭ | ౩౦౦౦౦౦౦౦౦ | ౩౭౦౪౦౦౦౦౦౦ |
| ౩౪౮.౬౬ | ౩౯౫౦౦ | ౫౫౫౦౦౦౦౦౦ | |
| ౩౫౭.౧౬ | ౧౫౮౮౨ | ౧౪౭౩౪౪౦౦౦ | ౮౫౧౨౯౧౪౦౦ |
| ౨.౮౦ | ౪౦౫౮౨ | ౮౦౦౦౦౦౦౦ | ౪౫౦౦౦౦౦౦౦ |
| ౨.౨౦ | ౨౭౬౬౮ | ౧౭౦౨౩౮౭౩౪ | ౧౧౫౬౦౩౪౯౧౮ |
| ౧౬.౪౭ | ౧౨౨౦౨ | ౩౧౦౦౦౦౦౦ | ౨౨౭౦౦౦౦౦౦ |
| ౧౪.౫౧ | ౩౧౭౦ | ౨౩౦౦౦౦౦౦ | ౨౮౬౦౦౦౦౦౦ |
| ౧౧౨ | ౩౪౫౪ | ౨౬౦౦౦౦౦౦ | ౨౬౦౦౦౦౦౦ |
| ౨౨౬ | ౯౦౫ | ౨౩౦౦౦౦౦ | ౧౮౦౦౦౦౦౦ |
| ౩౩౮.౮౦ | ౧౦౭౭౬ | ౧౮౬౦౦౦౦౦౦ | ౫౧౭౦౦౦౦౦౦ |
| ౨౨౫ | | ౧౦౦౦౦౦౦౦౦ | ౮౩౯౦౦౦౦౦౦ |
| ౧౯౫ | ౪౦౯౫౦ | | |

| | విస్తీర్ణము | జనసంఖ్య | ఆదాయము |
|---|---|---|---|
| మ్రదాసుపరగణా. | ౧౪౨౨౫౦ | ౪౬౮౪౭౬౪౪ | రు ౧౭౨౯౮౦౦౦౦ లు |
| తూ.గోదావరిజిల్లా | ౨౫౪౫ | ౧౪౮౦౭౬౩ | ౩౨౫౭౩౪౯ |
| కృష్ణాజిల్లా | ౫౯౦౮ | ౧౦౭౬౯౩౨ | ౨౩౦౭౬౧౬ |

# ౪

# అధినివేశ స్వరాజ్యచరిత్ర.

## ౧ అధినివేశ రాజ్యోత్పత్తి:

నేడు బ్రిటీషు సామ్రాజ్యమున ఇంగ్లాండుతోపాటు సమానగౌరవము గల స్వతంత్ర ప్రజాప్రభుత్వములగు నధినివేశ రాజ్యములు మొట్టమొదట స్వతంత్ర రాజ్యములు కావు. వీనిలో ఐరిషుఫ్రీస్టేటు ౧౯౨౨ వరకు ఇంగ్లాండుతోపాటు బ్రిటీషుదీవులలో నొకటియై ఇంగ్లాండులోని పార్లమెంటువారి పరిపాలనముననే యుండెను. తక్కిన అధినివేశరాజ్యము లెల్ల చాలకాలముక్రిందట ననగా క్రీస్తుశకము పదునేడవ శతాబ్దియందు ఆంగ్లప్రజ లాయాదేశములకు వలస కేగి నెలకొనగా బ్రిటీషుప్రభుత్వమువా రచ్చటచ్చట స్థాపించిన వలసరాజ్యములై యున్నవి.

ఐరోపాఖండములోని తెల్లవారు భారతవర్షముతో వర్తకము చేయుటకొరకు సముద్రమార్గము లరయుచు ౧౪౯౨ లో అమెరికాఖండము గనుగొనియుండిరి. నాడు మొదలు పెక్కుజాతులవా రాదేశమునకు వలస కేగి నెలకొనిరి. అయితే ౧౬౦౦ వరకు ఆంగ్లేయులు వలసకు పోలేదు. ఇతరదేశములవారు భరతఖండముతో వర్తకము జేసి లాభము గడించుట చూచి ఇంగ్లీషువర్తకు లా సంవత్సరమున నొక సంఘమును స్థాపించిరి. అంతట వాణిజ్యకాంక్షతో

ధనకాంక్షయు, రాజ్యకాంక్షయు, దానితో సామ్రాజ్యకాంక్షయుగూడ నధికమైనవి. ఆంగ్లేయులు తక్కిన ఐరోపాదేశీయులతో పోరాటములు సలుపుచు ఉత్తరఅమెరికా దక్షిణాఫ్రికా ఆస్ట్రేలియాల వలసరాజ్యములను స్థాపించుటయేగాక భరతఖండమున సామ్రాజ్యమునుగూడ సంపాదించిరి. ఆంగ్లేయులకు నౌకాబల మధికమయ్యెను. భూమండలమున నలుగడలను వారు రాజ్యాక్రమణము చేయసాగిరి. తుదకు సూర్యు డస్తమింపని సామ్రాజ్యమును స్థాపించిరి. నేడు ప్రపంచ భూభాగములో నాలుగువంతులు వారిదే.

ఆంగ్లప్రజలు వలస కేగినంత మాత్రమున బ్రిటీషు పరిపాలనమునుండి తొలగిపోయిన ట్లెంచబడరనియు, వారు వలస కేగి నెలకొనిన క్రొత్తదేశములను పరిపాలించుటకు ఆంగ్లరాజ ప్రతినిధి పరిపాలకుల నంపవలయు ననియు, బ్రిటీషు ప్రభుత్వమువారు నిశ్చయించి మొదటినుండియు, నట్లాయా వలసరాజ్యములను పరిపాలించుటకు గవర్నరులను పంపసాగిరి. వలసరాజ్యములను సంరక్షించుటకు సైన్యముల నంపిరి. దీనికి తగిన ట్లాకాలమున సామ్రాజ్యకాంక్ష తక్కినఐరోపాజాతులకు నుండినందున దీనికొరకు కొండొరులతో పోరాడుకొనుచు యుద్ధములు చేయుచుండిరి. సాధారణముగ వలసరాజ్యములందలి గవర్నరులే అచ్చటి సైన్యములకు సర్వసేనానులుగ నుండిరి. గవర్నరులకు పరిపాలనమున సహాయము చేయుటకు పరిపాలకసభ లుండెను. ఈ సభలందలి సభ్యులను గూడ ఆంగ్లపార్లమెంటు ప్రభుత్వమువారే నియమించుచుండిరి. వలస

రాజ్యములందలి సివిలు క్రిమినలు ధర్మపరిపాలన మాంగ్ల ధర్మము ననుసరించి ఆంగ్లప్రభుత్వమువారిచే నియమింపబడిన న్యాయాధిపతులే పరిపాలించుచుండిరి. దేశమెల్ల భరత ఖండమునవలెనే జిల్లాలుగ విభజింపబడి నిరంకుశ పరిపాలక వర్గమువారి వశమున నుండెను. వలసరాజ్యములందు ఆంగ్ల పార్లమెంటువారి శాసనములే పరమప్రమాణములుగ నుండెను. ఆంగ్లపార్లమెంటువారు తమ యధికారమును పురస్కరించు కొని కొన్నిసుంకములు, పన్నులు విధించుచుండిరి. వలస రాజ్యములందు కొన్నిటికి ప్రజాప్రతినిధుల శాసనసభ లేర్పరుపబడినను వానికి నిజమగు ప్రభుత్వాధి కారములు గాని స్వతంత్రశాసన నిర్మాణాధికారములు గాని లేకుండెను. ఆనాటి ప్రభుత్వములు నిరంకుశములై సామ్రాజ్యలాభము కొరకే పరిపాలన జేయుచుండెను గాని ప్రజలక్షేమ లాభముల దలపవయ్యెను.

ఈ పరిస్థితులలో అమెరికాసంయుక్త రాష్ట్రము నందలి వలస ప్రజలు బ్రిటిషుప్రభుత్వముపైన తిరుగబడి ౧౭౭౬ లో స్వాతంత్ర్య ప్రకటనచేసి యుద్ధమున విజయులై ప్రజాప్రభుత్వము స్థాపించుకొనిరి. ఉత్తరఅమెరికాఖండమున అమెరికా సంయుక్తరాష్ట్రముల కుత్తరమున కెనడాలో నాంగ్లేయుల కింకను గొన్ని వలసరాజ్యము లుండెను. అవిమెల్లమెల్లగా నభివృద్ధి జెందుచుండెను. సంయుక్తరాష్ట్రములలోని ప్రజలాంగ్లేయప్రభుత్వమును ద్రోసి రాజని ప్రజాప్రభుత్వమును స్థాపించుకొనుట జూచి ఈ వలసరాజ్యప్రజలుగూడ తిరుగ

బడుదురేమో యని బ్రిటీషు ప్రభుత్వమువారు భయపడిరి. అందువలన నట్టి యవకాశము లేకుండ జేయుటకు కొన్ని కట్టుదిట్టములు జేసిరి. ౧౭౯౧ లో నా వలసరాజ్యములను, ఫ్రెంచి ఆంగ్లపరగణాలను రెండు పరగణాలుగ విభజించి వానికి ప్రజాప్రతినిధుల శాసనసభల నేర్పరచిరి. కాని ఆ సభలకు నిజమగు ప్రభుత్వాధికారము లొసగలేదు. సంయుక్తరాష్ట్రములందువలె కార్య నిర్వాహకవర్గము తమ వేతనములకు, సైన్యమునకు, శాసనసభలదయాధర్మభిక్షముపై నాధారపడవలసిన యగత్యము లేకుండగ నిచ్చట కార్యనిర్వాహకవర్గమునకు బ్రిటిషుదీవుల పార్లమెంటువారి శాసనముల ప్రకారము నిర్ణయింపబడిన సుంకముల రాబడినుండియు బ్రిటిషుప్రభుత్వపు భూముల (Crown Lands) నుండి వచ్చు ఆదాయము నుండియు వేతనము లేర్పరచిరి. వారి యధీనమందు బ్రిటిషుసామ్రాజ్యసైన్యము నుంచిరి. విప్లవమునకు వీలులేకుండ కట్టుదిట్టములు చేసిరి. అందువలన శాసనసభలవారు సొమ్ము మంజూరుచేసినను చేయకపోయినను కార్యనిర్వాహకవర్గమునకు ఇబ్బంది లేదు. కార్యనిర్వాహకవర్గము శాసనసభకు బాధ్యత కలిగియుండనక్కరలేదు. వారిమాట వినవలసిన పనిలేదు. శాసనసభలు బ్రిటిషు పార్లమెంటువారి యధికారమునకు లోబడి చట్టనిర్మాణము చేయవలయును. గవర్నరుజనరలు వారిచిత్తు చట్టములను అంగీకరింపకుండునట్లు బ్రిటిషువారు చేయగలుగుచుండిరి. శాసనసభలను తీసివేయుటకు గూడ పార్లమెంటువారి కధికార ముండెను.

ఆకాలమున ఫ్రెంచి ఇంగ్లీషు జాతులు తగవులాడుకొనుచు పరిపాలనము బాగుండక ప్రజలందు అసంతృప్తి పెరుగుచున్నందున వానినిగూర్చి విచారింపవలసినదని బ్రిటీషు పార్లమెంటువారు డర్హాముప్రభువును కెనడాకు పంపిరి. ఈ అసంతృప్తిని పోగొట్టి దేశమున శాంతిని నెలకొల్పుటకు రాజ్యాంగ సంస్కరణము గావించి కార్యనిర్వాహణాధికారము ప్రజల యధీనము గావించుటయే పరమౌషధమని డర్హాము ప్రభువు ప్రకటించెను. బ్రిటీషు రాజనీతిజ్ఞు లడ్డంకులు చెప్పగా ఎట్టి భయము లేదనియు, కావలసినచో తగిన రాజ్యాంగ బందోబస్తులు చేసికొనవచ్చుననియు ఇంగ్లాండులోని బ్రిటీషు ప్రజ కెట్టి రాజకీయ స్వపరిపాలనము కలదో అట్టి బాధ్యతాయుత ప్రజాప్రాతినిధ్యస్వపరిపాలనమునే యొసగినచో కెనడా ప్రజలు తృప్తిజెంది కృతజ్ఞులై బ్రిటీషుసామ్రాజ్యమున సుఖముగ నుందురనియు, అది బ్రిటీషు వారికిని లాభకరమనియు, నతడు గట్టిగ వ్రాసెను. బ్రిటిషు ప్రభుత్వమువా రెట్టకేలకు అంగీకరించిరి. ౧౮౪౬-౪౭ సంవత్సరములలో కెనడాకు రాజ్యాంగసంస్కరణము గావించిరి.

రాజ్యాంగసంస్కరణమువలన వలసరాజ్య పరిపాలనా విధానముయొక్క బహిరంగస్వరూపము మారలేదు. వలస రాజ్యముల గవర్నరును బ్రిటీషు ప్రభుత్వమువారే నియమించుచుండిరి. వారికే అతడు బాధ్యత వహించియుండును. రాజుయొక్క అధికారము లాతనికి ప్రసాదింపబడుటమూలమునను బ్రిటీషు పార్లమెంటువారి శాసనమూలమునను వలస

శాసనసభలుచేయు చట్టములవలనను కార్యనిర్వహణాధికారము గవర్నరునందే నెలకొల్పబడి యుండును. ఈ కార్యనిర్వహణమున కతని కొక ఉపసంఘము తోడ్పడును. శాసనసభలలో అధిక సంఖ్యాక పక్షమువారినుండి ఆసంఘమునకు సభ్యులు నియమింపబడుదురు. గవర్నరుకు చిత్తము వచ్చినన్నాళ్ళు వారు సభ్యులుగా నుందురు. ఆ సంఘసభ్యులే ప్రభుత్వముయొక్క పరిపాలనశాఖలకు మంత్రులుగ నుందురు. వలసశాసనములు వారికి అనేకాధికారములొసగును. ఇందుకూడ వారు గవర్నరుదయపై నాధారపడియుందురు. ఏలన శాసనముల కెల్ల గవర్నరు అంగీకారము కావలయును. బ్రిటీషు సామ్రాజ్య ప్రభుత్వమువారు గవర్నరుకిచ్చు ఆజ్ఞాపత్రములం దనేకవిధములగు శాసనముల కంగీకార మీయరాదని శాసింపబడియుండెను. అట్టిశాసనములు బ్రిటీషు సామ్రాజ్య ప్రభుత్వమువారికి ఆలోచనకొరకంపబడవలయును. సామ్రాజ్యమునకు సంబంధించిన విషయములందెల్ల సామ్రాజ్య పార్లమెంటువారే శాసనముల చేసి పంపుచుండిరి. అవసరమైనచో స్థానికవిషయములందు నట్లు చేయుటకువారికి హక్కుగలదు.* సామ్రాజ్య శాసనములనే ధర్మమును వలసన్యాయస్థానములవారమలు జరిగించుచుండిరి. న్యాయాధిపతులకు స్థిరమగు వేతనములు నిర్ణయింపబడినందున వారు వలసశాసనసభలకు లొంగియుండనక్కరలేదు. వారు తమవిధిని నిర్వర్తింపనిచో ఇంగ్లాండు

* దీనిని మన వైట్ పేపర్ సంస్కరణ ప్రణాళికతో పోల్చిచూడుడు.

లోని ప్రీవీకవున్సిలుసభవారు వారితీర్పులను పునర్విమర్శన చేసి తీర్మానించుచుండిరి. (అన్ని వలసరాజ్యముల న్యాయస్థానములపైనను ప్రీవీకవున్సిలుకు(అప్పీలు) ఉపర్యభియోగములను తీర్మానించు హక్కును ౧౮౪౪ సంవత్సరపు జూడిషియల్ కమిటీచట్టమువలన పార్లమెంటువారు శాసించిరి.)

ఇట్టి కట్టుదిట్టము లున్నను, ఏనాడు కార్యనిర్వాహణాధికారము శాసనసభలకు బాధ్యత వహించునట్లు మార్చబడెనో ఆనాడే సంపూర్ణప్రభుత్వస్వాతంత్ర్యసిద్ధికి అవకాశము లేర్పడెను. బాధ్యతాయుత ప్రజాప్రాతినిధ్య స్వపరిపాలనమున శాసననిర్మాణాధికార మభివృద్ధిజెందక తప్పదు. దానితో కార్యనిర్వాహక పరిపాలనాధికార మభివృద్ధిజెంది తీరును.

కెనడా కొసగబడిన బాధ్యతాయుత స్వపరిపాలనము తక్కిన వలసరాజ్యములకు నొసగబడెను. కెనడాలో తరువాత కలిసిన నోవాస్కోషియా, న్యూబ్రిన్సువిక్కు, ప్రిన్సుఎడ్వర్డు దీవికి నొసగబడెను. న్యూఫౌండ్లాండుకును ౧౮౫౫ లో నొసగబడెను. ఆ సంవత్సరమే ఆస్ట్రేలియాలోని న్యూసౌత్ వేల్సు, విక్టోరియా, దక్షిణ ఆస్ట్రేలియా, టాస్మేనియా ద్వీపములకు బాధ్యతాయుత స్వపరిపాలన మొసగిరి. న్యూజీలాండునకు నీ సంస్కరణ మొసగబడెను. ౧౮౫౯ లో న్యూసౌత్ వేల్సుతో వేరుపడిన క్వీన్సులాండుకు నొసగిరి. అట్లే క్రొత్తగ నెలకొల్పబడిన వలస పరగణాలకును ౧౮౬౭ లో నూతనసమ్మేళనముగా జేయబడిన కెనడా డొమినియను ప్రభుత్వమునకును ౧౮౭౦ లో మనిటోబా బ్రిటీషు కొలంబి

యాలకును, ౧౯౦౫ లో క్రొత్తగ చేయబడిన పరగణాలగు శాస్కట్చ్వన్, ఆల్బర్టాలకును బాధ్యతాయుత ప్రభుత్వ మొసగబడెను. ౧౯౦౦ సంవత్సరములో చిన్న వలసరాజ్యము లన్నియు గలిసి ఆస్ట్రేలియా కామన్వెల్తు, ప్రభుత్వమున చేరగా దీనికిని బాధ్యతాయుత స్వపరిపాలన మొసగబడి రాజ్యాంగచట్టము నిర్మింపబడెను. దక్షిణాఫ్రికాలో గుడు హోపు (Good Hope) అగ్రములోని వలస రాజ్యమునకు ౧౮౯౩ లో బాధ్యతాయుత పరిపాలన మొసగబడెను. దక్షిణాఫ్రికాలో తరువాత జయింపబడిన ట్రాన్సువాలు, ఆరెంజి ప్రజాస్వామ్యములకు ౧౯౦౬, ౧౯౦౭లోను సమితిప్రభుత్వమునకు ౧౯౦౯ లో నది యొసగబడెను. ఇవి యన్నియు ౧౯౧౦ లో కలిసి దక్షిణాఫ్రికా సమితియయ్యెను. ౧౯౨౨ లో ఐరిషు ఫ్రీస్టేటు రాజ్యాంగ చట్టమున బాధ్యతాయుత స్వపరిపాలనసూత్ర మంగీకరింపబడియున్నది.

పాదురాజ్యమగు బ్రిటీషుదీవుల ప్రజలవలెనే, వలస రాజ్యముల ప్రజలును తమ వ్యవహారములను చక్కబెట్టుకొనుటకు కావలసిన కార్యనిర్వహణాధికారమును శాసననిర్మాణాధికారమును కలిగియున్నారను సూత్రము వచ్చినంతనే ఇంకను పాదురాజ్యముతో సమానగౌరవస్థానమును పొందవలెనను కోరిక జనించుటలో వింతలేదు. ఆంతరంగిక వ్యవహారములందు స్వాతంత్ర్య మిచ్చినచో బాహ్యప్రభుత్వాధికారములు అనగా పరదేశములతోడి రాజనీతి సంబంధములు వర్తకవ్యాపారసంబంధములు బ్రిటీషు ప్రభుత్వముచే

తిలో నుంచుట కంగీకరించి వలసరాజ్యములు తృప్తిజెంది యుండు నని డర్హాము తలచెను. కాని ఇది సాగలేదు. పరాయి దేశములనుండి దిగుమతియగు వస్తువులపైన మాత్రమేగాక బ్రిటీషు దీవులనుండివచ్చు వస్తువులపై నగూడ సుంకములు విధించి తమ వర్తకము కాపాడుకొన వలెనని కెనడావారు ప్రయత్నించిరి. బ్రిటీషువారు వాదించిరి, కాని లాభము లేక పోయెను. ఈహక్కు ఎట్టకేలకు ౧౮౫౯ లో అంగీకరింప బడెను. నాటినుండి నేటివరకు వలసరాజ్యములు అధినివేశములు అభివృద్ధిజెంది పాదురాజ్యముతో పాటు సమానగౌరవమును పొందుటకు చేయు ప్రయత్నముల కెట్టి యభ్యంతరమును కలుగలేదు.

వలసరాజ్యములు సంయుక్త జాతీయ ప్రభుత్వము లేర్పరచుకొని "డొమినియనులు" లేక అధినివేశము లగుట వాని స్వాతంత్ర్య చరిత్రలో ప్రథమ సోపానము. మొదట చిన్ని చిన్నివిగ నుండి బలహీనములుగ నుండిన వలసరాజ్యము లట్లు కలిసి సంయుక్త ప్రభుత్వము లేర్పరచుకొనినందువలన బాహ్య స్వరూపమున అనగా వైశాల్యమందును బలమునందును పాదురాజ్యముతో సాటి వగుటకు వీలు కలిగెను. అట్లు కలిసినందువలన నొకజాతీయభావముకూడ యేర్పడెను.

వలసరాజ్యముల ఆంతరంగిక వ్యవహారములందు పరిపూర్ణ ప్రభుత్వాధికారములు కలిగిన చరిత్ర అధినివేశ స్వారాజ్యపరిణామచరిత్రయందు రెండవ ఘట్టము. మొదట వలస రాజ్యములకు స్వపరిపాలన మొసగు సందర్భములో వాని

రాజ్యాంగ స్వరూపమునందుగాని రాజ్యాంగ వ్యవస్థ నిర్మాణమునందుగాని ఆదేశముల అభిప్రాయముగాని ఇష్టముగాని గమనింపబడలేదు. కాని క్రమక్రమముగా నిది జరిగినది. ౧౮౫౨ లో ఆస్ట్రేలియాలో నియామకసభ్యులుగల ఉన్నత శాసన సభను సామ్రాజ్యమువారు నెలకొల్పదలపగా వలసవారిష్టపడలేదు. ఇది విరమింపబడుటయే అధినివేశ ప్రభుతకు చిహ్నముగా బరిణమించెను. కెనడా రాష్ట్ర రాజ్యాంగ నిర్మాణమునందాయా వలసరాజ్యముల కుండిన పలుకుబడికన్న ఆస్ట్రేలియా దక్షిణాఫ్రికా రాజ్యాంగము లేర్పడు నప్పుడా వలస రాజ్యాంగముల యభిమతము హెచ్చుగా గమనింపబడెను. అందువలననే కెనడా రాజ్యాంగమునందేమార్పులును చేయుటకు వీలులేకపోగా తక్కిన రెండు దేశముల చట్టములందును వానిమరతులకు విరుద్ధములుకాని మార్పులు చేయుటకవకాశ మున్నది. ఐరిషు ఫ్రీస్టేటు రాజ్యాంగమునుబట్టి ఆదేశనాయకులకు నింగ్లాండు ప్రభుత్వమునకును జరిగిన సంధికి విరుద్ధముగాని మార్పులు చేయవచ్చును.

శాసనాధికారవిషయమున వలసరాజ్యములకు వర్తించునట్టివైనను సామ్రాజ్యమునకు సంబంధించిన విషయములైనచో అట్టిచట్టములు చేయుటకు ఆంగ్లపార్లమెంటువారి కొక్కరికే హక్కు కలదని స్పష్టీకరింపబడెను. మొదట కొన్నాళ్లవరకును ముఖ్య విషయములందెల్ల ఆంగ్ల పార్లమెంటువారే శాసనములు చేయుచుండిరి. ఆశాసనములను మార్పుచేయుటకుగాని అందుకు విరుద్ధములగు శాసనములు చేయుటకు

గాని వలసశాసనసభల కధికారములేదు. వలస రాజ్యము లందు కాపుర ముండుటవలన నేర్పడు పౌరస్వత్వ హక్కులు, విదేశములతోడి రాజకీయసంబంధములు, సంసర్గమార్గములు, (Communications) సైనిక నౌకాదళములు రాజభక్తి రాజద్రోహములనుగూర్చి వలసదేశములలోని ఆదిమవాసులనుగూర్చిన వ్యవహారములందు, వలస వ్యవహారములందు, వ్యక్తిస్వాతంత్ర్య వివాహవిచ్ఛేదశాసనములు, భూవిషయికములు సివిలుహక్కులనుగూర్చి మార్గములలా, సైనిక చట్టము, వర్తకము, చలామణి, వాణిజ్యనౌకావ్యవస్థమున్నగు విషయములనుగూర్చియు ఆంగ్లపార్లమెంటుమాత్రమే శాసనములు చేయుచుండెను. క్రమముగా నీవిషయములందు అధినివేశముల కధికారమిచ్చి శాసనములను జేయనిచ్చుచుండిరి. కాని శాసనములు ప్రవేశ పెట్టుటకు బ్రిటీషు సామ్రాజ్యమువారి యొక్క అంగీకార ముండవలెను. అందుకొరకు రాజప్రతినిధి వానినిగూర్చి ఇంగ్లాండుకు తెలియపరచును. ఒక్కొక్కప్పుడు తానే నిరాకరించును. సామ్రాజ్యమువారి ఆలోచనకొరకు నిలిపియుంచును (Reservation). ఈ శాసనములను సామ్రాజ్యమువారి ఉత్తరువులనుబట్టి ప్రత్యాఖ్య (విటో) చేయవచ్చును. ఇన్ని యాటంకములతో నీశాసనము చేయబడినను వీనికి అధినివేశ రాజ్యాంగముల సరిహద్దులందే గౌరవ ముండును గాని సీమాంతరాధికార ముండదు. అట్టి పలుకుబడి ఆంగ్ల పార్లమెంటు శాసనములకుమాత్రమే యుండెను.

ఆ కాలమున వలసరాజ్యములు సామ్రాజ్యమున నొక భాగముగా తోంచుచుండెను. అందువలన సామ్రాజ్యమువారు వాని నణచియుంచుకొనుట కుత్సహింపలేదు. అప్రధానములును స్థానికసంబంధములు నగు వలసశాసనముల నన్నిటిని తమకు గవర్నరు లంపుచుండుటవలన తమకు విశేషశ్రమయు, కాలము వ్యర్థమగుటయు తప్ప లాభ మేమియు లేదని ఆంగ్లసామ్రాజ్యప్రభుత్వమువారికి తోంచి, స్థానికవిషయములనుగూర్చిన శాసనముల విషయమున సామ్రాజ్యప్రభుత్వమునకు దెలుపకుండగ రాజప్రతినిధియే వాని నంగీకరింప వచ్చునని శాసించిరి. రాజప్రతినిధి కంపు బ్రిటీషురాజ ప్రజ్ఞాపన పత్రము (Instrument of Instructions) లో నిరాకరింపవలసిన చట్టముల పట్టిక యొకటి చేర్చబడుచుండెను. దానికి విరుద్ధముగా నతె డనుమతి నీయరాదు; ఇచ్చిన చెల్లదు.

వలసరాజ్యముల శాసనాధికారములు పెరుగుట కిష్టములేని నిరంకుశ సామ్రాజ్యవాదుల కిది గిట్టదు. అట్టి భావములు గల న్యాయాధిపతి యొకడు బ్రిటీషువారి సామాన్యధర్మమున కించుకంతయైన విరుద్ధముగా నున్న వలసశాసనము లెవ్వియు చెల్లవని యొక విపరీతపు తీర్పునిచ్చి వలసదేశములందు కలవరము బుట్టించెను. అంతట ౧౮౬౫ లో నింగ్లాండుపార్లమెంటువారు (Colonial Laws Validity Act) 'వలసశాసనముల సశాస్త్రీయచట్ట' మను నొక శాసనమును జేసిరి. వలసదేశమునకు వర్తించు ఆంగ్లపార్లమెంటు శాసనమేదైన నొకటి ఆ సమయమున నములులో నుండి దానికి

విరుద్ధముగానున్న తప్ప వలసశాసనములు చెల్లక పోవని శాసించిరి. మఱియు గవర్నరుల కంపబడు రాజప్రిజ్ఞాపన పత్రిము రాజ్యాంగభాగముగ చేయబడిన తప్ప దానికి విరుద్ధ ముగా రాజప్రితినిధిచే నివ్వబడిన అంగీకారము చెల్లకపో దనిరి. మఱియు వలసశాసనసభలకు తమతమ దేశములందు న్యాయస్థానములను నెలకొల్పుటకును వాని అధికారములను నిర్ణయించుటకును, రద్దుచేయుటకును, అధికార మిచ్చిరి. ఇ ట్లిది వలసరాజ్యప్రిభుత పెరుగుటకు తోడ్పడెను.

౧౮౬౭లో కెనడారాష్ట్రి రాజ్యాంగ నిర్మాణ సందర్భమున రాజకీయవేత్తల చర్చలవలన అధినివేశరాజ్యాం గాచారములు, ప్రిభుత, మఱింత స్పష్టీకరింపబడుట కవ కాశము కలిగెను. ఇదివరకు వలసరాజ్యములోని మంతుృిల సలహాను నేటి భారతదేశమునందువలె గవర్నరు త్రోసిపుచ్చ వచ్చునను సూచన అతని కంపబడు చుండెను. ఆసూచనను కెనడా రాజ్యాంగచట్టము ననుసరించి, గవర్నరుజనరలు కంపబడు రాజప్రిజ్ఞాపన పత్రిమునందుండి తీసివేయబడెను. సామ్రాజ్య ప్రిభుత్వమువారి ఆలోచనకొఱకు నిలిపి యుంచ వలసిన శాసనముల పట్టికయు తీసివేయబడెను. కొన్నాళ్ళు జరుగునప్పటికి అధినివేశముల లోని మంతుృిలుకూడ బ్రిటీషు రాజమంతుృిలే యైనందున, వారిసలహాతో చేయబడు శాసన ములను ఇంగ్లాండులోని రాజుయొక్క మంతుృిల సలహాతో త్రోసివేయుట, ప్రత్యాఖ్యచేయుట, నిరాకరించుట, సమంజస ముగా లేదను భావము గలుగగా నీయధికారమును సామ్రా

జ్యప్రభుత్వమువారు సాధారణముగా చలాయింపక యుపే క్షింపసాగిరి. ఈ విశాలభావములు రాజ్యాంగాచారములు కెనడా రాజ్యాంగ వ్యవహారములనుండి తక్కిన అధినివేశ వలసరాజ్యముల వ్యవహారములలోనికికూడా ప్రాకెను.

న్యూజిలాండులో ఉన్నతశాసన మందిరమున సభ్యులను నియమించుపట్ల నాదేశమంత్రుల సలహా గైకొనబడెను. ఆస్ట్రేలియా కామన్వెల్తు నిర్మింపబడి నప్పుడు అధినివేశ (వలస) రాజ్యముల ఆంతరంగిక ప్రభుత మరికొంత వృద్ధి జెందెను. వలసరాజ్యముల శాసనములకు సముద్రములో తీరమునుండి కొన్ని మైళ్ళవరకును గూడ సీమాంతరాధికారమును. నౌకలపైన గూడా పలుకుబడియు, నంగీకరింపబడెను. కెనడాలోవలె, రాష్ట్రీయ కేంద్ర ప్రభుత్వములకు వచ్చు తగవులు రాజ్యాంగసమస్యలు, ఇంగ్లాండులోని ప్రీవీకవున్సిలు వారివలన గాక, ఆస్ట్రేలియాలో నచ్చటనే నిర్మింపబడిన సుప్రీముకోర్టు వలననే పరిష్కరింపబడునట్లు నిర్ణయింపబడెను. ౧౯౨౧ లో ఐరిషుఫ్రీస్టేటు నిర్మింపబడినప్పు డింకను వలసరాజ్యాధికారములు వృద్ధిజెందెను. ఇంగ్లాండులో పార్లమెంటువారి విశ్వాసము గోల్పోయిన మంత్రులు పార్లమెంటును విలయము చేయించి క్రొత్తఎన్నికలు జరిపించుటకు రాజుకు సలహా నొసగవచ్చును. ఈ పద్ధతిని ఐరిషుఫ్రీస్టేటువారు తమ శాసనసభ, కార్యనిర్వాహకవర్గముల విషయములో అంగీకరింపలేదు. అట్టి మంత్రుల సలహాపైన శాసనసభ రద్దుచేయబడరాదని శాసింపబడెను. గవర్నరుజన

రలు ఏ శాసనమును నిరాకరింపరాదనియు బ్రిటీషుసామ్రా జ్యపరిభుత్వమువారి ఆలోచనకొరకు నిలుపుదలమాత్రము చేయవచ్చుననియు శాసింపబడెను. ఇట్లు సామ్రాజ్యమువారి నిరంకుశాధికారములు తగ్గిపోవుచుండెను. శాసన నిర్మాణాధికారమును పరిభుత్వాధికారమును ఐరిషుఫ్రీస్టేటు ప్రజలవలననే యుద్భవించినదను ప్రాతిపదిక సిద్ధాంతము రాజ్యాంగమున స్పష్టీకరింప బడుటవలన అధినివేశ స్వరాజ్యముయొక్క ప్రభుత మరింత పెరిగెనని చెప్పవచ్చును.

వలసదేశముల రక్షణముకొరకు సామ్రాజ్యమువారే చాలకాలము బాధ్యత వహించియుండిరి. అందుకొరకు వలసిన సైన్యములు వారే భరించుచుండిరి. కొన్నాళ్ళకు వలస రాజ్యములుగూడ ఆవ్యయములో కొంతభాగము భరించు పద్ధతి వచ్చెను. వీనికి బాధ్యతాయుత పరిపాలన మొసగబడిన పిదప, సామ్రాజ్య సైన్యములను దీసివైచిరి. ఏదేశమైనను కోరినచో వానికి బదులిచ్చి క్రొత్త సైన్యములను నిర్మించుటకు ఇంగ్లాండువారు సాహాయ్యము చేయసాగిరి. ఇట్లే నౌకాదళము విషయమునను వాయువిమానముల విషయమునను జరిగినది. అన్ని అధినివేశములవారును నేడు నిర్బంధ సైనికశిక్ష విధించి సైన్యములను నిర్మించుకొని యున్నారు.

అధినివేశములందలి ఆదిమవాసులును నల్లవారును మొదట సామ్రాజ్యమువారి అధికారముక్రిందనే యుండిరి. మొదట నాదేశములకు స్వపరిపాలన మొసగునప్పు డాజాతుల పైన నాపరిభుత్వముల కధికార మొసగబడలేదు. కాని

యిది ఆంతరంగికవ్యవహార మనియు నాయధికారము తమ కొసగబడవలయు ననియు అధినివేశములవారు కోరగా నది సామ్రాజ్యమువారు కాదనలేక వారి కిచ్చిరి. అంతట అధినివేశములవా రాయా దేశములందలి నల్లవారికి రాజకీయఎన్నిక హక్కులు తీసివేసియు, వారికి ఆర్థికవాణిజ్యహక్కులు లేకుండ జేసియు, మారుమూలకు తోసివేసియు, విద్యావిహీనులుగను దరిద్రులుగను జేసి, వర్ణభేదమును పురస్కరించుకొని వివిధములగు శాసనములను చేయసాగిరి. ఆదేశములను తెల్లవారియిజారా భూములుగా చేయదలచిరి. తెల్లవారు పొందు సౌఖ్యములందు, లాభములందు నల్లవారి కవకాశములు లేకుండ జేయుచున్నారు. నల్లవారు సామ్రాజ్యమునకు మొఱపెట్టుకోగా నిది ఆంతరంగిక విషయ మనియు తా మేమియు చేయజాల మనియు బదులు చెప్పసాగిరి. ఇట్లు కెనడావారు ఎర్రఇండియనుల కన్యాయము చేసినను, న్యూజిలాండులోని తెల్లవారు మేయోరీలపైన అధర్మయుద్ధము చేసి భూములు లాగుకొనినను, సామ్రాజ్యమువా రేమియు ననలేదు. నేడన్ని యధినివేశములందు నీయన్యాయ్యము సాగుచున్నది.

| | |
|---|---|
| * దక్షిణాఫ్రికాలో బంటూలు | ౫౪౦౯౦౯౨ |
| ఆస్ట్రేలియాలో ఆదిమవాసులు | ౬౨౩౯౪ |
| కెనడాలో ఎర్రయిండియనులు | ౧౧౦౭౧౪ |
| న్యూజిలాండులో మేయోరీలు | ౬౨౮౭౧ |

ఇంకను మిగిలి యీబాధలు పడుచున్నారు.

నల్లవారి విషయమునందువలెనే వలస విషయములందును అధినివేశములవారు జరిగించసాగిరి. చైనాదేశమునుండి భారతదేశమునుండి వలసపోయినప్రజలను*వారెన్నోవిధముల బాధించి వెడలగొట్టుటకు ప్రయత్నించుచు వర్ణభేదశాసనములను జేసియు వీరిని ఆదిమవాసులతో సమానముగా హింసించియు నిరోధకశాసనములు చేసియు వలసను నిషేధించుచు శాసనములను జేసినారు. ఇది అంతరంగిక వ్యవహారమని సామ్రాజ్యమువారూరకొనిరి. ఇట్లు అధినివేశముల ప్రభుత ప్రతిష్ఠింపబడెను.

| | | |
|---|---|---|
| * కెనడాలో ఆశియావారు | | ౫౫,౪౫౫ |
| ఆస్ట్రేలియాలో చైనావారు ఇతరులు | | ౬౧,౯౮౪ |
| న్యూజిలాండులో | ,, | 3,3౭౪ |
| దక్షిణాఫ్రికాలో | భారతీయులు | ౧,౬౦,౦౦౦ |
| కెనడా | భారతీయులు | ౧,౨౦౦ |
| ఆస్ట్రేలియా | భారతీయులు | ౨,౦౦౦ |
| న్యూజిలాండులో | భారతీయులు | ౬౦౦ |

అధినివేశముల న్యాయస్థానములపైన ప్రీవీకౌన్సిలుకుగల అప్పీలు హక్కులలోకూడ మార్పులు కలిగినవి. కెనడాకు అధినివేశస్వరాజ్య మొసగబడినపుడు ప్రీవీకౌన్సిలుకు అప్పీలు అధికారములేగాక రాజ్యాంగవివాదలను పరిష్కరించు నధికారముకూడ నొసగబడెను. ఆస్ట్రేలియా కామన్వెల్తు స్థాపింపబడునప్పుడా రాజ్యాంగ విషయముల తీర్మానాధికారము

లోక సుప్రీముకోర్టున కొసగబడెను. ప్రత్యేక అనుమతి పొందిననే ప్రీవీకౌన్సిలుకు అప్పీలు తీసికొని పోవచ్చునని శాసింపబడెను. ప్రీవీకౌన్సిలు దూరదేశముననుండి చాలా వ్యయకారణ మైనందునను, అచ్చటి న్యాయాధిపతులకు వివిధ దేశాచార వ్యవహారములు బాగుగా తెలియనందునను, దీనివలన చాలా కష్ట నష్టములు కలుగుచున్నందునను, ఈ అప్పీలు తీసివేయవలెనని అన్ని అధినివేశముల రాజనీతిజ్ఞులును కోరసాగిరి. కాని ఆంగ్లేయులు పట్టుపట్టిరి. ౧౯౨౨లో ఐరిషు ఫ్రీస్టేటు నిర్మింపబడినప్పు డీఅధికారము చాలా తగ్గింపబడి కొన్నివిషయములందు మాత్రమే అప్పీ ళ్ళుండునట్లు నిర్ణయించిరి. ప్రీవీకౌన్సిలువారు చేయు తీర్మానములను వృధలు చేయగల చట్టములను చేసెదమని ఐరిషు రాజనీతిజ్ఞులు బాహాటముగా పలుకసాగిరి. అంతట ౧౯౨౬ సామ్రాజ్యసభలో నీవిషయమున అధినివేశముల యభిమతము ప్రకారము జరుపుట కాంగ్లేయమంత్రు లంగీకరించిరి.

అధినివేశములు సామ్రాజ్యవ్యవహారములం దింగ్లాండుతో కార్యాలోచన చేయుచు పాల్గొనుటయు అంతర్జాతీయ వ్యవహారములు ఇంగ్లాండుతోపాటు పాల్గొనుటయు బాహిక ప్రభుత పరిపూర్ణత గాంచుటకు కారణము లైనవి. పరరాజ్యములతోడి సంబంధములందును శాంతియుద్ధములందును మొదట వలసరాజ్యములు పాల్గొనలేదు. ౧౮౮౭ లో జరిగిన వలసప్రతినిధులసభలో నీ విషయములు చర్చింపబడలేదు. ౧౯౦౭ లో జరిగిన సభకు 'సామ్రాజ్యసభ' యని

నామకరణము చేయబడెను. పూర్వమువలె వలసరాజ్యాంగ కార్యదర్శిగాక బ్రిటీషు ప్రధానామాత్యుడగ్రాసనాధిపత్యము వహించెను. వలసప్రధానామాత్యులు సమానగౌరవముగల సభ్యులుగా నుండవలెననియు నాలుగువత్సరముల కొకమారు సభ కూడవలెననియు తీర్మానించిరి. ౧౯౧౧ లో జరిగినసభలో విదేశవ్యవహారరహస్యాలోచనములందు మొదటిపర్యాయము వీరు పాల్గొనిరిగాని అధికారముమాత్రము సామ్రాజ్యప్రభుత్వమే చలాయించెను. ఐరోపాసంగ్రామమునం దీసభ జరుగుటకు వీలులేకపోయెను సామ్రాజ్యయుద్ధాలోచనమంత్రిమండలిసభవారే అన్నివ్యవహారములను గూర్చియు చర్చించుచుండిరి. సామ్రాజ్యమున కధినివేశములు తగుసహాయము చేయుచున్నందునను ఈసభయందు పాల్గొనుచున్నందునను ఈ సభా తీర్మానములు బ్రిటీషు మంత్రిమండలివారు గౌరవించుచున్నందునను దీనికిని బ్రిటీషు ప్రధానామాత్యుడే అధ్యక్షుడైనందునను ఒక విధమగు పరస్పర కార్యాలోచన పద్ధతి యేర్పడెను. భరతఖండమునకు గూడ ఈ సభలో తన అభిప్రాయములను తెలుపు అవకాశము లభించెను. ఈ యుద్ధాలోచనమండలి తీర్మానముల నా యా ప్రభుత్వము లనుమతించుచుండెను. ౧౯౧౭ లో సామ్రాజ్యమునందలి వివిధరాజ్యభాగముల సంబంధమును గూర్చి యోజించుటకు శాంతి కలిగిన పిమ్మట వేఱొక ప్రతినిధులసభ నాహ్వానించుట కంగీకరించిరి. అట్లు నిర్ణయింపబడు నూతనవిధానమున ప్రస్తుతము అధినివేశముల కున్న

స్వపరిపాలనాధికారము లన్నియు నట్లే యుండవలయుననియు మఱియు నానాసామ్రాజ్య సమ్మేళనము నందలి స్వతంత్రజాతులుగా అంగీకరింపబడవలె ననియు తీర్మానింపబడెను. ౧౯౧౭ లో యుద్ధాలోచనమంత్రిమండలి రెండవమారు సమావేశమైనది. ౧౯౧౯ లో సంధిసభలో దీనినే సామ్రాజ్యప్రాతినిధ్యముగ మార్చిరి. అధినివేశములకు సంబంధించిన విషయములందు ప్రత్యేక ప్రాతినిధ్య ముండునట్లును ఇతర సమయములం దొకే సామ్రాజ్య ప్రాతినిధ్యము(Delegation) గాను చర్చలు జరుపునట్లు తీర్మానించిరి. సామ్రాజ్య ప్రాతినిధ్యమునగూడ అధినివేశప్రతినిధు లుండిరి. ఇట్లు అధినివేశములకును భారతదేశమునకును ఇతర స్వతంత్రరాజ్యములవలెనే సంధిసభలో ప్రాతినిధ్యము లభించెను. వీరి యభిప్రాయములకు సామ్రాజ్యప్రాతినిధ్యమున గూడ గౌరవ ముండుట తటస్థించెను. జర్మనీతోడి వర్సైలిస్ సంధిపైన ఇంగ్లాండుతో పాటు అధినివేశరాజ్యముల పక్షమున ఆ యా ప్రతినిధులు వేరువేరుగా సంతకములు చేసిరి. తమతమ ప్రభుత్వముల శాసనసభలు అనుమతిని దెలుపువరకు నీ సంధి యంగీకరింపవలదని వారు కోరిన కోరికను ఇంగ్లాండు ప్రభుత్వము వా రంగీకరించిరి. వర్సైలిస్ సంధి విషయమున జరిగినట్లే లీగాఫ్ నేషన్సు అనబడు నానారాజ్యసమితిసభ విషయమునను జరిగెను. భరతఖండమును అధినివేశరాజ్యములును గూడ దానిలో నింగ్లాండుతో సమానగౌరవముగల సభ్యులుగా చేర్చబడెను. ఇట్లు ఆంగ్లప్రభుత్వముతో ప్రసక్తి లేకుండగ

తిన్నగా అంతర్జాతీయ వ్యవహారములందు సైతము పాల్గొను అధికారము కలిగెను.

శత్రురాజ్యములతో సంధియొనరించుటయందును తక్కిన సంధులయందును అధినివేశముల ప్రత్యేకవ్యక్తిత్వ మంగీకరించబడినందున కెనడారాజ్యము తన కావశ్యకమని తోచిన పరరాజ్యములతోను అందు ముఖ్యముగా అమెరికా సంయుక్తరాష్ట్రములతోను రాయబారములు సలిపి రాజ్యతంత్రవ్యవహారములు తమ ప్రతినిధిద్వారా జరుపుకొనగోరెను. అమెరికావా రందు కంగీకరించినచో తమకు నభ్యంతరములేదని ఆంగ్లేయప్రభుత్వము వారు యుక్తిగా బదులు చెప్పిరి. కాని అమెరికావా రంగీకరించినందున కాదనజాలక పోయిరి. ఇట్లు ౧౯౨౬ లో కెనడావారు అమెరికాలో తమ ప్రతినిధి నేర్పరచుకొనిరి. ఇట్లే తక్కిన అధినివేశములవారును నితరరాజ్యములందు ప్రతినిధుల నేర్పరచిరి.

బ్రిటిషుప్రభుత్వముతో బహిరంగముగా యుద్ధము చేయుచున్న ఐరిషు విప్లవకారుల ప్రతినిధులతో నింగ్లాండు ప్రభుత్వమువారు ఒడంబడిక మాటలాడగా నది సంధియని వ్యవహరింపబడెను. ఆ రాజ్యమునకు స్వాతంత్ర్యము కలిగెను. ఇది అంతర్జాతీయ సంధివంటిది కాదనియు ఇది నానారాజ్యసమితి విధిప్రకారము రిజిస్టరుచేయతగిన సంధి కాదనియు సింగ్లాండువారు వాదించిరి ౧౯౨౩ లో సామ్రాజ్యమువారి అనుమతితో నీక్రొత్త అధినివేశముకూడా నానారాజ్య సమితిలో సభ్యరాలయ్యెను. ప్రత్యేక జాతీయ

పతాకమును పౌరసత్వ హక్కులును వారి రాజ్యాంగచట్ట మునందే స్పష్టీకరింపబడెను. దక్షిణాఫ్రికాప్రభుత్వమువారు ౧౯౨౭ లో నొక ప్రత్యేక జాతీయ పతాకమును నిలుపుటకు గూడ అంగీకరింపబడెను. ౧౯౨౩ లో జరిగిన సామ్రాజ్య సభయందు ఐరిషుఫ్రీస్టేటు ప్రతినిధి పాల్గొనెను. సామ్రాజ్య ప్రతినిధుల సభను సమావేశపరచి కార్యాలోచనము చేయు నవీన రాజ్యతంత్ర పద్ధతియొక్క లాభమును ఇంగ్లాండు మంత్రులును అధినివేశముల మంత్రులును గ్రహింప సాగిరి. అందువలన సామ్రాజ్యక్షేమ లాభములకు సంబంధించిన ప్రతివిషయమున నీకార్యాలోచనము జరుపసాగిరి. అధినివేశమునకు సంబంధించిన విషయములందురాజ్యప్రతినిధి పాల్గొననిది ఆదేశప్రభుత్వ మాతీర్మానముల కంగీకరింప దను సిద్ధాంతము క్రమక్రమముగా స్థిరపడెను. ౧౯౨౫ లో జినీవా ప్రొటకల్ సంధివిషయమునను ౧౯౨౬ లో లొకార్నో సంధివిషయమునను ఆయా అధినివేశ ప్రభుత్వము లందలి బాధ్యత లంగీకరింపనిచో చెల్లవను నిబంధనను బ్రిటీషుప్రభుత్వమువారే చేర్చిరి.

సామ్రాజ్యపక్షమున బ్రిటీషుసామ్రాజ్య ప్రభుత్వము వారు యుద్ధమును ప్రకటింప వచ్చునను ఆచారముండినను, యుద్ధమున సహాయము చేయుట చేయకపోవుట అధినివేశముల యిష్టమునుబట్టి యుండునను సూత్రము ఐరిషుఫ్రీస్టేటు రాజ్యాంగనిర్మాణమున స్థిరపడెను. ఈ సూత్రమునకు కెనడా యామోదించెను. తక్కిన రాజ్యములును హర్షించెను.

ఇట్లు సామ్రాజ్య వ్యవహారములందును అంతర్జాతీయ వ్యవహారములందును అధినివేశరాజ్యములు పాదురాజ్యమగు నింగ్లాండుతో సమానస్థానము పొందక పోయినను సమాన గౌరవము పొందసాగెను.

## అధినివేశ స్వరాజ్య పరిపూర్ణ ప్రభుత.

అధినివేశ స్వరాజ్యము పరిపూర్ణప్రభుతకల స్వతంత్ర రాజ్యాంగము కాదనియు నది సామంతరాజ్యమే యనియు కొందరు నిరంకుశ సార్వభౌమ సామ్రాజ్యవాదులు పలుక సాగిరి. అందుకు తార్కాణముగా వారిట్లనిరి.

౧. అధినివేశ రాజ్యాంగములందు బ్రిటిషుసామ్రాజ్య మునుండి విడిపోయి వేరుపడుటను నిషేధించు నియమములు లేకపోయినను బ్రిటీషు నృపాలుని అంగీకారము పొందియైనను విడిపోవుటనుగూర్చిన శాసనములను జేయుటకు అధినివేశముల కధికారములేదు.

(౨) బ్రిటీషు పార్లమెంటువారికివలె అధినివేశ పార్లమెంటులకు సంపూర్ణనిర్నిరోధప్రభుత్వ స్వాతంత్ర్యములేదు. సామ్రాజ్యమునం దెల్ల పరిపూర్ణ స్వామిత్వము "ప్రభుత" (Sovereignty) బ్రిటీషు పార్లమెంటుకే కలదు, ఆపార్లమెంటుయొక్క శాసనాధికార స్వేచ్ఛకేనిబంధనలు, అడ్డంకులు, లోపములు, హద్దులు లేవు అధినివేశముల పార్లమెంటులు తమతమ రాజ్యాంగ చట్టముల నిబంధనలకు లోబడియే శాసనముల జేయవలసిన హద్దు నియమము లోపము కలదు.

(3) అధినివేశముల శాసనముల నొక్కొకప్పుడు నిరాక రించుటకు బ్రిటిషు ప్రభుత్వమునకు అధికార మున్నది. లేక ఆశాసనములు బ్రిటీషుప్రభుత్వమువారిచే ఆలోచింపబడుటకు, నిలుపుచేయుటకు నధికారమును కలదు.

(౪) అధినివేశరాజ్యాంగముల శాసనములు బ్రిటీషు సామ్రాజ్యమున అన్నిప్రదేశములలోను పలుకుబడి ఆదరము కలిగియుండవు. బ్రిటీషుసామ్రాజ్య పార్లమెంటువారి శాసన ములకు సామ్రాజ్యమునం దెల్ల గౌరవము ఆచరణము యోగ్యత కలదు.

(౫) అధినివేశముల ధర్మపరిపాలనాధికారముపైన అప్పీళ్ళను తీర్మానించు నధికారము బ్రిటీషుప్రభుత్వసంస్థ యగు ప్రివికౌన్సిలుకు కలదు.

పైన చెప్పబడిన అధికారములను బ్రిటీషుసామ్రా జ్యమువారు తరచుగ చలాయింపక పోయినను, ఆయధికా రములు వారికిని కలిగియున్నందున సామ్రాజ్యములోని అధినివేశ స్వరాజ్యముపైన సామ్రాజ్యము వారికి సార్వభౌమ త్వాధికారము కలదను సిద్ధాంతమునుగూడ వీరు ప్రకటింప సాగిరి. ఇది అధినివేశములందలి జాతీయవాదులకు చాల రోషము కలిగించెను. దక్షిణాఫ్రికాలోని జాతీయవాదులు మొదటినుండియు సంపూర్ణ స్వాతంత్ర్యవాదులు. బ్రిటీషు దీవుల సామ్రాజ్యమునకు లోబడిన అస్వతంత్ర జాతి యని పించుకొనుట వారి కిష్టము లేదు. ఈజాతీయవాదుల నాయకు

డగు హెర్టుజాగుగారు ౧౯౨౮-౨౯ సంవత్సరములో జరిగిన ఎన్నికలలో విజయముగాంచి దక్షిణాఫ్రికా ప్రధానమంత్రి యయ్యెను.

ఇక కొన్నివందల వత్సరములనుండి బ్రిటీషుదీవుల నుండి వేరుపడుటకు ప్రయత్నించుచు పోరాడి పోరాడి తుద కధినివేశస్వరాజ్యము బడసిన ఐరిషుజాతివారికిని నిరంకుశ సార్వభౌమత్వాధికారములన్న గిట్టదు. ఈ రెండు దేశముల వారును తమ పరిపూర్ణస్వాతంత్ర్యమును పరిపూర్ణప్రభు తను స్థాపింపవలయునని కృతనిశ్చయులైరి. అట్టి గౌరవము స్వాతంత్ర్యము తమకు బ్రిటీషు సామ్రాజ్యమున కలుగుటకు వీలులేనిచో సామ్రాజ్యమునుండి వేరుపడుటయే యుక్తమ నియు అట్లు వేరుపడుటకు తమ రాజ్యాంగములం దెట్టి యాటంకములును లేవనియు, అధినివేశ స్వరాజ్యస్థితియం దట్లు వేరుపడుట కవకాశములు కలవనియు వీరివాదన. సామ్రాజ్య సభయందు ౧౯౨౬ లో హెర్టుజాగుగారును, ఐరిషు జాతీయ నాయకులు నీసంగతిని స్పష్టీకరించిరి. అందువలన ౧౯౨౬ లో సామ్రాజ్యాంతర్భాగముల పరస్పర సంబంధమును గూర్చి వ్రాతమూలముగ స్పష్టీకరింపదలచి బాల్ఫరుప్రభువు అధ్య క్షతక్రింద నొక ఉపసంఘమును నియమించిరి. బ్రిటీషు దీవులయొక్కయు అధినివేశములయొక్కయు పరస్పర సంబంధమును, స్థానము (Position) ను గూర్చి వారిట్లు సూచించిరి. "సమానగౌరవము గలిగి తమ ఆంతరంగిక వ్యవహారము లందుగాని బాహ్యసంబంధములందుగాని ఏవిధముగను ఒక

దాని కింకొకటి లోబడకుండి చక్రవర్తి మకుటమునకు భక్తి కలిగియుండుటమూలముగా సంశ్లిష్టత గలిగి బ్రిటీషుజాతుల సమ్మేళనమున స్వేచ్ఛ, సభ్యత, గలిగియుండి స్వపరిపాలనము గల జనసమూహములు, సామ్రాజ్యమునందు స్వపరిపాలనము గల ప్రతిభాగమును తన పరిణామమునకు తానే కర్త, స్వరూపమునగాకపోయినను స్వభావమునుబట్టి వాని కెట్టి నిర్బంధమును లేదు."

ఈ నివేదికను చూచి హెర్ట్జాగుగారును సామ్రాజ్యములోని ఇతర జాతీయవాదులును హర్షించిరి. బాల్ఫరు సంఘమువారు అధినివేశములందలి గవర్నరు జనరలుగారికి బ్రిటీషుదీవులరాజుగారి కుండునట్టి రాజ్యాంగ గౌరవము, హక్కులు నుండుననియు అతడు బ్రిటీషు సామ్రాజ్యప్రభుత్వముయొక్క ప్రతినిధిగాని ఏజంటుగాని కాడనియు బ్రిటీషు ప్రభుత్వమునకును అధినివేశ ప్రభుత్వమునకును మధ్య రాయబారిగ దూతగ ప్రవర్తింపరాదనియు ఆ ప్రభుత్వములు రెండును తిన్నగనే ఉత్తర ప్రత్యుత్తరములను జరుపుకొనవలయుననియు తీర్మానించిరి. మఱియు అధినివేశ రాజ్యముల శాసనములను బ్రిటీషుమంత్రుల సలహాపైన రాజుగారు (పేరున గవర్నరు) నిలిపియుంచుపద్ధతియు నిరాకరించు పద్ధతియు, ఆచరణ యోగ్యముగానట్టి ప్రాతపద్ధతు లనియు, రాజకీయ సిద్ధాంతముప్రకారము బ్రిటీషు రాజుపేరుననే పరిపాలింపబడు అధినివేశరాజ్యములమంత్రుల సలహానుబట్టి జరుగువ్యవహారములకు విరుద్ధముగ బ్రిటీషు మంత్రుల సల

హానుబట్టి రాజు వర్తించుట అనుచితమనియు తీర్మానించిరి. మఱియు తాము సూచించిననూతనసిద్ధాంతములకు వ్యతిరేకముగా నున్న శాసనములను, ఆచారములను పరిశీలించి తగిన మార్పులు సూచించుటకును శాసననిర్మాణాధికార నిర్ణయమును గూర్చి యోజించుటకును ఇతర చిల్లరసంస్కరణముల కొఱకును సలహా నొసగుటకును వేఱొకఉపసంఘము నెలకొల్పుటకు తీర్మానించిరి.

బ్రిటీషుదీవులతో సమానగౌరవము కలదని చెప్పుచు అధినివేశరాజ్యములలోని న్యాయస్థానముల తీర్పులపైన బ్రిటీషు దేశములలోని ప్రీవీకవున్సిలువారికి ఉపర్యభియోగములను (Appeals) తీసుకొని వెళ్ళుట సమంజసముగ లేదని ఐరిషు ఫ్రీస్టేటువారును కెనడావారును వాదించుచున్నందున ఈవిషయమున ఆయా అధినివేశరాజ్యములయొక్క అభిప్రాయములకు వ్యతిరేకముగ వర్తించుట బ్రిటీషుసార్వభౌమ ప్రభుత్వమువారి యభిమతము కాదనియు అయితే ఇది సామ్రాజ్యములోని అన్నిభాగములకు సంబంధించిన విషయమగుట వలన సమాలోచనమును చర్చను చేయనిది పరిష్కరింపరాదనియు తీర్మానించిరి.

పరరాజ్యములతోడి వ్యవహారముల విషయమున సంధులను గూర్చి ఈ బాల్ఫరుకమిటీవారు ౧౯౨౩ సామ్రాజ్యసభ తీర్మానము నామోదించుచు పరరాజ్యవ్యవహార రాజనీతిలోను సామ్రాజ్యరక్షణ విషయమునను నింక కొన్నాళ్ళ వరకు ప్రధానబాధ్యత బ్రిటీషు ప్రభుత్వమునకే వదలవలసి

యుండుననియు అయితే ఆ యా అధినివేశరాజ్యప్రభుత్వము యొక్క సమ్మతి లేనిది ఆ రాజ్యమును యుద్ధములోనికి దింపరాదనియు తీర్మానించిరి. ప్రస్తుతము ఉత్తర ప్రత్యుత్తరముల మూలమున జరుగుచున్న సామ్రాజ్య అధినివేశ రాజ్యముల కార్యాలోచన పద్ధతికితోడు లండను నగరమునను, అధినివేశ రాజ్యముల ముఖ్యపట్టణములలోను పరస్పర కార్యాలోచనమున కనుకూలించుపద్ధతుల నేర్పాటు చేయవలయు ననియు తీర్మానించిరి. ఆ ప్రకారము ౧౯౨౭ లో న్యూజిలాండులో బ్రిటీషు ప్రతినిధిగ నొక ఉద్యోగి నేర్పరచిరి. ౧౯౨౮ లో దక్షిణాఫ్రికాలోను కెనడాలోను బ్రిటీషు ఉద్యోగ ప్రతినిధుల నేర్పరచిరి.

ఈ ఉపసంఘమువారి నివేదికలో నిట్లు సూచించిరి: "స్వతంత్రసంస్థలే బ్రిటీషుసామ్రాజ్యముయొక్క ప్రాణాధారము; స్వేచ్ఛయగు సహకారపద్ధతియే వాని ధర్మశాసనము. శాంతి, సౌఖ్యము, అభివృద్ధియు దాని యుద్దేశములు. తన సహకారపద్ధతిని పరిమాణమును నిర్ణయించుకొను స్వాతంత్ర్యము ప్రతి అధినివేశమునకు నున్నను దీనివలన సామ్రాజ్యముయొక్కసమష్టిక్షేమమునకు సంబంధించిన వ్యవహారమునకును నష్టకరము కాదని మాయభిప్రాయము" అనిరి.

పైన చెప్పబడిన తీర్మానము ప్రకారము అధినివేశశాసనముల మహాసభ (డొమినియన్ లాస్ కాన్ఫరెన్సు) ౧౯౨౯ అక్టోబరులో తమ నివేదికను ప్రకటించిరి. దాని ప్రకారము ౧౧-౧౨-౩౧ వ తేదీన ఆంగ్ల సామ్రాజ్య పార్లమెంటువారు

స్టాట్యూట్ ఆఫ్ వెస్టు మినిస్టర్ అని ప్రసిద్ధిజెందిన రాజ్యాంగ చట్టమును గావించి పైన చెప్పబడిన సూత్రముల నన్నిటిని క్రోడీకరింపగా అధినివేశస్వరాజ్యముయొక్క పరిపూర్ణ ప్రభుతకు నిర్వచనము జేయబడి శాసనప్రమాణము పొందినది.

---

౫

# అధినివేశ స్వరాజ్య సమస్య.

హిందూదేశమున బ్రిటీషు పరిపాలనము స్థాపింపబడి యిప్పటికి రమారమి నూటడెబ్బది నాలుగేండ్లయినది. నాడు నిర్జన ప్రదేశములుగనుండి అనాగరికతకు గర్భ దారిద్ర్యమునకు బుట్టినిండ్లుగ నుండిన ఆస్ట్రేలియా, న్యూజిలాండు, దక్షిణాఫ్రికా, కెనడా రాజ్యములు నేడు సమస్తైశ్వర్యములతో తులదూగుచు సామ్రాజ్యమున బ్రిటీషుదీవులతో సరిసమాన దేశములైనవి. వాని ఆర్థిక సాంఘిక రాజకీయాభివృద్ధి చూచినచో భారతీయుల కాశ్చర్యము గొలుపకమానదు. చేత గాసైన లేక వలసపోయిన ఆంగ్లప్రజ లచ్చట నేడు అమితధనసంపద కలిగి ఆరోగ్యము విద్యయు గలిగి సౌఖ్యముగ జీవించుచున్నారు.

అధినివేశ స్వరాజ్యచరిత్రను జూచినచో మనకు విశదము కాగల ముఖ్యవిషయము : ప్రజా ప్రభుత్వము లేనంతకాలము అధినివేశములందలి వలసప్రజలు భారతీయులవలెనే నిరంకుశపరిపాలనమున ఆర్థిక సాంఘిక రాజకీయాభివృద్ధి లేకనేయుండిరి. బాధ్యతాయుత స్వపరిపాలనము వానికి సిద్ధించినంతనే వలసరాజ్యములు రాజకీయముగను, ఆర్థికముగను సాంఘికముగను నతిత్వరితముగ నభివృద్ధిని పొంది బ్రిటీషు దీవులతో సరిసమాన స్వతంత్ర్య రాజ్యములైనవి. బ్రిటీషు దీవులలో నొక్కటిగ నుండిన ఐరిషుఫ్రీస్టేటుకూడ అధినివేశ

స్వరాజ్యపదవి నందిన పిదప కని విని యెరుగని అభివృద్ధి పొందినది. దీనికి గారణము పరపరిపాలన మెంతమంచిదైనను స్వపరిపాలనమువలని ప్రయోజనముల గలిగింపలేకపోవుటయే. అధినివేశముల చరిత్రవలన మనము గ్రహింపగల రెండవ విషయము: ప్రభుత్వసహాయము సానుభూతియు నున్ననే ఏదేశ ప్రజలైనను రాజకీయ ఆర్థిక సాంఘికాభివృద్ధిని పరిపూర్ణముగ పొందగలుగుదురు. మూడవది: స్వతంత్ర ప్రజా ప్రభుత్వములుతప్ప ఇతరవిధములగు ప్రభుత్వములు ప్రజల కేవిధముగను తోడ్పడజాలవు.

భారతదేశ ప్రజలు వివిధజాతులకు మతములకు చెంది పలుభాషలు మాటలాడుచున్నందునను: అక్షరాస్యులు తక్కువగ నున్నందునను సాంఘికముగ మూఢవిశ్వాస మున్నందునను రాజకీయముగ, ప్రజాప్రభుత్వమునకు వలసిన ప్రాతినిధ్య పద్ధతులు జనసామాన్యము గ్రహింపనందునను దేశములో మూడవవంతు స్వదేశసంస్థానముల వశమున నున్నందునను భారతీయులకు స్వరాజ్యార్హత లేదని వాదించుట బ్రిటీషు ప్రభువులకును, వారి నాశ్రయించి తిరుగుస్వార్థపరులగు భారతీయులకును, పొట్టకూటికి పాటుపడు చరిత్రకారులకును, పరిపాటి యైనది. ఏ దేశప్రజలుగాని పైన చెప్పబడిన లోపము లున్నంతమాత్రమున స్వపరిపాలన కర్హులు గాకుండపోయినచో ఐరోపా అమెరికాదేశములలో నేడు ప్రఖ్యాతివహించిన ఏదేశమునకును ప్రజాప్రభుత్వము పొందుట కర్హత లేదనియే చెప్పవలసివచ్చును.

ఇంగ్లాండు దేశములో ప్రజాప్రభుత్వము పరిపక్వము జెందిన దని పలువురు పలుకు ౧౯ వ శతాబ్దము లోనే ఇంగ్లాండు దేశము ప్రజలం దింకను మూఢవిశ్వాసము లుండెనని చరిత్రలో చదువుచున్నారము. ఆ కాలమునాటి ప్రజలలోను నాయకులలోను లంచగొండెతన మత్యధికముగ నుండెననియు జగద్విదితము. నాటి జమీందారులు భూస్వాములు ప్రభువులు చాల బలవంతులుగ నుండి సామాన్యుల నణగద్రొక్కిరి. ఆదేశములో నాటి పార్లమెంటు ఎన్నికలం దెన్నో అన్యాయములు జరుగుచుండెను. కాంతాశనకములు, అధికార ప్రాపకములు విచ్చలవిడిగా నుపయోగింపబడుచుండెను. ఆ నాడు ధనదాసులకే అధికారగౌరవము లుండెను. జనసామాన్యమునకు ప్రభుత్వమున పలుకుబడి లేదు. జనులలో అజ్ఞానము అధికముగ నుండెను. చాలమంది నిరక్షరులుగనే యుండిరి. ౧౮౪౦ సంవత్సరములో ఇంగ్లాండులో సంచరించిన విచారణసంఘము (కమీషను) వారికి దేశములోని అజ్ఞానము విపరీతముగా గనబడెను. లండనునగరమును గూర్చియు అమెరికా దేశమును గూర్చియు నెన్నడు వినియుండనివారు వారికి గనబడిరి. కోర్టులో ప్రమాణమునందుతప్ప భగవంతునిగూర్చియు ఏసుక్రిస్తును గూర్చియు విని యెరుగనివారు వారికి గనబడిరి! పదమూడు బదునాలుగేడుల బాలబాలికలలో సగముమందికి చదువుట రాదు. మూడువంతులమందికి వ్రాయుట రాదు. జనులలో అజ్ఞానము పిచ్చినమ్మకములు ప్రబలియుండెను. దుర్భరదారి

దర్శ్యము అనారోగ్యజీవితవిధానము ప్రబలియుండెను. నాటి సాహుకారులు కూలివాండ్రను బానిసలస్థితిలో పడవైచియుండిరి. జనసామాన్యమునకు ఎన్నికహక్కు కలుగుటయే దుర్లభముగ నుండెను. అందువలననే ౧౮౩౨ మొదలు ఏబది వత్సరములవరకు ప్రజాప్రాతినిధ్యపద్ధతులను సంస్కరించుటయందే ఆదేశ రాజనీతిజ్ఞులు నిమగ్నులైరి.

ఇక అమెరికాదేశములోని ప్రజలు స్వాతంత్ర్యము పొందునాటికి ఆ ప్రజలలో ధనకాంక్షయు అందువలని దురాచారములు నమితముగ నుండెను. జీవితమెల్ల గొప్పజూదముగ నుండెను. ప్రజలయందు అసంతృప్తి ప్రబలియుండెను. ఆనాటి ప్రజలకు విద్యాగంధము తక్కువ. నాటి పండితులుకూడ జగద్విఖ్యాతి గడించలేదు. వర్తకులు గర్వపోతులు, దంబాచారులు పరిపాలనలో నిజముగ శక్తిసామర్థ్యములు గలవారికి తావులేదు. దేశములో బానిసత్వము ప్రబలియుండెను. ౧౮౧౪ లో కూడ దేశములో ప్రజకు ధన, మాన, ప్రాణములకు రక్షణ లేకుండెను. అయినను ప్రజలు స్వాతంత్ర్యప్రియులై ఇంగ్లాండుదేశముయొక్క నిరంకుశత్వమునుండి వెలువడి ప్రజాప్రభుత్వము స్థాపించుకొనిరి. ఇక కెనడాలోనన్నినో అమెరికావలెనే సాంఘికదురాచారవ్యవహారము లుండెను. వీరును బ్రిటీషువారి నిరంకుశపరిపాలనక్రిందనే యుండిరి. దేశములో ఫ్రెంచివారును ఆంగ్లేయులును రెండుజాతులకు జెంది, రెండుభాషలు నాగరికతలు కలిగి యొండొరుల గొంతుకలు కోసికొనుచుండిరి. దీనివలని

యరిష్టములు ప్రబలి దేశమును పీడించెను. ౧౭౯౧ లో వీరి కొసగబడిన రాజ్యాంగము ఉభయజాతులకు విభేదము కల్పించుటకు తోడ్పడెనేగాని లాభకారి కాలేదు. జనులలో వివిధ తరగతులకు జెందిన నాగరకత కలవా రుండిరి. కొందరు చాల అనాగరకులే. ప్రజలలో నూటి కిద్దరుకూడ అక్షరాస్యులు కారు. అయినను వీరికి ౧౮౪౪ నాటికి స్వపరిపాలనమును ౧౮౬౭ లో అధినివేశ స్వరాజ్య మొసగబడెను. ఇది యొసగిన పిదప నీలోపములు చాలవరకు పోయినవి. స్వరాజ్యము: లభించినదాదిగా ఈప్రజలు చాల యభివృద్ధి గాంచి అనేక సౌఖ్యములు పొందగలుగుచున్నారు. ఇట్లని అచ్చటివారు ప్రజాప్రభుత్వ పద్ధతులందు మనకన్న బాగుగ నిర్వహించుచున్నా రని తలంపబనిలేదు. మనదేశములో కనబడు లోపములకన్న హెచ్చులోపములే నేడచ్చట కనబడుచున్నవి. అచ్చట వాణిజ్య వ్యాపారలాభము లధికముగ నుండును కనుక తెలివిగలవారికి ప్రభుత్వోద్యోగముకన్నను పార్లమెంటుకన్నను వాణిజ్యజీవన మన్న నే ఎక్కువ ఇష్టము. ప్రాపకమువలన సామాన్య విద్యాబుద్ధులు కలవారే ప్రభుత్వోద్యోగముల బడయగలుగుదురు. పార్లమెంటులోనికి పోవు ప్రతినిధులు కూడా సామాన్య తెలివితేటలు కలవారే గాని గొప్పవారు కారు. ఏన్యాయాధిపతి గౌరవమునో, ఇంక నే పెద్దయుద్యోగమునో సంపాదించుటకే వారు ప్రతినిధు లగుచుందురు. తక్కిన పార్లమెంటుసభ్యులు గవర్నరు మొదలగువారితో ఫలాహారములు చేయుచు నగర వినోదములందు స్వేచ్ఛావిహారులై

సుఖించుటకే పార్లమెంటుకు పోవుదురు. కొద్దిమందిమాత్రమే దేశక్షేమముకొరకు పాటుపడుచుందురు. ఏజిల్లాసభ్యుఁడా జిల్లాలాభముకొరకే పాటుపడును గాని జాతీయలాభముకొరకు పాటుపడ తలంపడు. ఇక నీదేశపు ఎన్నికపద్ధతులందును తక్కిన బ్రిటీషురాజ్యములందలి పద్ధతులందలి లోపములే కలవు. దేశమెల్ల ౨౮౦ నియోజక ప్రదేశములుగ ఇచ్చవచ్చినట్లు విభజించిరి. ఒక్కొక ప్రదేశమున కొక్కొక ప్రతినిధి యెన్నుకొనబడును. ఒకప్రదేశములో ముగ్గు రభ్యర్థులు నిలిచిరనుకొనుడు. ఇద్దరి నోడించిన అభ్యర్థి వా రిరువురలో ఒక్కొకరికన్న హెచ్చువోట్లు సంపాదించినను వా రిద్దరికి కలిపి వచ్చిన వోట్లకన్న ఇతనికి తక్కువ సమ్మతులే వచ్చును కదా! అందువలన నీతఁడు తన నెన్నుకొనిన స్వల్ప సంఖ్యాకుల ప్రతినిధియే యగునుగాని తక్కిన అధికసంఖ్యాకులయొక్క ప్రతినిధి కాజాలఁడు గదా! లోప మీ పద్ధతిలోనే కలదు. ఆ దేశములోని ప్రభుత్వోద్యోగవర్గమువారు (Civil Services) పైన చెప్పబడినట్లు ప్రాపకమువలన నియమింపబడినవారే యగుటవలన ఇంగ్లాండులో పోటీపరీక్షలందు తేరి నియమింపబడిన వారివలె, శక్తిసామర్థ్యములు కలవారుగ నుండరు. గవర్నమెంటు పనుల కంట్రాక్టులుకూడ ప్రాపకమువల్లనే ఒసగబడుచున్నవి. ఇందువలన నాల్గువందల రూపాయిలతో తయారగు పనికి వేయిరూపాయిలు వ్యయమగుటయు ప్రజలధనము దుర్వినియోగ మగుటయు తటస్థించుచున్నది. అందువల్ల అచ్చటి రాజకీయ కక్షులవారును,

ప్రభుత్వకక్షివారును తమతమ అభ్యర్థుల నెన్నుకొన్నచో ఇది చేసెద మదిచేసెద మని గొప్పగొప్ప వాగ్దానములు చేయుటయు, ఈ వాగ్దానములు చెల్లించుటకు నిరుపయోగములగు పనులకు ప్రజల సొమ్ము వ్యయముచేయుటయు జరుగుచున్నది. అధికారప్రాపకములే నానాటికి బలవంతము లగుటవలన ఇంకొక అనర్థము కూడ కలుగుచున్నది. పార్లమెంటుయొక్క కార్యక్రమములో మూడువంతులు పై వాగ్దానములు చెల్లించుకొనుటకు ప్రతినిధులు చేయుతీర్మానములతో కాలము వెళ్లబుచ్చుటయు, నిజముగ దేశక్షేమలాభముల కుపయోగించు పనులకు కాలము లేకపోవుటయు తటస్థించుచున్నది. ౧౮౯౦ లో కూడ ఈ పరిస్థితు లుండెను. ఇటీవల కొంచెము బాగుపడు సూచనలు కనబడుచున్నవి. కెనడాప్రజల శక్తికి అర్హతకు మీరిన మంచి ప్రభుత్వము లభించినదని ఒక కెనడా నాయకుడే వ్రాసినాడు. ఇక ఆస్ట్రేలియాచరిత్ర చూచితిమా ఇంకను చిత్రముగ నుండును. ఆ దేశములో మొదట నెలకొనినవారెల్లరు నేరములు చేసి ద్వీపాంతరశిక్ష లనుభవించుటకు వచ్చినవారే! ఎన్నో ఘోరపాతకములు చేసి సంస్కరింప వీలులేని పాపులుకూడ నుండిరి. కొందరు పరమదుర్మార్గులు, గ్రామములు నగరములు వదలి పొదలలో చేరి తమకన్న సాధువులై నెమ్మదిగ జీవించు తెల్లవారిని పలువిధములుగా బాధించుచుండిరి. మరియు నచ్చటి ఆదిమవాసులను చెఱచి వారికి సుఖవ్యాధులు, మశూచి మున్నగు అంటువ్యాధులను తగిలించి బ్రాంది పొగాకు మున్నగు వ్యసనములను దుర్భా

షలను దురాచారములను నేర్పి పాడుచేసిరి. అందువలననే అచ్చటి నల్లవారికి తెల్లవారిపై రోత కలిగెను. అచ్చటి తెల్లవారిలో సారాయివర్తకము ప్రబలెను. దుర్మార్గములు వ్యభిచారములు క్రూరాచారములు వర్ధిల్లెను. న్యూసౌతువేల్సులో ౧౮౩౩ లో ౬౦,౭౯౪ జనసంఖ్యలో ౧౬,౧౫౧ శిక్షితులు. ఈ ద్వీపాంతరవాస పద్ధతి మాన్పి స్వపరిపాలన మొసగుడని ఆస్ట్రేలియాలోని ప్రజలు కోరగా ౧౮౪౨ లో నొక రాజ్యాంగ మొసగబడి ఆదాయవ్యయములపైన ఆస్ట్రేలియావారికి కొంత అధికార మిచ్చినది. దీనివలన ప్రజలకు స్వపరిపాలనములోని రుచి తెలిసి బాగుపడిరి. వారికి అధినివేశస్వరాజ్య మొసగిన పిదప అత్యద్భుతముగ బాగుపడి నేడా దేశమును భూతలస్వర్గముగ జేసిరి. అచ్చటి పౌరుల నెవ్వరును ద్వీపాంతరవాసుల జాతి యనుటకు సాహసింపరు. దక్షిణాఫ్రికాచరిత్ర మరియు విచిత్రము. ఆ దేశములో ఆంగ్లేయ డచ్చిజాతులకు చెందిన రెండు తెగలు, రెండు భాషలు, రెండు నాగరకతలు నుండెను. బానిసత్వము ప్రబలెను. ప్రజలకు విద్యాబుద్ధులు తక్కువ; అక్షరజ్ఞానము స్వల్పము; మతభేదములు నధికమే. తోటల యజమానులు భోగవిలాసములందు మదోన్మత్తులై జీవించుచుండిరి. బోయరులు క్రూరులుగ నుండిరి. శుభ్రత తక్కువ. ఈ దేశప్రజలకు వివిధప్రభుత్వపద్ధతులును న్యాయపరిపాలనాపద్ధతులు నుండెను. మొదట నిరంకుశపరిపాలనముగనే యుండెను; కాని వారికిని త్వరలోనే స్వపరిపాలనము అధినివేశస్వరాజ్య మొసగ

బడగా వారు నేడత్యంతాభివృద్ధిజెంది సుఖపడుచున్నారు. ఐర్లాండు దేశచరిత్రయు నీ నీతినే బోధించుచున్నది. బ్రిటీషు పరిపాలనమున నున్నంతకాలము అచ్చటగల రెండు క్రైస్తవ తెగలవారు ఒండొరుల గొంతుకలు కోసికొను చుండిరి. అచ్చటి ఐరిషు దేశీయులకన్న బ్రిటీషు వారికిని వారి జోహాకులకును అధికలాభములును ఉద్యోగగౌరవములును నుండెను. అచ్చటి పరిశ్రమలు వర్ధిల్ల లేదు. దేశము విద్యా వంతము కాలేదు. ౮౦౦ సంవత్సరములు ఐర్లాండు పారతంత్ర్యమున దుఃఖము లనుభవించి స్వాతంత్ర్యముకొఱకు పోరాడినది. ౧౯౨౨ లో అధినివేశస్వరాజ్యము సంపాదించి ౧౯౩౨ వరకు మితవాదులపక్షమువలన పరిపాలింపబడి నది. రాజకీయముగ సాంఘికముగ ఆర్థికముగ అత్యంతాభి వృద్ధి జెందుచున్నది. పదేండ్ల స్వరాజ్యప్రభుత్వము ప్రజల కెంతలాభ మొనగూర్చెనో విద్యకొఱకు వైద్యముకొఱకు ప్రజల క్షేమలాభములకొఱకు ఆ ప్రభుత్వము చేయుచున్న వ్యయము జూచినచో తెలియగలదు. పెక్కేండ్లు పారతంత్ర్యమునబడి చాలనష్టము లనుభవించితి మనియు లేకున్నచో ఇంక నభివృద్ధి కలిగియుండు మనియు మితవాదుల పక్ష ప్రభుత్వమువారే ప్రచురించిన ప్రభుత్వ వార్షిక నివేదికలో నుదహరింపబడినది. ఇటీవల ప్రజాస్వామిక కక్షవారు రాజ్య మునకు వచ్చి తమ దేశమును ప్రపంచములోని గొప్ప స్వతంత్ర రాజ్యములతో సమానగౌరవము, సౌఖ్యము పొందు నట్లు చేయదలచితి మని ప్రకటించుచున్నారు.

ఈ చరిత్ర చూచినచో భారతదేశములో ఏపరిస్థితులు లోపములుగా బ్రిటీషువారివలన వ్రేలుపెట్టి చూపబడుచున్నవో అవి ప్రపంచ దేశములందెల్ల ఏదో యొకరూపమున కలవనియు ఇవి యొక లెక్కలోనివి కావనియు భారతదేశప్రజలకు సంపూర్ణ స్వరాజ్యార్హత కలదనియు స్వరాజ్యము వచ్చినచో నీదేశప్రజలును తక్కిన అధినివేశస్వరాజ్యముల ప్రజలవలెనే పరిపాలనము నిర్వహించుకొని అభివృద్ధి గాంచగలరనియు స్పష్టమగుచున్నది. అధినివేశరాజ్య ప్రభుత్వముల ఆదాయవ్యయ ప్రణాళికలను ప్రజల ఆర్థిక సంపద, ఆరోగ్యము, ఆయుర్దాయమును గూర్చిన అంకెలను మనదేశములోని అంకెలతో పోల్చిచూచినచో మనకు స్వరాజ్య మెంత యావశ్యకమో తెలియగలదు. *

సంస్థానములక్రింద మూడవవంతు దేశ ముండుట స్వరాజ్యమున కాటంకము కలిగించుచున్న దనుట బూటకము. బ్రిటీషురాజ్యభాగమునకు స్వపరిపాలన మిచ్చిన కొలదికాలములోనే సంస్థానాధీశులు తమంతట తామే ఆ యా దేశప్రజలకు బాధ్యతగల రాజ్యాంగముల నేర్పరచి తీరెదరు. కాలప్రవాహముయొక్క మహిమను ప్రజాభిప్రాయముయొక్క ప్రాముఖ్యతను వారు గ్రహింపక నిరంకుశులై యుందు రనుట హాస్యాస్పదము. ఇంతకును వారిదికూడ స్వల్పసంఖ్యాకసమస్యగ మార్చి రాజ్యాంగమున అడ్డంకిగ నెలకొల్పజూచుట ఘో

* ఆయా అంకెల జాబితాలను చూడుడు.

రము. ప్రజలకు ప్రాతినిధ్యము లేనంతకాలము సంస్థానములను ఫెడరేషనులో చేర్చి ప్రయోజనము లేదు.

బ్రిటిషు రాజతంత్రజ్ఞు లిటీవల నొక క్రొత్తపంథా ద్రొక్కినారు. భారతదేశమునకు స్వరాజ్య మొసగుటయే తమ యుద్దేశమనియు, అయిన నీ దేశములో ప్రబలియున్న చిక్కులవలన పరిపూర్ణమగు ప్రజాపరిపాలన మొక్కసారిగ నొసగ వీలులేదనియు రాజ్యాంగముననే కొన్ని మినహాయింపులు చేసి కొన్నిరక్షణలు నెలకొల్పి కట్టుదిట్టములు చేయవల యుననియు చెప్పుచు, ఈసందర్భమున భారతీయులపై తమకు గల నిరంకుశాధికారములను శాశ్వతముగ నిలుపుకొన జూచుచున్నారు. ఇతర అధినివేశరాజ్యాంగములందు గూడ కొన్ని మినహాయింపులు రక్షణలు నున్నమాట నిజమే గాని అవి ప్రజాప్రభుత్వాధికారములను తగ్గించుటకు గాక వానిని కాపాడుటకే నిర్ణయింపబడి యున్నవి. ఆస్ట్రేలియాలో ఫెడరలురాజ్యాంగము నెలకొల్పునప్పుడు మార్పుచలకాలమున ఒక రాష్ట్రమున కింకొకరాష్ట్రమునకును పక్షపాతభావము లేకుండగా కేంద్రప్రభుత్వమే జాగ్రత్తతో పరిపాలింపవలె నను సిద్ధాంతము ననుసరించి ప్రజల క్షేమలాభముల కొరకు కొన్ని నియమము లేర్పరుపబడినవి. అంతేగాని నూతన అధినివేశప్రభుత్వముయొక్క ప్రభుతకు భంగము కలిగించుటకొరకు గాదు; బ్రిటీషుసామ్రాజ్యప్రభుత్వము వారి నిరంకుశాధికారములను నిలుపుటకొరకును గాదు. సైన్యమునుగూర్చిన కట్టుదిట్టములు మనకు ప్రధానావశ్యకము లని

చెప్పబడుచున్నవి. తక్కిన అధినివేశములకు స్వాతంత్ర్య మొసగినప్పుడు బ్రిటీషువారు తమ సైన్యములను తీసికొని పోయిరికదా! అప్పుడా దేశములు తమ స్వంతసైన్యములు తయారగునరకు బ్రిటీషుసైనికులకు నితరులకు జీతబత్తెము లిచ్చి కొన్నాళ్ళవరకు నుంచుకొనలేదా? అట్లే స్వతంత్ర భారతదేశముకూడ చేయగలదు. దీనికి పెద్ద మినహాయింపు లెందులకు?

చిన్నచిన్న స్వతంత్రరాజ్యములు కూడ తమతమ విదేశ వ్యవహారములను చక్కబెట్టుకొనుచుండగా భారతదేశము చక్కబెట్టుకొనలేదనియు దానికిని మినహాయింపు చేయవలె ననియు చెప్పుట యసమంజసము. తక్కిన అధినివేశములకు అంతర్జాతీయ విషయములం దేమిరక్షణలు మినహాయింపులు కలవు? వానికి లేనివి మన కేల?

వివిధములగు మినహాయింపులకు రక్షణలకు అల్పసంఖ్యాకుల సమస్య యొక కారణముగ జూపుటయు హాస్యాస్పదము. కెనడాలోని బ్రిటీషు, ఫ్రెంచి, జాతుల మనస్పర్థలు, కలహములు అశాంతి పోగొట్టుటకు పరమౌషధము, బాధ్యతాయుత స్వపరిపాలన మని డర్హాముప్రభువు వ్రాసిన నివేదిక ప్రకారము ౧౮౪౪ లోనే బ్రిటీషువా రంగీకరించిన సిద్ధాంతమును, దక్షిణాఫ్రికా బ్రిటీషురాజ్యములవారికి స్వపరిపాలన మొసగిన నాడంగీకరించిన సిద్ధాంతమును మన దేశ సమస్య పరిష్కరించుపట్ల ఏమైనది? అచ్చటి జాతివైషమ్యములకన్న తెల్లనల్ల సమస్యకన్న మన హిందూముసల్మానుల

వైషమ్యము లధికములా? ఆ దేశములకు పూర్ణస్వపరిపాలన మొసగినపిదప నాయంతఃకలహము లడగి అధినివేశజాతీయత, దేశభక్తియు కలిగి ప్రజాప్రభుత్వప్రయోజనము చాటుట లేదా? అచ్చట నెలకొల్పబడిన రక్షణము లేమి? ఆదిమవాసులకుగల నియోజనాధికారమును తీసివేయవలెనన్న అత్యధిక సంఖ్యాకుల తీర్మానము కావలెనని మాత్రమేకదా! అల్పసంఖ్యాకుల రక్షణకొరకే యైన నియమములు చేయుటకు భారతీయుల కేయభ్యంతరము లేదు గాని ప్రజలలో గలవనువిభేదములుసాకుగాగొని బ్రిటీషుసామ్రాజ్యమువారి నిరంకుశాధికారములు శాశ్వతముగ నిలుపుకొనుటకు మినహాయింపులు చేయుట అక్రమము. భారతీయులు తమబాధ్యతలను గుర్తెరిగి రాజకీయ ఆర్థిక పరపతిని నిలుపుకొనుటకు ఆర్థికవిషయములలో మినహాయింపు లుకావలెనట! బ్రిటీషుజాతితో ౮౦౦ సంవత్సరములు పోరి పోరి ౧౯౨౨లో అధినివేశస్థితిని పొందిన ఐరిషు ఫ్రీస్టేటుచరిత్రకన్న భారతీయస్వతంత్రవాదులకు వేరే ఉదాహరణ మవసరము లేదు. ఆరాజ్యాంగమున లేని రక్షణలు మినహాయింపులు మన కెందుకు నిర్ణయింపవలెను? ఐరిషు ప్రజలు తమ వ్యవహారములను తాము చక్కబెట్టుకొనజాలరని బ్రిటీషురాజతంత్రజ్ఞులు పలుమరు పలికియుండిరి. నేడా పలుకు లసత్యములైనవి. ఐరిషువారిఋణపత్రములు ఇంగ్లాండు దేశములోనే హెచ్చుధరల కమ్ముడు బోవుచున్నవి. ఐరిషు ఫ్రీస్టేటువారుచేసిన ఆర్థికసాంఘిక సంస్కరణము లింగ్లాండులోకూడ చేయుట యుక్తమని బ్రిటీషు రాజనీతిజ్ఞులు

గట్టిగ పలుకు దినములు వచ్చినవి. ఐరిషు ఫ్రీస్టేటువారు న్యాయముగ నిచ్చుకోవలసిన ఋణభారము భరించుటకు వారును మొదట అంగీకరించియే యుండిరి. మన ఋణములోకూడ మనము భరించవలసిన భాగము నిచ్చుకొందుము. వారి కీభయమేల? అందుకు మినహా యింపులేల?

భారతదేశమునకు సంపూర్ణ అధినివేశస్వరాజ్య మొసగకుండగా మినహాయింపులు చేసి రక్షణలు అడ్డంకులు నెలకొల్ప జూచుటకు కారణము, అధికారము ప్రజలవశము చేసినచో, నీ దేశమువలన బ్రిటీషుసామ్రాజ్యమువా రనేకవిధములుగా పొందుచున్న అమితలాభము పోవుననియు, మీదు మిక్కిలి బ్రిటీషుప్రభుత్వమువారు చేసిన ౧౧౭౧ కోట్ల ౯౬ లక్షల రూపాయీల ఋణములో ౭౯౯ కోట్ల రూపాయిలు బ్రిటీషువారే భరింపవలెనని స్పష్టముగ జెప్పుచున్న కాంగ్రెసుపక్షమువారు పరిపాలకవర్గమున చేరినచో ఆఋణము కూడ నీయవలసి వచ్చుననియు భయమైయుండును. కాని భారతదేశ యోగక్షేమముల గోరు ఏకక్షివారు రాజ్యమునకు వచ్చి వ్యవహరించినను గూడ ప్రజలకు చాల నష్టకరముగనున్న నేటి ఆదాయవ్యయప్రణాళికనుతక్షణమే మార్చివేయరని చెప్పుటకు వీలుకనపడదు. అందువలననే నేటి బ్రిటీషు రాజతంత్రజ్ఞు లీ రాజ్యాంగ సంస్కరణముల విషయమున గుటకలు మ్రింగుచున్నారు. బ్రిటీషు రాజతంత్రజ్ఞుల కిష్టమున్నను లేకున్నను కాలప్రవాహము నిలువదు. స్వాతంత్ర్యేచ్ఛ భారతజాతి నావహించినది. గాఢమగు ఆత్మ

విశ్వాసము దేశభక్తి యునుదయించినవి. అట్టియెడపూర్వము వలె భారతీయులు పారతంత్ర్యమున దారిద్ర్యదుఃఖము బడియుండుట కిచ్చగింతురా? భారతదేశ రాజ్యాంగసమస్య లోనే డొక్కటే ప్రశ్న. బ్రిటీషు సామ్రాజ్యమువారు భారత దేశమునకు నిజమగు అధినివేశస్వరాజ్యగౌరవ మొసగి తమ గౌరవము నిలుపుకొనెదరా? లేదాయని.

---



౬

# ఫెడరలు రాజ్యాంగవిధానము.

రెండురాజ్యములుగాని అంతకన్న ఎక్కువ రాజ్యములుగాని తమ శాశ్వతక్షేమలాభములకొరకు కేంద్రప్రభుత్వముక్రింద కలిసియుండు ముఖ్యసూత్రము గల రాజ్యాంగవిధానమునకే సంయుక్త లేక సమాఖ్య రాజ్యాంగమని పేరు. దీనికే ఆంగ్లమున ఫెడరల్ (Federal) విధానము లేక 'ఫెడరేషను (Federation)' అని వ్యవహరింతురు. పరిపూర్ణమగు ఫెడరలురాజ్యాంగవిధానమున సంశ్లిష్టమైన రాజ్యములు తమకు స్వతస్సిద్ధముగ గాని ప్రత్యేకముగ గాని ఉన్నటువంటి ప్రభుత్వాధికారములలో కొన్నిటిని కేంద్ర, సంయుక్త, లేక "ఫెడరలు" ప్రభుత్వమున కొసగుట కంగీకరించును. సంయుక్తప్రభుత్వము, ఆయధికారములకు సంబంధించినంతవరకు సంశ్లిష్టమైన రాష్ట్రజనసమూహముల పైనను వేరువేరు రాష్ట్రము లందలి పౌరుల (వ్యక్తుల) పైనను గూడ రాష్ట్రప్రభుత్వములతో నిమిత్తము లేకుండగనే తిన్నగ తన యధికారమును చలాయించును. కేంద్రసంయుక్త ప్రభుత్వమున కొసగకుండ నిలువయుండు అనిర్దిష్టములగు నధికారము లా యా ప్రత్యేకరాష్ట్రములకే యుండును. అందువలన సంయుక్తప్రభుత్వపరిపాలనములోని ప్రజలు రెండు ప్రభుత్వముల గొలువవలయును. రాష్ట్రప్రభుత్వశాసనములకునుగూడ బద్ధులు కావలయును. ఇట్టి సంపూర్ణమగు కలయిక లేకుండగ తాత్కాలికముగ నేవైన కొన్నిలాభ

ములకొఱకుమాత్రమే కలిసియుండు రాష్ట్రములసమూహము లకు "కాన్ఫెడరేషను" (Confederation) లేక సమ్మేళన మని పేరు.

ఫెడరలు రాజ్యాంగవిధానమును గూర్చి న్యూటన్ అను నాంగ్లపండితు డిట్లు వ్రాయుచున్నాడు. "ఫెడరలురాజ్యాంగ మనగా అనేక స్వతంత్రరాజ్యముల ఎడతెగని కలయిక. ఈ కలయిక మొదట నారాజ్యములు చేసికొనిన ఒడంబడికలపై నాధారపడి యుండును. లేదా ఒకేవిధమైన ప్రభుత్వము గలిగి చరిత్రరీత్యా సమాన ప్రతిపత్తిగల రాజ్యముల సంబంధముపై నది యాధారపడియుండును. రెండవది ఆరాజ్యములలోని పౌరు లొక సంయుక్తరాజ్యాంగవిధానమున నొప్పుకొనవలయును. సంయుక్తఫెడరలు ప్రభుత్వమునకు దానితో కలిసియున్న రాజ్యములమీదకూడ అధికారము కలిగియుండును. ఈ సమాఖ్యలో చేరియున్న రాజ్యముల కాంతరంగికస్వాతంత్ర్యము, ఇతరదేశములతో స్వతంత్రముగా వ్యవహారములు నడుపుకొనుస్వేచ్ఛయు, తగ్గిపోవును. ఇతరదేశములతో వ్యవహరించుటకు సాధారణముగా సంయుక్త ప్రభుత్వమునకే అధికార ముండును. సంయుక్తరాష్ట్ర పరిపాలనము క్రింద కలియదలచు రాష్ట్రము లున్ననే ఫెడరలువిధాన మేర్పడుటకు వీలుకలుగును." "రాజ్యాంగవిధానమున సంయుక్త రాష్ట్రమునకును ఆ కలయికలో చేరిన ప్రత్యేకరాష్ట్రముల కును అధికారములు విభజింపబడు పద్ధతియందు జాతీయ ఐక్య

తయు రాష్ట్రస్వాతంత్ర్యమును సిద్ధించునను ఫెడరలుసిద్ధాంత మువలన మూడుముఖ్యలక్షణము లేర్పడుచున్నవి. (౧) సర్వ విషయములందును రాజ్యాంగవిధానము (Constitution)నకు ప్రాముఖ్యత కలిగి పరిపాలనమున కది పరమప్రమాణముగ భావింపబడుట, (౨) ప్రభుత్వాధికారములగు శాసననిర్మా ణము, కార్యనిర్వహణము, న్యాయపరిపాలనము, పరిపాల నాపద్ధతియందు సమానగౌరవము గలిగి ఒకదాని కింకొకటి లోబడని ప్రత్యేకసంస్థల కొసగబడుట, (3) రాజ్యాంగ సమ స్యలెల్ల సంయుక్తరాష్ట్రములందలి న్యాయస్థానమువలన దీర్మానింపబడి సిద్ధాంతీకరింపబడుట. ఇవి ఫెడరలురాజ్యాంగ విధానము యొక్క ప్రధానలక్షణములు." అని సుప్రసిద్ధ రాజ్యాంగశాస్త్రజ్ఞుడగు డైసీ పండితుడువ్రాసియున్నాడు. ఫెడరలువిధానమున రాజ్యాంగము పరమప్రమాణము గనుక శాసననిర్మాణ కార్యనిర్వాహక న్యాయపరిపాలనాధికారము లెల్ల ఫెడరలుప్రభుత్వమునందైనను ప్రత్యేకరాష్ట్రములయందైనను రాజ్యాంగమునకు లోబడి మెలగవలయును. ఫెడరలు విధానమున రాజ్యాంగము పరమప్రమాణ మగుటవలన నది సాధారణముగ లిఖితరూపము దాల్చును. అది మార్చుటకు పెరుగుటకు సులభసాధ్యముగ నుండదు. మార్పులుచేయు టకు వీలున్నచో పరిపాలనావిధానములోని శాసననిర్మాణ అం గములుగాక దానికొరకు నిర్ణయింపబడిన ప్రత్యేకరాజ్యాం గములే దానిని మార్చుటకు అధికారము గలిగియుండును. ఇక శాసననిర్మాణాధికారమున సంయుక్తఫెడరలుశాసనసభ

కైనను రాష్ట్రీయశాసనసభకైనను రాజ్యాంగమున నిర్ణయింపబడిన నిర్ణీతాధికారములే యుండునుగాని స్వతంత్రాధికారము లుండవు. ఫెడరలు విధానలక్షణమగు అధికారవిభజన పద్ధతి ఆచరణమున అంతు లేకుండ పెరిగి రాజ్యాంగములలో నొకదానితో మరియొకదానికి సంబంధము లేకుండునట్లు అధికారవిభజనము చేయబడుటయు జరుగును. అమెరికాప్రెసిడెంటుయొక్క అధికారములపైన ఆ దేశపుశాసనసభ యగు కాంగ్రెసు కట్టి పరిసక్తియులేదు. కాంగ్రెసుకుగల శాసననిర్మాణాధికారములపైన ప్రెసిడెంటుకు గాని న్యాయసభలకు గాని అధికారములేదు. పరమోన్నతన్యాయస్థానమగు సుప్రీము కోర్టుకు ప్రెసిడెంటుతోను కాంగ్రెసుతోను కూడ తులదూగ గలట్టి యధికారములు న్యాయపరిపాలనయందు కలవు. ఈ అధికారవిభజనపద్ధతివలననే ఫెడరలువిధానమునకును ఏకైకవిధానమునకును తారతమ్య మేర్పడుచున్నది. ఏకైకప్రభుత్వమున సమానాధికారముగల వివిధసంస్థలుండవు. అధికారవిభజనము సౌకర్యముకొరకు చేయబడునే గాని రాజ్యాంగవిధానమునుబట్టి చేయబడదు. కేంద్రప్రభుత్వమునకు సంపూర్ణప్రభుతనిర్నిరోధఅధికారములు నుండును. రాష్ట్రములు పరిపాలనసౌకర్యముకొరకు కేర్పడిన పరగణాలుగ నుండి కేంద్రప్రభుత్వాజ్ఞలకు లోబడియుండును. వారికి ప్రతిబింబితదత్తాధికారములు (Delegated Powers) మాత్రమే ఉండును గాని సమానస్వతంత్రాధికారము లుండవు. రాష్ట్రపరిపాలనమున ప్రతివిషయమునను కేంద్ర

ప్రభుత్వము జోక్యము కలిగించుకొనవచ్చును. న్యాయసభలు స్వేచ్ఛగా ధర్మశాస్త్రప్రకారము వివాదలు తీర్మానించునే గాని రాజ్యాంగసూత్రములను సిద్ధాంతీకరింపవు. అమెరికా సంయుక్తరాష్ట్రములు స్విజర్లాండుప్రజాస్వామికమును బ్రిటీషు అధినివేశములగు కెనడా ఆస్ట్రేలియాలును ఫెడరలురాజ్యాంగమునకు జెందినవి. ఇంగ్లాండు ఫ్రెంచిదేశములు బ్రిటీషు అధినివేశమగు దక్షిణాఫ్రికాసమితియు భరతఖండమును ఏకైకరాజ్యాంగవిధానమునకు జెందినవి.

ఫెడరలువిధానము ద్వంద్వప్రభుత్వపద్ధతి యని చెప్పవచ్చును. నిజముగ నీపద్ధతిని సంయుక్తప్రభుత్వపద్ధతి యనుటకన్న వియుక్తప్రభుత్వపద్ధతి యనుట సమంజసముగ నుండును. ఫెడరలు విధానమున కేంద్రరాష్ట్రీయప్రభుత్వముల అధికారవిభజన, అధికారనిర్ణయము చాల, ముఖ్యమైన విషయములు. రాష్ట్రమునకు జీవనాధారము లగు రక్షణ, అనగా సేన, నౌకాదళము, విదేశవ్యవహారములు, ధనార్జనము, మున్నగు విషయములపైన కేంద్రసంయుక్తప్రభుత్వమునకే అధికారము లుండును. ఇక ప్రత్యేకరాష్ట్రములకు మాత్రమే సంబంధించినట్టిగాని ప్రత్యేకసంఘములకు జెందినట్టిగాని విషయములు సంయుక్తప్రభుత్వమున జేరిన రాష్ట్రభాగములకు వదలివేయబడును. రాకపోకలు, వివాహములు, విద్య ధర్మశాస్త్రములు, మున్నగువిషయము లాయా దేశములయొక్క ప్రత్యేకావశ్యకతలను బట్టి దేశకాలానుగుణ్యముగ రాష్ట్రీయకేంద్రప్రభుత్వముల కొసగబడుచున్నవి.

కేంద్ర రాష్ట్రీయప్రభుత్వములమధ్య అధికార విభజన సందర్భమున కొన్ని రాజ్యాంగలక్షణములు ద్యోతకమగుచున్నవి. (౧) రాజ్యాంగము స్పష్టముగ నొసగు నిర్దిష్టాధికారములు (Definite Powers) కేంద్రప్రభుత్వమున గలవా? లేక రాష్ట్రీయ ప్రభుత్వమునగలవా? (౨) ఫెడరలు కేంద్రశాసనసభలు చేసిన శాసనముల నేన్యాయసభ యైన రద్దు చేయుటకుగాని విఫలముచేయుటకుగాని అధికారముకలదా? (౩) ప్రత్యేక రాష్ట్రప్రభుత్వములను కేంద్ర ఫెడరలుప్రభుత్వ మెంతవరకు నిగ్రహింపగలదు ? (Control) (౪) రాజ్యాంగ విధానమును మార్చుటకు అధికారముగల రాజ్యాంగ మేమైన గలదా? అమెరికాసంయుక్తరాష్ట్రములు, స్విజర్లాండు, కెనడా, ఆస్ట్రేలియా రాజ్యాంగవిధానములందీ లక్షణము లెట్లున్నవో చూతము:

## అమెరికా సంయుక్తరాష్ట్రములు.

(౧) అమెరికా సంయుక్తరాష్ట్రముల రాజ్యాంగము వలన ఫెడరలు ప్రభుత్వమున కొసగిన అధికారములు స్పష్టముగ నిర్ణయింపబడియున్నవి. ప్రత్యేకరాష్ట్రముల కొసగబడిన అధికారములు అనిర్దిష్టములు; అందువలన అమితములు. కేంద్రప్రభుత్వమున కొసగని అధికారములెల్ల రాష్ట్రములవే. అందువలన స్పష్టముగాని అస్పష్టముగాని తన కొసగబడని అధికారములను ఫెడరలుప్రభుత్వము చలాయింపజాలదు. రాజ్యాంగము స్పష్టముగ తీసివేయని అధికారములెల్ల ప్రత్యేక రాష్ట్రములు స్వతంత్ర రాజ్యములవలె చలాయించును.

(౨) రాష్ట్రీయశాసనములును ఫెడరలుశాసనములును కూడ రాజ్యాంగమునకు లోబడియుండవలయును. అందువలన దానికి విరుద్ధములుగ చేయబడిన శాసనములు న్యాయస్థానములవలన గౌరవింపబడవు; అమలు జరుపబడవు.

(3) రాష్ట్రీయశాసనములను ఫెడరలుప్రభుత్వమువారు రద్దుపరుపజాలరు; నిషేధింపజాలరు. అయితే ప్రజాస్వామిక పద్ధతికి జెందిన ప్రభుత్వమే రాష్ట్రములం దుండవలయును. ఇందుకు భిన్నమగు ప్రభుత్వములను ఫెడరలు ప్రభుత్వమంగీకరింపదు.

(౪) రాజ్యాంగవిధానమున మార్పులు చేయుటకు రాష్ట్రములలో 3/౪ వంతులు అంగీకరింపవలయును. సెనేటులో రాష్ట్రములకుగల సమాన ప్రాతినిధ్యాధికారము, వాని అంగీకారము లేనిది మార్చుటకు వీలులేదు.

స్విజర్లాండు కాన్ఫెడరేషను.

(౧) స్విజర్లాండుయొక్క జాతీయ లేక ఫెడరలు ప్రభుత్వమునకు గల అధికారములు నిర్దిష్టములు. రాష్ట్రమున ప్రత్యేకభాగములగు "కాంటను"ల అధికారములు అనిర్దిష్టములు.

(౨) ఫెడరలు శాసనములెల్ల న్యాయస్థానములవలన గౌరవింపబడును. అయితే ఫెడరలుశాసనసభవారిచే శాసింపబడిన చట్టము, ౮.కాంటనులుగాని, 30,000 ప్రజలుగాని ప్రజాభిప్రాయపరీక్ష కంపవలసినదని కోరినచో వారి సమ్మతినిగాని నిరాకరణనుగాని పొందవలయును. కాంటనులు చేసిన

శాసనములు రాజ్యాంగమునకు విరుద్ధముగ నున్నచో న్యాయ స్థానములు వానినిఅమలు జరుపవు.

(౩) ఫెడరలు ప్రభుత్వమునకు కాంటనుల శాసనములను నిషేధించుటకుగాని రద్దుచేయుటకుగాని అధికారము లేదు. అయితే కాంటనుల రాజ్యాంగములును వాని మార్పులును ఫెడరలు ప్రభుత్వమువారివలన నిర్వహణప్రమాణము పొందవలయును. (Guarantee) ఫెడరలురాజ్యాంగమునకు విరుద్ధముగ నున్నచో నవి యట్టి యాచరణప్రమాణము పొందబడవు.

(౪) స్విజర్లాండులోని ప్రజలెల్లరు ఆలోచించగా అధికసంఖ్యాకులవలనను, కాంటనులన్నియు కలిసి యోజింపగ వానిలో అధికసంఖ్యవలనను, తీర్మానింపబడిననే, ఫెడరలు రాజ్యాంగమును మార్చవచ్చును. కాంటనులలో అధికసంఖ్య అంగీకరించని రాజ్యాంగసవరణాలు చెల్లవు.

కెనడా డొమినియను.

(౧) డొమినియను లేక ఫెడరలు ప్రభుత్వముయొక్క అధికారములు అనిర్దిష్టములు. ఇవిఅనిర్ణీతములు. ప్రత్యేకరాష్ట్రములయొక్క అధికారములు నిర్దిష్టములు; నిర్ణీతములు. ఈ విషయమున కెనడా రాజ్యాంగమునకును అమెరికా సంయుక్త రాష్ట్ర స్విజర్లాండు రాజ్యాంగములకును తేడాగలదు. రాజ్యాంగ విధానమువలన రాష్ట్రశాసనసభలకు స్పష్టముగ నొసగబడని అధికారముల నెల్ల ఫెడరలు లేక డొమినియను పార్లమెంటు చలాయించి శాసింపవచ్చును. రాష్ట్రీయశాసనసభలు తమకు

ప్రత్యేకముగ నిర్ణయింపబడిన విషయములందుమాత్రమే శాసనములను చేయవచ్చును.

(౨) ఫెడరలు లేక డొమినియను పార్లమెంటుయొక్క శాసననిర్మాణాధికారమును రాష్ట్రీయశాసనసభల నిర్మాణాధికారమును రాజ్యాంగము [౧౮౬౭ సం॥ బ్రిటీషు నార్తు అమెరికా (కెనడా) చట్టము] నకు లోబడియున్నవి. ఆరాజ్యాంగ చట్టమునకు విరుద్ధముగ చేయబడిన శాసనములు చెల్లవు.

(౩) రాష్ట్రీయ శాసనసభలుచేసిన శాసనములను డొమినియనుప్రభుత్వము నిరాకరింపవచ్చును. రాజ్యాంగమునకనుగుణముగ నున్న శాసనములకు సైతమంగీకరింపకపోవచ్చును.

(౪) ఈ డొమినియనుయొక్క రాజ్యాంగము బ్రిటీషు సామ్రాజ్యముచేసిన శాసనముపైన నాధారపడియున్నది. అందువలన నా రాజ్యాంగమునందు చెప్పబడినంత వరకే స్వయముగా మార్పుచెందవచ్చును. అంతకన్న హెచ్చు మార్పులు కావలసినచో సామ్రాజ్యపార్లమెంటు వారే మార్పవలెను. బ్రిటీషునార్తు అమెరికాచట్టముప్రకారము రాష్ట్రీయరాజ్యాంగములను రాష్ట్రీయశాసనసభలు మార్చుకొనవచ్చును. దీనిని ఫెడరలుప్రభుత్వమువారు తక్కిన శాసనములకువలెనే నిరాకరింపవచ్చును.

ఆస్ట్రేలియా కామన్వెల్తు.

(౧) ఫెడరలుప్రభుత్వముయొక్క అధికారములు నిర్దిష్టములై యున్నవి. రాష్ట్రముల పార్లమెంటులయొక్క అధికారములు అనిర్దిష్టములు ననిర్ణీతములునై యున్నవి.

(౨) ఫెడరలు కామన్వెల్తుపార్లమెంటువారి శాసన నిర్మాణాధికారమును రాష్ట్రీయపార్లమెంటుల శాసననిర్మాణాధికారమును గూడ రాజ్యాంగ విధానమునకు లోబడి యున్నవి. అందుకు విరుద్ధముగ చేయబడిన శాసనములు చెల్లవు.

(౩) కామన్వెల్తు (ఫెడరలు) ప్రభుత్వము ప్రత్యక్షముగగాని అపరోక్షముగగాని రాష్ట్రీయశాసనములను నిరాకరించుటకుగాని రద్దుచేయుటకుగాని వీలులేదు.

(౪) కామన్వెల్తురాజ్యాంగమును మార్చుటకు కామన్వెల్తుపార్లమెంటువారు శాసనము చేయవచ్చును. కొన్ని మార్పుల విషయములలోమాత్రము కామన్వెల్తు శాసన సభలలో నొకసభవారి వలనను, కామన్వెల్తు నియోజక వర్గములో అధికసంఖ్యాకులవలనను, అధికసంఖ్యరాష్ట్రముల వలనను, అంగీకారము బడయవలయును. శాసనసభ రాజ్యాంగమున చాల విషయములందు మార్పులు చేయవచ్చును. కామన్వెల్తు రాజ్యాంగము బ్రిటీషుపార్లమెంటువారి శాసనము వలననే నిర్ణయింపబడి యున్నందున ఆ పార్లమెంటువారు దీనిని మార్చవచ్చును; మాపుచేయవచ్చును.

ఫెడరలువిధానమునందలి మంచి చెడుగులు.

రాష్ట్రప్రయోజనములగు అంతరంగికశాంతి బాహ్యరక్షణలును, ఐక్యత, స్వేచ్ఛ, అభివృద్ధి, స్థిరత్వమును గూడ సంయుక్త రాజ్యతంత్రమువలన లభించును. సమాన గౌరవము గల పద్ధతులపైన వివిధరాష్ట్రము లిష్టపడి కలిసియుండు సమాఖ్యపద్ధతివలన దేశాక్రమణముచేసి రాజ్యవిస్తీర్ణము

చేయుపద్ధతి యావశ్యకము లేక పోవు చున్నది. అందరికి సమానములగు సాముదాయక వ్యవహారములను కేంద్రనిబంధనలకు లోబరచి ప్రత్యేక సంఘభాగములకు సంబంధించిన విషయము లాయా ప్రదేశములందలి జనులకే వదలుట వలన ఐక్యతవలని బలమును లాభమును, విశ్లేషవలన వ్యక్తులకు అభివృద్ధి లాభమును కలుగుచున్నవి. విదేశవ్యవహారములందు బలము జూపవచ్చును; ఆంతరంగిక వ్యవహారములందు స్వయంనిర్ణయసూత్రముల ప్రకార మభివృద్ధి జెందవచ్చును.

విశేష వైశాల్యముగల ప్రదేశములందు ప్రజాప్రాతినిధ్య పరిపాలనాలాభమును జనసామాన్యమునకు కలిగించుటకు సంయుక్తరాజ్యతంత్రమే సులభమార్గము. రాజకీయ ప్రచారము చేసి పెద్దదేశభాగములందు ప్రయోగించి చూచుటకు వీలులేని నవీనపద్ధతులను చేసి చూచుట కీవిధానము వలన వీలుకలుగును. వివిధజాతీయ, నాగరక పక్షములుకల రాజ్యమున కలుగు చిక్కులు సంయుక్త రాజ్యతంత్రమునకు కలుగవు. కేంద్ర ప్రభుత్వములకు సంభవించు సమస్యలు, కష్టములు, బాధ్యతలు, సంయుక్త ప్రభుత్వమున కుండవు. ప్రత్యేక స్థానిక తారతమ్యములు సంపూర్ణ సమాఖ్య సమ్మేళనమునకు ప్రతిబంధకముగ నున్నను, సంయుక్తప్రభుత్వము జాతీయాభివృద్ధికిని, ఏకీభావము కలిగించుటకును, తోడ్పడును. నూత్నరాజ్యములందు దేశాభివృద్ధికిని ప్రజాభి వృద్ధికిని తోడ్పడగల రాష్ట్రనిర్మాణమునకు ఫెడరలు రాజ్యాంగమే తగిన విధానము.

తమ స్వాతంత్ర్యము నెట్టి సందర్భమునను విడనాడుట కంగీకరింపని చిన్న సంస్థానములను సమ్మేళనము చేయుటకు సంయుక్త రాజ్యాంగతంత్రము తోడ్పడినది. మఱియు నట్లేర్పడిన సంయుక్త రాష్ట్రమునకు తగిన రాజ్యాంగనిబంధనలు కట్టుదిట్టములు చేసి అందలి ప్రజల రాజకీయ స్వాతంత్ర్యమును నిలిపియుంచి అందలి కేంద్రపరిపాలనము నిరంకుశము గాకుండగ నుంచినది.

సంయుక్తరాజ్యతంత్రమును తిన్నగ నుపయోగింపనిచో నది యరిష్టదాయక మగును. అంతరంగికముగ నొక రాష్ట్రభాగమునకు నింకొక రాష్ట్రభాగమునకును స్పర్థలు మితిమీరి సంయుక్తప్రభుత్వమును జిల్చి విదేశవ్యవహారములందు కూడ అవి ప్రవేశించినచో సంయుక్తప్రభుత్వము బలవంతమగు కేంద్రప్రభుత్వముగల ఇంకొక రాష్ట్రముతో దండనీతియందుగాని సామనీతియందుగాని వ్యవహారము జరుపవలసివచ్చినచో నది బలవిహీనమై పరాజితమగుట నిక్కము.

సంయుక్త రాష్ట్రమునకెల్ల క్షేమకరములును నావశ్యకరములును, నిష్పక్షపాతముగ పరిష్కరింపబడవలసిన విషయములునగు సాముదాయక వ్యవహారములు వివిధరాష్ట్రీయ పరిపాలనముల చిత్తమునకు వదలి యూరకొన్నచో వినాశహేతువగుట నిశ్చయము. మొదట వివిధరాష్ట్రీయ పరిపాలనములకు వదలబడిన అధికారములే దేశాభివృద్ధి జెందిన పిదప కేంద్రపరిపాలనము క్రిందికి రాతగిన యావశ్యకత కలుగును. అట్టితరి వానినట్లు కేంద్రప్రభుత్వము క్రిందికి తీసికొని రానిచో

దేశమునకు ముప్పు కలుగును. కేంద్రరాష్ట్రీయ ప్రభుత్వముల మధ్య అధికార విభజనము చాల కష్టతరమగు సమస్య. దీనివలన చాల తగవులు కలుగుచుండును. వీనిని పరిష్కరింపవలసిన సుప్రీముకోర్టుకు పని హెచ్చును. రాష్ట్రములందు పితూరీలు, కక్షలు వృద్ధియై కేంద్రప్రభుత్వముయొక్క అధికారమును రాష్ట్రీయపౌరులు తిరస్కరించుట కూడ జరుగును.

సంయుక్త రాజ్యతంత్రమునందు ద్వంద్వప్రభుత్వ విధానముండుట వలన చాల వ్యవహారములందు ద్విగుణమగు శ్రమయు, ధనవ్యయమును కలుగుచుండును. మఱియు కార్యాచరణమున చాలకాలవిలంబముకూడ కలుగుచుండును.

ధర్మశాస్త్రమును పరమప్రమాణముగ నంగీకరించి శాసనములకు లొంగియుండుట కలవాటు పడని ప్రజలకును వ్యవహారములను రాజీనామా పంచాయితీమూలమున పరిష్కరించుకొనుట కిష్టపడని ప్రజలకును సంయుక్తరాజ్య తంత్రము తగినది కాదు.

సంయుక్త విధానమునందలి లాభములను జూచి ప్రపంచమున ఏకైకవిధానమునకు జెందిన ప్రభుత్వములుకల దేశములవారు చాలమంది సంయుక్త విధానమునందలి రాజ్యాంగ పద్ధతులను స్వీకరించి ఆచరించుచున్నారు. అయితే ఏకైక ప్రభుత్వవిధానమునం దుండు బలవంతమైన కేంద్రప్రభుత్వము వలని లాభములను జూచి ఫెడరలువిధానమునందు కేంద్రమును బలపరచుకొను సూచనలును కనబడుచున్నవి. సాము

దాయిక పరిశ్రమలు, వస్తునిర్మాణము, విరివియగు వ్యాపారము, రాకపోకలును ఇదివర కొకరితో నొకరికి సంబంధములేని జాతులకు సంబంధము కల్పించుచున్నవి. వీనిని చక్కగ నిర్వహించుటకు బలముకల పరిపాలన మావశ్యకము. మఱియు గట్టి కేంద్రప్రభుత్వమువలన జాతీయతాభావము ఐకమత్యము వృద్ధియగును. యుద్ధములందును విదేశవ్యవహారములందును సమష్టికార్యకరణములందును మంచికేంద్రప్రభుత్వము చాల లాభకారియై ప్రత్యేక రాష్ట్రభక్తినిపోగొట్టి జాతీయతను పెంపుజేయును. వివిధరాష్ట్రముల వ్యక్తిత్వము పోగొట్టి పరగణాలుగ జేసివైచును. *



* ఈ అధ్యాయములోని ఫెడరలు రాజ్యాంగలక్షణము లెంతవరకు భారతదేశ రాజ్యాంగసంస్కరణ ప్రణాళికయందున్నవో జాగ్రత్తగా పరిశీలింపుడు.

## ౭

# ప్రజాప్రభుత్వము

# సమప్రమాణ ప్రాతినిధ్యము.

నేటి ప్రజాప్రభుత్వములందు ప్రజల ప్రతినిధులే శాసన సభలకేగి శాసనముల జేయుటయు, శాసనసభలకు బాధ్యులుగ నుండుమంత్రులే కార్యనిర్వహణము చేయుటయు జరుగుచున్నందున ప్రభుత్వములు ప్రజాభిప్రాయమును మన్నించుచుండును. ఈ ప్రభుత్వములు ఎన్నికలవలన నేర్పడు సంస్థలైనందున ఎన్నిక పద్ధతులు రాజ్యాంగమున చాల ప్రాముఖ్యమువహించినవి. నియోజనాధికారము జనసామాన్యమున కందరికి నుండవలయునను సూత్రము అంగీకరింపబడినది. అయితే నేడు అన్ని దేశములందును శాసనసభలకును, మునిసిపలు సభలకును ప్రతినిధుల నెన్నుకొను సామాన్య ఎన్నికవిధానమున ఏ అభ్యర్థికి అధిక సమ్మతులు వచ్చిన నాయభ్యర్థియే విజయుడై ఎన్నుకొనబడుచున్నాడు ఈపద్ధతిలో నొకలోపము కలదు. దేశమునందు ఎన్నికహక్కు కలవారిలో ఏ రాజకీయపక్షమువారధికముగ నుందురో వారిఅభ్యర్థియె నెగ్గును. అనగా దేశములోని జనులలో అధికసంఖ్యవారికే రాజకీయాభిప్రాయము లుండునో ఆపక్షమువారే ఎన్నుకొనబడుదురుగాని అల్పసాంఖ్యకులగు రాజకీయపక్షములవారికిగాని వేర్వేరు రాజకీయాభిప్రాయములు గలవారికిగాని ప్రాతినిధ్యమునకు చాల తక్కువ అవకాశము లుండును. ఈలోపమును సవరించుటకు మార్గము

లుయోజించు టావశ్యకమైనది. దేశమునందలి ప్రజలందఱి యభిప్రాయమును ప్రదర్శింపగల ప్రజాప్రతినిధులు ప్రజాప్రతినిధి సభలకు ఎన్నుకొనబడినగాని ప్రజాప్రభుత్వము పరిపూర్ణము కానేరదు. ప్రజాప్రతినిధి సభను దేశములోని నియోజక వర్గము నందలి అన్ని రాజకీయపక్షములవారి అభిమతబలము యొక్క ప్రతిబింబముగను నుండునట్లు చేయుటకొరకు రాజనీతిజ్ఞు లేర్పరచిన ఎన్నికపద్ధతికే సమప్రమాణ ప్రాతినిధ్యపద్ధతి; పరస్పరానుగుణ నియోజన లేక "ప్రిఫరెన్షల్ రిప్రజెంటేషను" అని వ్యవహరించుచున్నారు. ప్రజాప్రాతినిధ్యప్రభుత్వము నాశించువారెల్ల రీ ఎన్నిక విధానమును హర్షించుచున్నారు. దేశములోని అందరి అభిప్రాయము అల్పసంఖ్యాకుల (Minority) అభిప్రాయముకూడ వారివారిసంఖ్యనుబట్టి శాసనసభయందు ప్రాతినిధ్యము కలిగియుండవలయు నని ఈవిధానము నవలంబించువారియుద్దేశము. నేడు ప్రజాప్రభుత్వముగల రాజ్యాంగములగు జర్మనీ అమెరికా ఆస్ట్రేలియా దేశములం దీ పద్ధతిని ఉపయోగించుచున్నారు. ఒక్కొక్క ఎన్నిక ఫిర్కా (Constituency) కు ఒక్కొక్కఅభ్యర్థిస్థానమే యుండి సాధారణముగ ఒక్కొక్కనియోజకుడొక్కొకసమ్మతినిచ్చు పద్ధతియే సాధారణఎన్నికపద్ధతి. ఒక్కొక్కఎన్నిక ఫిర్కాలో 30,000 నియోజకులును ౫ అభ్యర్థిస్థానములు (Seats) నుండవలయు ననియు, అట్లు హెచ్చుస్థానములు గల పెద్దఎన్నికఫిర్కాలలో నియోజకు లెల్లరు తమతమ అభిమతానుసారముగ మొదటివాడుగను రెండవవాడుగను

వరుసక్రమముగ కడపటివాడుగను ఎన్నుకొనదలచుటను సూచించుటకు వీలుకలిగి ఒక అభ్యర్థినుండి ఇంకొక అభ్యర్థికి మార్చుటకును వీలుకల 'వినిమయయోగ్య సమ్మతి' (Single Transferable Vote) నిచ్చుపద్ధతిని స్థాపింపదలచిరి. బ్రిటీషుదీవుల రాజ్యమువారీ పద్ధతిని కొన్ని సంస్థలందుపయోగించుచున్నారు. ఈ పద్ధతిలో అభ్యర్థులపట్టికయొకటియుండును. సమ్మతినిచ్చుటకు వచ్చిన వోటరు నియోజకుడు తన యిష్టప్రకారము అందరిలో మొదటవచ్చిన బాగుండునని తనకు తోచిన అభ్యర్థి (Candidate) పేరుకు సూటిగా "౧" అని అంకెవేయును. అట్లే తనఅభిమతము ప్రకారము రెండవవాడుగ వచ్చిన బాగుండునని తోచినవాని పేరు కెదుట "౨" అను అంకెను అట్లె వరుసగా పట్టికలోనున్న అందరి పేళ్లయెదుటను ఎన్నవవాడుగా వచ్చిన బాగుండునని తోచునో ఆ యంకెను సూచించును. అంతట ఎన్నికఅధికారి (Returning Officer) నియోజకులు పూర్తిచేసిన సమ్మతిపత్రముల నెల్ల పరిశీలించి మొదట లెక్కలోనే మొదటిసంఖ్య సమ్మతులవలననే ఖాళీలకు ఎన్నుకొనబడి విజయులగు అభ్యర్థులయొక్క వోట్లలో మిగిలిన అభిమతానుగుణ ఉత్తమ సమ్మతులు (Preferences) ను, గెలుపొందుటకెట్టి అవకాశములేని చివరనున్న కనిష్ఠఅభ్యర్థులకు వచ్చిన వోట్లలో అభిమతానుగుణఉత్తమసమ్మతులను, నియోజకులు సూచించిన వరుసక్రమములో ఉత్తమసంఖ్యగల అభ్యర్థులకు పంచిపెట్టుదురు. అంతట నిర్ణీతసంఖ్య సమ్మతులు (Quota)

(మొదటి సమ్మతుల (First Votes) మొత్తమును ఖాళీలసంఖ్యతో భాగింపగావచ్చిన భాగలబ్ధసంఖ్య వచ్చిన అభ్యర్థులెల్ల ఎన్నుకొనబడినట్లెంచబడుదురు. అట్లు ఖాళీలెల్ల పూర్తియగువరకు పరస్పరానుగుణముగా సమ్మతులు విభజింపబడుచునే యుండును. ఈ పద్ధతిని పార్లిమెంటు ఎన్నికలలో నుపయోగింపవలయునని ఆంగ్లరాజనీతిజ్ఞులు ప్రియత్నించుచున్నారు. కాని యిది సఫలముకాలేదు. ఇంగ్లాండులో అనేక విశ్వవిద్యాలయముల సెనేటుఎన్నికలందును ఇతరశాసననిర్మాణసభలందును నీపద్ధతి నుపయోగించుచున్నారు. భరతఖండమున స్టేటుకవున్సిలుసభకు ప్రతినిధులను ఎన్నుకొనుటకీపద్ధతినే నిర్ణయించిరి. మన దేశమునందలి విశ్వవిద్యాలయములందు నీ పద్ధతిని నెలకొల్పిరి. భరతవర్షమున హిందూమహమ్మదీయప్రాతినిధ్యసమస్యాపరిష్కారమున కిది ఉపయోగింపగలదని కొందరి అభిప్రాయము. ఈ పద్ధతియొక్క ప్రాశస్త్యము నందరంగీకరించుచున్నారు. గాని దీని నుపయోగించుటకష్టతరమగు కార్యమనియుసామాన్యప్రజలు దీనినిగ్రహించి యాచరింపగలుగుట దుస్తరమనియు దీనిని విరివిగ నుపయోగించుటకు వెనుదీయుచున్నారు. దక్షిణాఫ్రికాసమితి రాజ్యాంగము ఈప్రాతినిధ్యపద్ధతి నంగీకరించినది. ౧౩౪ శెక్షనులో "సమితిసెనేటుసభఎన్నికలోను రాష్ట్రీయ కవున్సిలుసభలకార్యనిర్వాహకసంఘముల యెన్నికలలోను అభ్యర్థులు పోటీచేసి నిలిచి నప్పుడెల్ల సమప్రమాణప్రాతినిధ్య పద్ధతిప్రకారమే ఎన్నికలు జరుపబడవలెను. ఈ ఎన్నికలవిష

యములో గవర్నరుజనరులును సెనేటును మొదట ఎన్ను కొనునప్పుడు గవర్నరును తమతమ కార్యాలోచన సభవారి సలహాతో సమ్మతు లిచ్చువిధానము, సమ్మతులను పంచి లెక్కపెట్టుపద్ధతి, ఎన్నికఉద్యోగుల అధికారభాధ్యతలు,ఇత రనియములను చేయవలయును." అని శాసింపబడినది. ఐరిష్ఫ్రీస్టేటు రాజ్యాంగ చట్టము నందుకూడా ఈ ఎన్నిక పద్ధతి నిర్ణయింపబడి ఆచరింపబడు చున్నది.



౮

# కెనడా డొమినియను.

బ్రిటీషువారి అధినివేశరాజ్యములలో కెనడా చాల పురాతనమైనది. నేటి కెనడాడొమినియను అధినివేశ రాజ్యాంగము బ్రిటీషుసామ్రాజ్య పార్లిమెంటువారు ౧౮౬౭ లో చేసిన ఉత్తరఅమెరికారాజ్యాంగచట్టమువలన ఏర్పడినది. ఇందు నేడు క్విబెక్కు, ఒనటారియో, నోవాస్కోటియా న్యూబ్రిన్స్వికు, ప్రిన్సుఎడ్వర్డుఐలెండు, మనిటోబా, శాస్కాచేవన్, ఆల్బర్టా, బ్రిటీషుకొలంబియా, యూకన్, పశ్చిమోత్తరపరగణా, అనబడు రాష్ట్రములు కలవు. కెనడాడొమినియను రాజ్యవిస్తీర్ణము ౩౭౨౯౬౬౫ చతురపుమైళ్లు. ఇందలి జనసంఖ్య రమారమి ౯౦,౦౦,౦౦౦ ప్రభుత్వాదాయము రమారమి ౮ కోట్ల పౌనులు.

ఈ రాజ్యాంగమున నొక కేంద్రసంయుక్తప్రభుత్వమును వేరు వేరు రాష్ట్రీయ ప్రభుత్వములును వీనికి వేరు వేరు శాసనసభలు కలవు. కేంద్రప్రభుత్వమున కార్యనిర్వాహణాధికారము బ్రిటీషురాజునందు నెలకొల్పబడి ఆయనపేరున బ్రిటీషువారంపు గవర్నరుజనరలువలన నిర్వహింపబడును. గవర్నరు జనరలుకు సాలుకు ౧౦ వేల పౌనుల జీతము. ఆయనకు పరిపాలనవ్యవహారములందు సహాయము చేయుటకొక ప్రీవీకవున్సిలు కలదు. ఈప్రీవీకవున్సిలులో నొక ప్రధానమంత్రియు, పదముగ్గురు సామాన్యమంత్రులు

నుందురు. సామాన్యమంత్రులు ప్రభుత్వశాఖల కధ్యక్షులుగ నుండి రాజ్యాంగకార్యనిర్వహణము చేయుచుందురు.

శాసన నిర్మాణాధికారము, సెనేటు కామన్సు సభ అను రెండు శాసనసభలుగల పార్లమెంటు అనబడు రాజ్యాంగమున నెలకొల్పబడినది. సెనేటుసభలో ౯౬ గురు సభ్యులు కలరు. ప్రతిసభ్యుడును కెనడా దేశములో పుట్టినవాడైన గావలెను; లేక శాస్త్రప్రకారము (Naturalised) పౌరస్వత్వము పొందినవాడైన గావలయును. ౩౦ సంవత్సరముల వయసువాడుగ నుండవలెను. ఏ రాష్ట్రమున సభ్యుడుగ నియమింపబడునో అందు ౪౦౦౦ డాలరుల ఆస్తి కలిగియుండవలయును.

ఆయా రాష్ట్రములనుండి నియమింపబడు సభ్యులసంఖ్య:—

| | | | |
|---|---|---|---|
| ఒంటారియో | ౨౪ | | |
| క్విబెక్కు ... | ౨౪ | బ్రిటీషు కొలంబియా ... | ౬ |
| నోవాస్కోటియా | ౧౦ | ప్రిన్సు ఎడ్వర్డు దీవి ... | ౪ |
| న్యూబ్రన్సువిక్కు | ౧౦ | ఆల్బర్టా ... ... | ౬ |
| మనిటోబా ... | ౬ | శాస్కచేవన్ ... ... | ౬ |

కామన్సు సభలో ౨౩౪ సభ్యులు కలరు. వీరు ప్రజల వలన ఎన్నుకొనబడి ౫ వత్సరములు సభ్యులుగ నుందురు. దేశములోని ౩౦,౦౦౦ మంది ప్రజలకొక్కొక ప్రతినిధి స్థానముండును. కొంచెము ఆస్తి కలిగి ౨౧ వత్సరములు వచ్చిన ప్రతి పురుషునకును ఎన్నిక హక్కు కలదు. శిష్టసభలోని సభ్యులకు

సభయొక్క సమావేశకాలమునకు ౨౫౦౦ డాలర్ల వేతన మీయబడును. కామన్సుసభ్యులకును సమావేశమునకు ౨౫౦౦ డాలర్లు మించకుండ వేతన మీయబడును. సభ్యులు హాజరు కానికాలమునకు సొమ్ము మినహాయింపబడును.

కెనడాలోని ప్రతిరాష్ట్రమునకును వేరువేరు రాష్ట్రీయ పార్లమెంటులు, శాసనసభలు, ప్రభుత్వములు కలవు. వాని ముఖ్యపరిపాలకుడు కేంద్రప్రభుత్వమువారు నియమించు "లెఫ్టినెంటుగవర్నరు." క్విబెక్కు, నోవాస్కోటియా రాష్ట్రములకు కేంద్రప్రభుత్వమునందువలెనే రెండుశాసనసభలు కలవు. ఈపద్ధతికి "ద్విమందిరవిధాన"మందురు. తక్కిన రాష్ట్రములం దొక్కొక సభ మాత్రమే గలదు. కేంద్రపార్లమెంటుయొక్కయు, రాష్ట్రీయ శాసనసభలయొక్కయు అధికారములు రాజ్యాంగమున స్పష్టీకరింపబడినవి. *

కెనడారాజ్యమున మంచిస్థానికస్వపరిపాలనము కలదు. రాష్ట్రములందలి జిల్లాలకు బోర్డుసభలును, పట్టణములకు మునిసిపలు సభలును, వానికి శాసననియమములు చేయు ప్రతినిధి సంఘసభలును, గలవు. అచ్చటిపన్నుల నా సంఘములే విధించి ప్రజలకు ఆరోగ్యసౌఖ్యములను కలిగించుచున్నవి.

కెనడా దేశమున న్యాయ పరిపాలనము ఇంగ్లాండులోని ధర్మపరిపాలనా విధానమువంటిదే. క్విబెక్కు రాష్ట్రమున మాత్రము ఫ్రెంచిజాతివా రధికముగ నున్నందున ప్రాత

* అనుబంధము చూడుడు.

ఫ్రెంచి ధర్మమే ఆచరణమున నిలిచినది. "ఎక్శ్ఛకరు," నౌకా వ్యవస్థ సభగాక కెనడా డొమినియను రాజ్యమునందెల్ల ధర్మ పరిపాలనాధికారముగల పరమోన్నత న్యాయస్థానము సుప్రీము కోర్టు. సివిలు వ్యవహారధర్మమునందును క్రిమినలు దండవిధి ధర్మములందును సామాన్యకోర్టులపైన అప్పీళ్ళను తీర్మానించునది పరమోన్నత న్యాయస్థానమగు సుప్రీము కోర్టే. కొన్ని సందర్భములందు సుప్రీముకోర్టు తీర్పులపైన ఇంగ్లాండులో ప్రీవీకవున్సిలు సభకు అప్పీళ్ళను తీసికొని వెళ్ళవచ్చును.

* కేంద్రరాష్ట్ర ప్రభుత్వ అధికారములు :

కెనడా అధినివేశరాజ్య పార్లమెంటుయొక్కయు, రాష్ట్రముల శాసనసభలయొక్కయు అధికారములు బ్రిటీషు పార్లమెంటువారు (౧౮౬౭) లో శాసించిన బ్రిటీషునార్తు అమెరికా ఆక్టుయొక్క ౯౧, ౯౨ సెక్షనులవలన నిర్ణయింపబడినవి.

౯౧ వ సెక్షను: చక్రవర్తికి సెనేటుయొక్కయు, కామన్సుయొక్కయు, సలహాతోను అంగీకారముతోను కెనడా దేశముయొక్క శాంతికి క్రమపరిపాలనకు సత్ప్రభుత్వమునకును ఈ శాసనమువలన రాష్ట్రీయశాసనసభలకు ప్రత్యేకముగ నొసగబడినవిషయములందు తప్ప తక్కినవిషయములందెల్ల శాసనములఁ జేయుట కధికారము కలదు. ఇంకను స్పష్టముగ నుండగలందులకు ఈదిగువ నుదాహరింపబడిన విషయములను గూర్చి

---

* అనుబంధము

శాసనములు జేయుటకు సంపూర్ణాధికారము పార్లమెంటునకే కలదు.

౧ రాజ్యముయొక్క ఋణము, ఆస్తి.

౨ వర్తకము, వ్యాపారమునుగూర్చిన నియమములు.

౩ పన్నులు విధించుట మూలముగా ఆదాయమును సమకూర్చుట.

౪ రాజ్యముయొక్క పరపతిపైన ఋణములు తెచ్చుట.

౫ తపాలా వ్యవహారములు.

౬ జనాభా, దేశాభివృద్ధిని పరిజలస్థితిగతులను గూర్చిన ఇతర అంకెలు (Statistics).

౭ సైన్యము, సైనికవ్యవస్థ, నౌకాదళము, దేశరక్షణము.

౮ కెనడాపరిభుత్వముయొక్క ఉద్యోగులవేతనములు, బత్తెములు.

౯ సముద్రమార్గదర్శక సాధనములు, (Buoys) ప్లవలు, దీపస్తంభములు, సేబిల్ ద్వీపము.

౧౦ నౌకావిషయములు, నౌకాయానము.

౧౧ (Quarantine.) "క్వారంటైన్". నౌకలలో నంటురోగము లున్నవని అనుమానము కలిగినయెడల వానిని రేవులో నిరోధించుట, నావికుల వైద్యాలయములు.

౧౨ సముద్రతీరము, దేశములోనిమత్స్యశ్రేయములు.

౧౩ రాష్ట్రములమధ్యగాని, రాష్ట్రములకును బ్రిటీషువారి దేశములకు మధ్యగాని, రాష్ట్రములకును ఇతరరాజ్యములకు మధ్యగాని ఉండు "బల్లకట్లు."

౧౪ నాణెములు, (Currency) చలామణి.

౧౫ ధననిధిసంస్థలు (బ్యాంకులు), వాని స్థాపనము, కాగితపు ద్రవ్యము.

౧౬ సేవింగ్సు బ్యాంకులు.

౧౭ ఎత్తురాళ్లు, కొలపాత్రలు.

౧౮ చెక్కులు, హుండీలు, ప్రామిసరీనోట్లు.

౧౯ వడ్డీ.

౨౦ (Legal Tender) దేశవ్యవహారములందు తప్పక చలామణి కావలసినద్రవ్యము.

౨౧ దివాలా.

౨౨ పరిశోధనలు, క్రొత్తవస్తువులస్వరూపస్వభావములందు మానవులకు గల పేటెంటుహక్కులు (Patents).

౨౩ గ్రంథస్వామ్యములు. (కాపీరైటు)

౨౪ ఇండియనులు, (ఎఱ్ఱయిండియనులు) వారికొరకు నిర్దేశింపబడిన భూములు.

౨౫ పరదేశీయులు, వారికి పౌరస్వత్వములనిచ్చు అధికారము.

౨౬ వివాహములు, వివాహవిచ్ఛేదనము.

౨౭ దండనస్మృతి, క్రిమినలు ధర్మపరిపాలనముచేయు న్యాయస్థానముల నిర్మాణపద్ధతిగాక ధర్మాచరణ పద్ధతులు.

౨౮ సంస్కరణ కారాగారములు (Penitentiaries) ను స్థాపించుట, పోషించుట, పరిపాలించుట.

౨౯ ఈ చట్టమువలన రాష్ట్రీయ శాసనసభలకు అధికార మీయబడిన విషయములందు స్పష్టముగ నీపార్లమెం టువారికి ప్రత్యేకింపబడినవిషయములు.

ఈ శెక్షను (విధి) లో నుదాహరింపబడిన విషయవిభాగమునం దేదాని క్రిందికైనను వచ్చు విషయములు.

౯౨ శెక్షను రాష్ట్రీయశాసనసభల యధికారములను నిర్ణయించుచున్నది. ప్రతిరాష్ట్రీయశాసనసభయు నీ క్రింద నుదాహరింపబడినవిషయములనుగూర్చి శాసనములను చేయ వచ్చును.

౧ రాష్ట్రపరిపాలకుఁడు (లెఫ్టినెంటు గవర్నరు) యొక్క ఉద్యోగమును గూర్చి తప్ప తక్కినరాష్ట్రీయరాజ్యాంగమును గూర్చి అప్పుడప్పుడు కావలసినమార్పులు చేయుట.

౨ రాష్ట్రీయవ్యవహారములకొరకు ధనమునసమకూర్చుటకు రాష్ట్రమున పన్నులు విధించుట.

3 రాష్ట్రముయొక్కపరపతిపైననే అవసరమైనఋణములు చేయుట.

౪ రాష్ట్రీయోద్యోగులను నియమించుట, వారి యుద్యోగ కాలనిర్ణయము, వారి కిచ్చు వేతనములు.

౫ రాష్ట్రముయొక్క సర్కారుభూములు, వానిఅమ్మకము; కలప, దాని అమ్మకము.

౬ రాష్ట్రమున గావలసిన కారాగారములను సంస్కరణ కారాగారములను నిర్మించి, పోషించి పరిపాలించుట.

౭ నౌకావైద్యాలయములు గాక రాష్ట్రములోని వైద్యాలయములు, శరణాలయములు, ధర్మములు (Charities & Eleemosynary Institutions)

౮ పురపాలక సంస్థలు.

౯ రాష్ట్రప్రభుత్వమునకును పురపాలకస్థానికసంస్థలకును ధనము సేకూర్చుటకు, అంగళ్లకు విక్రయశాలలకు సారాయివిక్రయశాలలను వేలము వేయు సంఘములకు, (లైసెన్సు) అనుమతిపత్రముల నిచ్చుట.

౧౦ ఈ క్రింద పేర్కొనబడినట్టివి గాక ఇతర స్థానికపనులు చేయుట (Local works and undertakings.)

(1) స్టీమరులు ఇతర నౌకామార్గములు, రైలుదారి, కాలువలు, తంతిమార్గములు, ఒక రాష్ట్రమునితరరాష్ట్రముతో కలుపుమార్గములు గాని రాష్ట్రము సరిహద్దు దాటి జరుపవలసినపనులు గాని.

2 రాష్ట్రమునకును ఇతర బ్రిటీషు దేశమునకును పర దేశములకు మధ్యనుండు స్టీమరుమార్గములు.

(3) రాష్ట్రమునసే నిర్మింపబడియు, నిర్మాణమైన పిదప గాని ఎప్పుడైనా గాని కెనడాపార్లమెంటువారి వలన కెనడాదేశమునకెల్లగాని రెండురాష్ట్రములకు గాని ఇంక నెక్కుడురాష్ట్రములకు గాని ప్రయోజన కారులని నిర్ణయించు పనులు.

౧౧ రాష్ట్రమునకు సంబంధించిన యుద్దేశ్యములతో స్థాపింపబడు కంపెనీలను అంగీకరించుట.

౧౩ రాష్ట్రములోని ఆస్తినిగూర్చినట్టియు ప్రజలయొక్కయు సివిలుహక్కులు.

౧౨ రాష్ట్రములోని వివాహముల అంగీకారమునుగూర్చిన శాసనము.

౧౪ రాష్ట్రీయన్యాయస్థానములను నిర్మించి వాని సివిలు క్రిమినలు ధర్మపరిపాలనావిధానమును నిర్ణయించుట.

౧౫ ఈ శెక్షనులో చెప్పబడినవిషయములనుగూర్చి తాము చేసినశాసనములను అమలుచేయుటకు అపరాధమును గాని శాస్తినిగాని శిక్షనుగాని విధించుట.

౧౬ రాష్ట్రములకు సంబంధించు స్థానికవ్యవహారములు.



౬

# ఆస్ట్రేలియా కామన్వెల్తు.

ఆస్ట్రేలియా మనభరతఖండమునకు ఆగ్నేయమూలగా పసిఫికుమహాసముద్రమున నున్న గొప్పద్వీపము. దీనివిస్తీర్ణము ౨౯,౭౪,౫౮౧. చదరపుమైళ్లు. ఇందలి జనసంఖ్య రమారమి ౫౦,౦౦,౦౦౦ ఈ ద్వీపమును క్రీస్తుశకము ౧౭౭౦ సంవత్సరముననె పాశ్చాత్యులు చూచిరి. బ్రిటీషువారు ద్వీపాంతరవాసము ననుభవింపుడని శిక్షించినవారి నెల్లర నిచ్చటికి దిగుమతి చేయసాగిరి. ఈశిక్షితులసంతతివారే నే డచ్చట స్వారాజ్యము ననుభవించుచున్న తెల్లవారు. మొదట నీద్వీపమును బ్రిటీషుసేనానులే నిరంకుశముగ బరిపాలించుచుండిరి. కాని తరువాత నొక చిన్నశాసనసభ నేర్పరచి దానిలో కొందఱు సభ్యులను నియమించిరి. ఆస్ట్రేలియా రాజ్యమున న్యూసౌత్ వేల్సు, విక్టోరియా, సౌత్ ఆస్ట్రేలియా, క్వీన్సులాండ్, వెస్టర్న్ ఆస్ట్రేలియా, టాస్మానియా అను రాష్ట్రములు కలవు. ఈ రాష్ట్రము లభివృద్ధిజెందగా ౧౮౬౦ లో బ్రిటీషు ప్రభుత్వమువారు బాధ్యతాయుతస్వపరిపాలనము నొసగిరి. అనగా వీని ప్రభుత్వాధికారము ఒక గవర్నరును, ప్రజాప్రతినిధులు కల శాసనసభలును, కలిసిన రాష్ట్రీయ "పార్లమెంటు" ల యందు నెలకొల్పబడినది. శాసనసభలకు బాధ్యులగు పరిపాలకమంత్రులే రాజ్యాంగవ్యవహారములను చక్క

బెట్టుచుందురు. కొన్ని వత్సరముల కీరాష్ట్రీము లొకసమితిగ కలిసి ఒక సంయుక్త రాజ్యాంగమును స్థాపించుటకొనుట మంచిదని రాజనీతిజ్ఞులకు తోచెను. దీనినిగూర్చి కార్యాలోచనము జరిగి కొన్నాళ్ల కొకచిత్తు రాజ్యాంగచట్టమును తయారుచేసిరి. దానికి బ్రిటీషుపార్లమెంటువారు ౧౯౦౦ సంవత్సరమున తమ యనుమతి నొసగిరి. ఈ సంయుక్తసమితి ప్రభుత్వమునకు "ఆస్ట్రేలియా కామన్వెల్తు" అని పేరు. ఆస్ట్రేలియాలోని వివిధరాష్ట్రీములు తమ క్షేమలాభములకొరకు సమితిలో చేరినవేగాని తమవ్యక్తిస్వాతంత్ర్యమును, స్వపరిపాలనాధికారములను గోల్పోవుట కిచ్ఛగింపలేదు. అందువలన వాని కిదివర కుండిన రాజ్యాంగస్వపరిపాలనాధికారములెల్ల అట్లేయున్నవి. ఆరాష్ట్రీములకు పరిపాలకులను (గవర్నరులను) బ్రిటీషు వలస రాజ్యాంగమంత్రియె నియమించును. ఈరాష్ట్రీముల కెల్ల తమదేశములందు పన్నులు విధించుకొను నధికారము, శాసనములను చేసికొను నధికారమును గలవు. సమితియొక్క శాంతికి క్రమపరిపాలనకు నావశ్యకమగు ప్రభుత్వాధికారములును శాసనాధికారములును ఈ రాష్ట్రీములు తమంతటతాము సమితిప్రభుత్వమున కొసగినవి. అట్లొసగబడిన శాసనాధికార ప్రభుత్వాధికారము లెల్ల రాజ్యాంగచట్టమున వివరింపబడినవి. * ఈ అధికారములు గాక మిగిలిన అనిర్దిష్టములగు శాసనాధికారము లెల్ల రాష్ట్రీయశాసనసభలకే గలవుగాని సమితిశాసనసభలకు లేవు. కెనడాలో

---

* అనుబంధము చూడుడు.

అనిర్దిష్టములగు నధికారము లెల్ల సమితిశాసనసభలకే కలవు. గాని రాష్ట్రీయ శాసనసభలకులేవు. సమితి ప్రభుత్వాధికారము సమితియొక్క ఫెడరల్ పార్లమెంటు అనగా సార్వభౌమ ప్రతినిధియగు గవర్నరుజనరలును, ప్రజాప్రతినిధులు గల సెనేటుసభ ప్రజాప్రతినిధులసభ యను శాసనసభలును, కలిసిన రాజ్యాంగమున నెలకొల్పబడినది. సెనేటుసభకు ప్రతి రాష్ట్రమునుండి ఆరుగురుసభ్యులకు తక్కువ లేకుండగ బంపు చుందురు. వీరు ౬ సంవత్సరము లుందురు. ప్రజాప్రతినిధుల సభకు (House of Representatives) రాష్ట్రములలోని జన సంఖ్యనుబట్టి సభ్యుల నంపుదురు. ఎంత తక్కువ జనసంఖ్య యున్నను ౫ గురు కన్న తక్కువసభ్యులను పంపరు. ఈ రెండు శాసనసభలకును అధ్యక్షుల నెన్నుకొందురు. సభ్యుల కెల్లరకు సాలుకు నాలుగువందలపౌనులవేతన మీయ బడును. ప్రభుత్వాదాయముయొక్క వ్యయవిధానమునకు గవర్నరు జనరలు తన అంగీకారము నొసగవలయును. శాసన సభల కభిప్రాయభేదములు కలిగినప్పుడు చేయవలసిన కర్తవ్యము కూడ రాజ్యాంగచట్టమున నిర్ణయింపబడినది. చట్టము లెల్ల సార్వభౌముని అంగీకారము బడయవలయు నను నియమము కలదు.

పరిపాలనాధికారము (Executive power) గవర్నరు జనరలును, అతనికి సహాయముగ నుండు పరిపాలకసభయు (ఎగ్జిక్యూటివు కవున్సిలు) నిర్వహింతురు. అందలిసభ్యులను గవర్నరుజనరలె నియమించును. సైనికనావికాదళము లతని

అధికారముక్రింద నుండును. సమితిమంత్రుల నతడే నియ
మించును. మంత్రులెల్లరు పరిపాలకసభలో సభ్యులుగ
నుందురు. ఈ మంత్రులు శాసనసభలో సభ్యులుగ నుండి
యుండవలెను; లేనిచో గవర్నరుజనరలు నియమించినది
మొదలు 3 నెలలలో సభ్యత్వము సంపాదించుకొనవలయును.

న్యాయపరిపాలనాధికారము హైకోర్టునందును ఇతర
న్యాయస్థానములందును కలదు. తక్కిన సమితిన్యాయస్థాన
ముల పైనను, రాష్ట్రీయ సుప్రీముకోర్టుల పైనను, ఉపర్యభి
యోగము (అప్పీలు) హైకోర్టుకు చేయుదురు. సమితి పార్ల
మెంటువారు చేసిన శాసనములను గూర్చిన వ్యాజ్యములను,
ఒకరాష్ట్రమున కింకొకరాష్ట్రమునకును గలుగు వ్యాజ్యములను,
పరదేశప్రతినిధులకు సంబంధించినవ్యాజ్యములను, పరిష్క
రించు నధికారము హైకోర్టుకే కలదు. హైకోర్టు తీర్పులపైన
ప్రీవీకవున్సిలుసభాయుతుడగు బ్రిటీషుసార్వభౌమునికి అప్పీలు
చేయతగినవిషయములు నిర్ణయింపబడినవి. రాజ్యాంగవివాద
లనుగూర్చి ప్రీవీకవున్సిలుకు అప్పీలు లేదు.

రాష్ట్రములపరిపాలనక్రిందినుండి సమితిపరిపాలనక్రిందికి
మార్పు జెందు మధ్యకాలమున ఆర్థికవ్యాపార పద్ధతులందు
నష్టము సంభవించకుండగ కొన్ని కట్టుదిట్టములు రాజ్యాంగ
చట్టముననె చేయబడెను. రాజ్యాంగ విధానమునందు మార్పు
లేమైన గావలసినచో అట్టి మార్పులకు రాష్ట్రములు లోబడి
అందలిప్రజలు అంగీకరించినచో, అట్టి మార్పులు చేయుటకు
సదుపాయములు రాజ్యాంగచట్టమున నిర్ణయింపబడెను.

* ఆస్ట్రేలియారాజ్యాంగవిధానమును నిర్ణయించిన ఆస్ట్రేలియామహాకాన్వెల్తు ఆక్టు ౫౧, ౫౨ సెక్షనులలో సమితిపార్లమెంటుయొక్క అధికారములు పేర్కొనబడినవి.

౫౧ వ శెక్షను:— ఈరాజ్యాంగమునకు లోబడి సమితి 'పార్లమెంటు' సమితియొక్క శాంతికి, క్రమపరిపాలనకు, సత్ప్రభుత్వమునకు వలయునట్టు లీక్రిందివిషయములను గూర్చి శాసనములజేయుట కధికారము కలదు.

౧ వర్తకము, ఇతరదేశములకును సమితికిని సమితిలోని రాష్ట్రములలో నొకదాని కింకొకదానితోను గల వ్యాపారము.

౨ రాష్ట్రములందుగాని రాష్ట్రభాగములందుగాని పక్షపాతబుద్ధి లేకుండ సమితికి కావలసినపన్నులు విధించుట.

3 పంటలుగాని ఎగుమతులు గాని ప్రోత్సహించుటకు బహుమానముల నిచ్చుట. ఇందు సమితిలోని వివిధ భాగములలో హెచ్చు తగ్గు లుండరాదు.

౪ సమితియొక్క పరపతిపైన ఋణములు చేయుట.

౫ తపాలా, తంతివార్తలు, తంతిసంభాషణలు, మున్నగు వ్యవహారములు.

౬ నావికసైనికవ్యవస్థలు, సమితియొక్కయు, వివిధ రాష్ట్రములయొక్కయు సంరక్షణము, సమితియొక్క

శాసనములను నిర్వర్తించుటకు, అమలుచేయుటకు, బలములను నడుపుట.

౭ దీపస్తంభములు, దీపపుటోడలు, సముద్రమార్గదర్శక దీపములు, ప్లవములు (Buoys).

౮ ఖగోళవాతావరణపరిస్థితులనుగూర్చినవ్యవహారములు.

౯ "క్వారంటైన్" అంటురోగము లున్నవని అనుమాన మున్నచో ఓడలను రేవులలో నిరోధించియుంచుట.

౧౦ ఆస్ట్రేలియాద్వీపముయొక్క సముద్రతీరమునకు మూడు మైళ్లదూరమున చేపలుపట్టువర్తకమునుగూర్చిన విష యములు.

౧౧ జనాభా; ప్రజలస్థితిగతులను గూర్చిన వృత్తాంతము, అంకెలు (Statistics).

౧౨ చలామణి, నాణెములు, సామాన్య చలామణి; అనగా దేశవ్యవహారములందు చలామణియగునట్లు ప్ర భుత్వమువారు నిర్ణయించుద్రవ్యము.

౧౩ రాష్ట్రీయబ్యాంకులు గాక ఇతరబ్యాంకివ్యవహారములు, రాష్ట్రములసరిహద్దులు మీరి వ్యవహరించు బ్యాం కులు, బ్యాంకులను రిజిష్టరుచేయుట (Incorporation), కాగితపుద్రవ్యములను ప్రచురించుట.

౧౪ రాష్ట్రీయభీమావ్యాపారముగాక ఇతరభీమావ్యాపా రము.

౧౫ తూనికరాళ్లు, కొలపాత్రములు.

౧౬ హుండీలు, ప్రామిసరీనోట్లు.

౧౭ దివాలా.

౧౮ కాపీరైటు హక్కులు, పరిశోధనలందలి హక్కులు, క్రొత్తవస్తువుల స్వరూపస్వభావములందు పేటెంటు స్వామ్యములను నిర్ణయించుట.

౧౯ పరదేశీయులు, వారికి పౌరస్వత్వముల నొసగునధికారము.

౨౦ పరదేశీయులయొక్క కంపెనీలు, సమితిహద్దులలో వ్యాపారమునుగూర్చి కాని, ఆర్థికవిషయములనుగూర్చి కాని స్థాపింపబడుసంఘములు.

౨౧ వివాహములు.

౨౨ వివాహబంధవిచ్ఛేదనము (Divorce), దానినిగూర్చిన వ్యాజ్యములు, తల్లిదండ్రులహక్కులు, మైనరుల సంరక్షణమునుగూర్చిన హక్కులు.

౨౩ ఆపదలు కలిగినవారికిగాని, ముదుసలివారికిగాని ఉపకారవేతనము లొసగుట.

౨౪ రాష్ట్రములయొక్క సివిలు క్రిమినలు న్యాయస్థానముల తీర్పులను సమితిహద్దులలో అమలుజరిగించుట, వాని ఉత్తరువులను జారీచేయుట.

౨౫ రాష్ట్రముల శాసనములు, వానిప్రభుత్వతీర్మానములు, కార్యములు, దస్తావేజులు; న్యాయ స్థానములతీర్పులను సమితిహద్దులలోనెల్ల గౌరవింపజేయుట.

౨౬ రాష్ట్రములలోని ఆదిమవాసులనుగూర్చి గాక ఇతర జాతులవారి యోగక్షేమములకు వలసినశాసనములను చేయుట.

౨౭ వలసకు పోవువారినిగూర్చినవిషయములు, వలసవచ్చు వారినిగూర్చినవిషయములు.

౨౮ శిక్షితుల సంఖ్యనుగూర్చియు, అభివృద్ధిని గూర్చియు విచారించుట.

౨౯ పరదేశములతోడి వ్యవహారములు.

౩౦ పసిఫికు మహాసముద్రమున గల ఇతరద్వీపములతోడి వ్యవహారములు.

౩౧ రాష్ట్రముల ప్రభుత్వముల దగ్గరనుండి కాని, దేశములోని ప్రజలవలనగాని, పార్లమెంటువారికి శాసనము చేయుట కధికారము గల పనికొరకు ఆస్తిని వశముచేసికొనుట (Acquisition of Property).

౩౨ సమితియొక్క నావికదళమునుగాని సైనికదళమును గాని పంపుచుండుటకు,సమితిలోనిరైళ్ళపైనధికారము.

౩౩ రాష్ట్రములలోని రైలుదారి యవసరమైనచో నారాష్ట్రముతో ఏర్పాటుచేసికొని దానిని వశముచేసికొనుట.

౩౪ ఆ యా రాష్ట్రముల యంగీకారముతో రైలుదారిని వృద్ధిచేయుట.

౩౫ రాష్ట్రమున సరిహద్దు దాటి వ్యాపారములను చేయు వారితగవులను తీర్మానించుట, రాజీలకు మధ్యస్థులను నియమించుట.

౩౬ పార్లమెంటువారు మార్చివేయువరకు నీరాజ్యాంగ చట్టము నిర్ణయించిన అన్నివిషయములందు సమితి కధికారము కలదు.

౩౭ రాష్ట్రములు పార్లమెంటు సమితిపార్లమెంటువారికి తీర్మానించుటకొఱ కంపువిషయములు. అట్టితీర్మాన మారాష్ట్రములకే వర్తించును.

౩౮ ఈరాజ్యాంగనిర్మాణసమయమువాటికి బ్రిటీషుపార్లమెంటువారు గాని, ఆస్ట్రేలియాకవున్సిలు మాత్రమే గాని, చలాయించుట కధికారము కలిగినవిషయములను గూర్చి రాష్ట్రములకోరికపైనగాని అంగీకారముతో గాని సమితి దేశమున చలాయించుట.

౩౯ ఈ రాజ్యాంగమువలన పార్లమెంటుకు సమితిప్రభుత్వమునకు నొసగబడిన అధికారములు, అవి అమలు జరిగించుటకు వలసినఅధికారములు.

౫౨ వ శెక్షను:—సమితిలోని శాంతికి క్రమపరిపాలనమునకు, సత్ప్రభుత్వమునకు నీక్రిందివిషయములను గూర్చిన శాసనములను జేయుటకు పార్లమెంటునకు మాత్రమే సంపూర్ణాధికారము కలదు.

౧ సమితి ప్రభుత్వముయొక్క కేంద్రస్థానము నిర్ణయించుట, సమితిప్రభుత్వమువారు వశము చేసికొనిన ప్రదేశములు.

౨ ఈ రాజ్యాంగమువలన సమితిప్రభుత్వకార్యనిర్వాహకవర్గమువారి యధికారముక్రింద నుంచబడిన పరిపాలనశాఖలోని ఉద్యోగులనుగూర్చిన విషయములు.

3 ఈ రాజ్యాంగమువలన పార్లమెంటుకు ప్రత్యేకాధికారము కలదని నిర్ణయింపబడిన ఇతరవిషయములు.

## ఆస్ట్రేలియాలోని రాష్ట్రీయప్రభుత్వవిధానము.

ఆస్ట్రేలియా రాజ్యాంగచట్టమున స్పష్టముగ కామన్వెల్తు (కేంద్ర) ప్రభుత్వమువారి కివ్వబడిన అధికారములుతప్ప తక్కిన అనిర్దిష్టాధికారము లెల్ల రాష్ట్రములప్రభుత్వములకుగల ఆ యా పరిపాలనములందే నిలుపబడియున్నవి. సంయుక్త రాజ్యాంగము నేర్పరచుటకుముందు రాష్ట్రముల కే యే ప్రభుత్వాధికారములు, ఏయేవిధ శాసనాధికారములు శాసనసభలు ధర్మపరిపాలనావిధానము లుండెనో అవియెల్ల క్రొత్త సంయుక్తరాజ్యాంగచట్టముయొక్క నియమములకు లోబడి, ఆయా రాష్ట్రముల కిప్పుడుకూడ కలవు. రాష్ట్రములయొక్క స్వాతంత్ర్యము, స్వేచ్ఛ, కాపాడబడి వర్తకముల ఎగుమతిని గూర్చిన నియమములు, ధర్మములు, ఇతరవిషయములను గూర్చి పరిపాలించుట కొక రాష్ట్రసమితిసంఘము నేర్పరుపబడెను. రాష్ట్ర మిష్టపడినచో తన యధికారములలో కొన్నిటిని కేంద్రప్రభుత్వమున కొసగవచ్చును.

---

# ౧౦

# ఐరిషుఫ్రీస్టేటు.

ఐర్లాండు బ్రిటీషుదీవులలో నొకటి. దీని వైశాల్యము 3౨,౦౦౦ చతురపుమైళ్ళు. జనసంఖ్య ౪3,౯౦,౦౦౦. ఇంగ్లీషువారు క్రీస్తుశకము ౧౧౬౯ ప్రాంతముల నీ దేశములోనికి దండయాత్ర కేగిరి. అప్పటినుండి ఐర్లాండు బ్రిటీషు పరిపాలనమున నున్నది. ఐర్లాండుదేశమువారు బ్రిటీషువారి యధికారమును తిరస్కరించి అనేకవిధములుగ స్వతంత్రము కొరకు పోరాడిరి. కాని లాభము లేకపోయెను. ౧౮౦౦ సంవత్సరములో చేయబడిన రాజ్యాంగచట్టమువలన ఐర్లాండుకు ప్రత్యేకశాసనసభను రద్దుచేసి ఆ దేశమును స్కాట్లాండు, ఇంగ్లాండు, వేల్సు దేశములతోపాటు బ్రిటీషుపరగణాగా చేసిరి. బ్రిటీషుపార్లమెంటుసభకు ఐర్లాండువారు నూరుమంది సభ్యుల నెన్నుకొనుటకు హక్కు నిచ్చిరి. ఐర్లాండువారు స్వతంత్రముకొర కెన్నోవిధముల పెనగులాడిరి. కాని లాభము లేకపోయెను. ఐరోపామహాసంగ్రామము జరుగుచుండగా ౧౯౧౬ లో ఐర్లాండులోని జాతీయవాదులు విప్లవము సాగించిరి. ఇదియే "సిన్‌ఫీన్" విప్లవము. దీనిని బ్రిటీషువా రణచివేసిరి. కాని సిన్‌ఫీన్ సిద్ధాంతములు అనగా ఐరిషువారు తమ ప్రత్యేకజాతీయతను, భాషను, నాగరకతను కాపాడుకొని స్వాతంత్ర్యము సంపాదింపదలచిన జాతీయవాదులపద్ధతి ప్రజలయందు బాగుగ వ్యాపించెను. బ్రిటీషు

పార్లమెంటున కెన్నుకొనబడు ఐరిషుప్రతినిధులలో సిన్‌ఫీన్ ప్రజాస్వామికజాతీయపక్షమువా రధికసంఖ్యాకు లెన్నుకొనబడుచుండిరి. ౧౯౧౮ వ సంవత్సరమున జరిగిన ఎన్నికలలో ౧౦౬ మందిలో ౭౩ మంది ఆ కక్షికి జెందిన జాతీయవాదులే. వీరు ౧౯౧౯ జనేవరిలో డబ్లిను నగరమున "డెయిల్" లేక జాతీయప్రతినిధులసభ యనుపేర సమావేశమై ఐర్లాండు దేశస్వాతంత్ర్యప్రకటనము గావించిరి. మంత్రులను నియమించుకొనిరి. ఈ జాతీయవాదులకు "డివాలెరా" గారు నాయకులైరి. ఈ డెయిల్‌సభను బ్రిటీషువారు నిషేధింపగ వారు రహస్యముగ కార్యాలోచనము చేయసాగిరి. ఈ సమయమున ఐర్లాండులోని కొందరుయువకులు "డేనియల్‌బ్రీన్" అనునాతని నాయకత్వమున ప్రభుత్వముతో యుద్ధము చేయదలచి పోలీసువారిని చంపుట, ఉద్యోగులను, అనుమానముకలవారిని సంహరించుట, దాడులు సలుపుట, ఇంకననేకవిధములుగ బ్రిటీషుపరిపాలనాభిమానులను భయపెట్టి హింసించు విధానమును మొదలిడిరి. ఇది రెండేండ్లవరకును తీవ్రముగ జరిగెను. దీనికి "ఆంగ్లఐరిషు" యుద్ధమని పేరువచ్చెను. ఇందు ౫౬౬ ఇంగ్లీషువారు మరణించిరి. ఐరిషువారును చాలమంది మరణించిరి. చాల ఆస్తి నాశనమయ్యెను. ఈ యుద్ధమునకు మొదట డెయిల్‌సభవారు తమ సమ్మతి తెలుపలేదు. కాని యుద్ధము సమాప్తి జెందుటకు ముందు ౧౯౨౧ సం॥ మార్చిలో తమ సమ్మతిని దెలిపిరి. ఐర్లాండువారిట్లనేకసంవత్సరములనుండి స్వతంత్రముకొరకు పోరా

డుచుండగ బ్రిటీషువారు కొంతరాజకీయసంస్కరణము గా పింపదలచి ౧౯౨౦ వ సంవత్సరములో ఐర్లాండురాజ్యాంగ చట్టమును చేసిరి. దీనివలన ఐర్లాండులో మొదటినుండి ఇంగ్లాండుపట్ల పక్షపాతము కలిగియున్న అల్స్టరుపరగణాను ౬ జిల్లాలుగ జేసి దానికొక స్వపరిపాలనావిధానమును, తక్కిన ౨౬ జిల్లాలు కలిసినపరగణా కొక స్వపరిపాలనావిధానము నొసగిరి. పరిపాలనము ఐర్లాండువారి హస్తగతముచేసినట్లు ప్రకటించినను పన్నులను విధించుఅధికారముమాత్రము బ్రిటీషుపార్లమెంటువారి హస్తములందే యుండెను. అల్స్టరువా రీరాజ్యాంగసంస్కరణమున కంగీకరించిరిగాని దక్షిణ ఐర్లాండువా రంగీకరింపలేదు. ౧౯౨౧ సంవత్సరము మే నెలలో క్రొత్తచట్టముప్రకారము ఎన్నికలు జరిగెను. దక్షిణఐర్లాండులో అన్ని ఫిర్కాలలోను ప్రజాస్వామికపక్షమువారే ప్రతినిధులుగ నెన్నుకొనబడిరి. ఉత్తరఐర్లాండులో కూడ కొంతమంది ఆపక్షమువారు వచ్చిరి. ఆంగ్లఐరిషుయుద్ధమున విప్లవకారులు చేయుచున్నదుండగముల నణచుటకు బ్రిటీషు వారు చేసినతీవ్రచర్యలవలనను, అత్యాచారముల వలనను ఈ సమయమున ప్రజలకు బ్రిటీషుపరిపాలనముపట్ల అసంతృప్తి హెచ్చెను. ప్రజాభిప్రాయము తీవ్రమయ్యెను. విప్లవకారుల పట్ల సానుభూతి కలిగెను. ఇదియెల్ల చూచి అప్పటి బ్రిటీషు ప్రధానామాత్యుడు ఐర్లాండుతో సంధిచేయుట యుక్తమని గ్రహించి జూలై ౧౯౨౧ లో జాతీయవాదులనాయకుడైన డివాలెరాగారికి సంధికబురు లంపెను.

అంతట ౧౯౨౧ ఆగస్టు ౧౬ తేదిన ఐరిషు ప్రతినిధుల రెండవ 'డెయిల్ ఇరెయిన్'సభ డబ్లినుభవనమున సమావేశ మయ్యెను. అందులోనిసభ్యు లెల్లరు ప్రజాస్వామికము నంగీ కరించుచు ప్రమాణముల జేసిరి. డివాలెరాగారు అధ్యక్షులైరి. మొదట ఆయన లాయిడుజార్జిగారితో రాయబారమును జరిపిరి. కాని తరువాత ఆర్థరు గ్రిఫిత్ గారును, మైకేల్ కొలి న్సుగారును జరిపిరి. ౧౯౨౧ డిశంబరు ౬ వ తేదిన సంధిషర తులు ప్రకటింపబడెను. ఈ షరతులకు డివాలెరాగారు తమ అసమ్మతిని వెలిబుచ్చిరి. డెయిల్ సభలో వాగ్వాదము ౧౯౨౨ జనేవరు ౭ వరకును జరిగెను. సంధిని అంగీకరించు తీర్మాన మునకు ౫౭ గురు ప్రతికూలురు, ౬౪ మంది అనుకూలురు నైరి. డివాలిరాగారు అధ్యక్షపదవికి రాజీనామా నిచ్చిరి. ఆర్థరు గ్రిఫిత్ గారు అధ్యక్షులైరి. బ్రిటీషుపార్లమెంటువారు ౧౯౨౧ డిశంబరు ౬ వ తేదిననే సంధికి అంగీకరించి యుండిరి. అంతట ౧౯౨౨ జనేవరు ౧౫ తేదిన క్రొత్తరాజ్యాంగ మమ లులోనికి వచ్చెను. సంధికి వ్యతిరేకులు రాజ్యాంగనిర్మా ణసభకు హాజరుకాకుండ నిలిచిపోయిరి. క్రొత్తప్రభుత్వము నకు "మైకేల్ కొలిన్సు" ముఖ్యు డయ్యెను. డివాలెరాపక్ష మువారు క్రొత్త ప్రభుత్వపక్షముతో పోరాడసాగిరి. కొన్ని నెలల వరకు అశాంతి కలిగెను. ప్రజాస్వామికపక్షము వారి ననేకులను బంధించిరి. కొందరి నురదీసిరి. తుదకు శాంతి కలిగెను. ప్రజాస్వామికపక్షమువారు రాజ్యాంగ మున వ్యతిరేకపక్షముగ చేరి ఆందోళనము చేయుచుండిరి.

అట్లు ౬-౧౨-౨౧ తేదీన బ్రిటీషువారికిని ఐరిషు ప్రతినిధులకును జరిగినసంధిప్రకారము ౧౫-౧-౨౨ తేదీన ఐరిషు ఫ్రీస్టేటున క్రొత్త రాజ్యాంగము నిర్ణయింపబడి బ్రిటీషుడొమినియనుగ నంగీకరింపబడెను. ఐరిషు ఫ్రీస్టేటు నాలుగు రాష్ట్రములు. దీని జనసంఖ్య ౨౯,౭౨,౮౦౨. విస్తీర్ణము ౨౬,౬౦౦ చతురపుమైళ్ళు. ౧౯౨౩లో ప్రపంచ రాజ్యమండలియగు లీగాఫ్ నేషన్సులో సభ్యురాలిగ చేయబడెను. అందువలన స్వతంత్రరాజ్యముల కుండుగౌరవము కలిగెను. బ్రిటీషు ఐరిషు దేశముల మధ్యజరిగిన సంధిషరతులవలన ఐరిషుఫ్రీస్టేటులోని నౌకాశ్రయములందు బ్రిటీషువారికి కొన్నిహక్కు లుంచుకొనబడెను. యుద్ధసమయములందు బ్రిటీషువారికి కొన్ని సౌకర్యము లొసగబడెను. బ్రిటీషువారు చేసియుండిన ఐరిషుజాతీయఋణములో ఐరిషుఫ్రీస్టేటు యెంత భరించవలసినది, మధ్యస్థులవలన నిర్ణయింపబడునట్లు ఏర్పాటు చేయబడెను. అల్స్టరు విడిపోయినచో దేశముయొక్క సరిహద్దు లొక ఉపసంఘము నేర్పరచి నిర్ధారణపరచునట్లు నిర్ణయింపబడెను. ఐరిషుఫ్రీస్టేటు వ్యవసాయదేశము. బ్రిటీషుదేశములోని పన్నులవిధానము నవలంబించుట మూలముగనే సాలుకు ౨౫౦౦,౦౦౦ పౌనుల ఆదాయము వచ్చినది. ఐర్లాండుయొక్క సంరక్షణమున కొరకు రాగిపైన ఖర్చు చేయవలసిన పనిలేదు. ఒక సైనికుడైన ఐర్లాండున కవసరములేదు. సైన్యవ్యయమును ఇంగ్లాండే భరించవలసిన ఆవశ్యకత కలిగినది. సరిహద్దుల తగాదానుగూర్చి వచ్చిన పేచీ పరి

ష్కరించుకొనుసందర్భములో జాతీయఋణములో ఐరిషు ఫ్రీస్టేటు ఏమీ భరించుకోనక్కరలేదని రాజీపడిరి. ఇట్లు ఐరిషు ఫ్రీస్టేటు శుభప్రదమగు పరిస్థితులలో జీవయాత్ర మొదలిడెను.

## రాజ్యాంగము.

స్వతంత్రరాజ్యముల సమ్మేళనమగు బ్రిటీషుసామ్రాజ్యమున ఐరిషుఫ్రీస్టేటు తక్కినవారితో సమానగౌరవము గల సరిసమానభాగముగ నున్నది. ఐరిషుఫ్రీస్టేటుయొక్క రాజ్యాంగవిధానము, ఐరిషుప్రతినిధులసభవారు ౧౯౨౨ లో సమావేశమై నిర్ణయించిన నిబంధనలపై నాధారపడిన లిఖితమూలమగు రాజ్యాంగచట్టమునుబట్టి నిర్ణయించబడి యున్నది. ఐర్లాండునకును, ఇంగ్లాండునకును మధ్య జరిగిన సంధిషరతుల ననుసరించియే రాజ్యాంగచట్టముయొక్క నిబంధనలను అన్వయము చేయవలయుననియు ఆ నిబంధనలలో నేవైన సంధిషరతులకు భిన్నముగగాని అన్వయముచేయుటకు వీలులేనట్లుగాని ఉన్నచో అవి చెల్లకూడదనియు రాజ్యాంగచట్టముననే స్పష్టీకరింపబడినది. ఈ రాజ్యాంగ, మాచరణలోనికి వచ్చునాటి కమలులో నున్న చట్టములు, రాజ్యాంగముయొక్క ఉద్దేశములకు వ్యతిరేకములు కానంతవరకు పార్లమెంటువారి ఉత్తర్వులకు లోబడి ముందుకూడ అమలులో నుండును.

బ్రిటీషురాజ్యములసమ్మేళనమునందు తక్కినరాజ్యములవలెనే ఐరిషు ఫ్రీస్టేటులోను కార్యనిర్వహణాధికారము రాజుగారియందు నెలకొల్పబడినది. కెనడా రాజ్యమునందువలెనే రాజప్రతినిధిగ ఒక గవర్నరుజనరలు నియమింప

బడును. బ్రిటీషు దేశముయొక్క రాజునకువలెనే గవర్నరు జనరలునకును అధికారము లెల్ల నియమితములై యున్నవి. రాజ్యకార్యములందెల్ల పరిపాలక లేక కార్యనిర్వాహక సంఘముయొక్క సలహాను పొందియే అతడు ఉత్తరువులను జేయును. కార్యనిర్వాహకసంఘమందు ౫ గురకు తక్కువ కాకుండగను ౧౨ గురకు ఎక్కువ కాకుండగను సభ్యులుందురు. వీరే మంత్రులు. వీరు ప్రజాప్రతినిధుల సభయగు 'డెయిల్ ఇరెయన్'కు బాధ్యత కలిగియుందురు. డెయిల్ సభలోని అధికసంఖ్యాకులసహాయముపైననే వీరిపదవు లాధారపడి యుండును.

కార్యనిర్వాహకసంఘముయొక్క సలహాపైనగాని డెయిల్ ఇరెయిన్ సభను (మత్తరబు) విచ్ఛిన్నము చేయరాదు. రాజ్యాంగచట్టముయొక్క ౫౩వ నిబంధన ప్రకారము డెయిల్ ఇరెయన్ సభలోని బహుసంఖ్యాకుల విశ్వాసమును గోల్పోయిన కార్యనిర్వాహకవర్గమువారి సలహాపైన "ఓయిరియాక్టను" పార్లమెంటును విచ్ఛిన్నము జేయరాదు. ఒక పార్లమెంటు ౬ సంవత్సరముల వరకు అమలులో నుండును. కార్యనిర్వాహక సంఘముయొక్క అధ్యక్షుని డెయిల్ ఇరెయిన్‌సభయె నియమించును. ఆ యధ్యక్షుడు తక్కిన కార్యనిర్వాహకసంఘసభ్యులను పేర్కొనును. పరిపాలకసంఘములో సభ్యులుకాని ఇతరమంత్రులు, డెయిల్ ఇరెయిన్ సభయొక్క ఉపసభ వారిసలహాపైన నియమింపబడుదురు. ఆ మంత్రులు తమ తమ శాఖలక్రమపరిపాలనకు "డెయిల్"

సభకే స్వయముగను సమష్టిగను కూడ బాధ్యత వహించి యుందురు. కార్యనిర్వాహకసంఘసభ్యు లెల్లరు డెయిల్ ఇరెయిర్‌లో సభ్యులుగ నుండవలయును. తక్కినమంత్రులు డెయిల్‌లో సభ్యులుగ నుండనక్కరలేదు.

శాసననిర్మాణాధికారము: ౧ రాజు, ౨ డెయిల్ ఇరెయిర్ అనగా ప్రతినిధులసభ, 3 'సియానద్ ఇరెయిర్' అనగా సెనేటుసభ, కలిసిన "ఓయిరియాక్టస్" లేక పార్లమెంటులో ఐరిషుఫ్రీస్టేటుయొక్క శాంతికి క్రమపరిపాలనకు సత్పరిపాలనమునకు వలసిన శాసననిర్మాణాధికారము నెలకొల్పబడియున్నది. బ్రిటీషురాజ్యాంగమునందువలెనే ఐరిషుఫ్రీస్టేటులోను పార్లమెంటు సర్వాధికారములు కలిగిన రాజ్యాంగము.

"సియానద్ ఇరెయిన్" లేక సెనేటుసభ: దీనిలో ౬౦ మంది సభ్యు లుందురు. ఒక్కొకసభ్యుడు పండ్రెండు వత్సరములవరకు సభ్యుడుగ నుండవచ్చును. సభలో నాల్గవవంతు సభ్యులు మూడేండ్ల కొకమారు ఫ్రీస్టేటు దేశములోని ప్రజలవలన (ప్రపోర్షనల్ రిప్రెజెంటేషన్) "సమప్రమాణ ప్రాతినిధ్య" పద్ధతిప్రకార మెన్నుకొనబడుచుందురు. ఎన్నిక జరిగినప్పు డెల్ల ఖాళీలకు కావలసినసభ్యులసంఖ్యకు మూడు రెట్లసంఖ్యగల అభ్యర్థులపేర్లుగలజాబితా యొకటి తయారు చేయబడును. ఈజాబితాలో రెండువంతులు డెయిల్‌సభవారును, మూడవవంతు సెనేటుసభ వారును పేర్కొందురు. వారి కిష్టమున్నచో ప్రాతసెనేటుసభ్యుల పేర్లుకూడా చేర్పవచ్చును. అభ్యర్థులకు 3౫ వత్సరములప్రాయ ముండవల

యును. దేశమున కుపకరించుప్రజాసేవ చేసి రనుకారణమున గాని జాతీయజీవనమున నేదైన ముఖ్యమగు వ్యవస్థకు ప్రతినిధు లనికాని ఏదైన గొప్పతనమును విద్యాకౌశలమును సంపాదించి రనిగాని తోఁచినవారినే అభ్యర్థులుగ పేర్కొందురు. సెనేటుసభలో మధ్యమధ్య వచ్చుఖాళీలను సెనేటు సభ్యులె తాత్కాలికముగ పూరింతురు. అట్లు నియమింపబడిన సభ్యులు మరుసటిఎన్నికలలో తొలగిపోవుచుందురు.

"డెయిల్ ఇరెయిన్" ప్రజాప్రతినిధులసభ:—డెయిల్ ఇరెయిన్ సభలో శాస్త్రప్రకారము నిర్ణయింపబడిన నియోజక సమూహములవలన సమప్రమాణ ప్రాతినిధ్యపద్ధతిప్రకారము తిన్నగ సభకు ఎన్నుకొనబడిన సభ్యులుందురు. ఇందు ౧౫౩ సభ్యు లుండునట్లు నిర్ణయించిరి. సభ్యులసంఖ్య మారవచ్చును గాని ౨౦ వేల నియోజకుల కొకసభ్యునికన్న ఎక్కువ ప్రతినిధులుగాని ౩౦ వేల వోటరుల కొక సభ్యునికన్న తక్కువ ప్రతినిధులుగాని ఉండునట్లు మార్పబడరాదు. ఇదిగాక దేశములోని రెండు విశ్వవిద్యాలయములకు నొక్కొకదానికి ముగ్గురు ప్రతినిధుల నెన్నుకొను హక్కు కలదు. ౨౧ సంవత్సరములు వయస్సుకలిగిన స్త్రీపురుషు లెల్లరు ఎన్నికనిబంధనలకు లోఁబడి డెయిల్ ఇరెయిన్ సభ్యుల నెన్నుకొనుటకు (వోటు)హక్కు కలిగియుందురు. అట్లే ౩౦ సంవత్సరముల స్త్రీపురుషులు సెనేటుసభ్యుల నెన్నుకొను హక్కు కలిగియుందురు. సమ్మతులు (వోట్లు) రహస్యముగ నీయవలయును. ఒక్కొక్క నియోజకుడు ఒక్క ఎన్ని

కలో ఒక సమ్మతిమాత్రమే ఇవ్వవలయును. రెండు శాసన సభలలోని సభ్యులకును వారి వ్యయములకొరకు సాలుకు 3౧౦ పౌనుల వేతన మీయబడును. పార్లమెంటుసభ్యులీదిగువ ప్రమాణము జేయవలయును. *"స్వతంత్రబ్రిటీషు రాజ్యముల సమ్మేళనమున బ్రిటీషు దేశముతో పాటు భాగస్థురాలుగనున్న ఐర్లాండు దేశముయొక్క పౌరహక్కును గలిగియుండుటనుబట్టి శాస్త్రప్రకారము స్థాపింపబడిన ఐరిషుఫ్రీస్టేటురాజ్యాంగమునకు లోబడియుందుననియు, విశ్వాసము కల్గియుందుననియు, ప్రమాణము చేయుచున్నాను. మరియు పంచమజార్జిరాజుగారి పట్లను ఆయనవారసులపట్లను విశ్వాసము కలిగియుందును."

సెనేటుసభయొక్క అధికారములు: "సియానదు ఇరెయిన్" సభ (ఆర్థిక) ద్రవ్యసంబంధవిషయములనుగూర్చిన చిత్తుచట్టములకు మార్పులు చేయుటకు వీలులేదు. కాని ద్రవ్యసంబంధవిషయమునకు సంబంధించిన దని డెయిలు అధ్యక్షునిచే నిర్ణయింపబడి, డెయిల్ ఇరెయిన్ సభవలన తీర్మానింపబడిన ౨౧ దినములలోపుగా దానినిగూర్చి ఏమైన సలహాల నివ్వవచ్చును. ఆర్థికచట్టమునకు ఇంగ్లీషుపార్లమెంటు చట్టములో జెప్పబడిన నిర్వచనమే ఐరిషుఫ్రీస్టేటు రాజ్యాంగమునను ఉదాహరింపబడినది. డెయిల్ ఇరెయిన్ సభాధ్యక్షుడు, ఏ చిత్తుచట్టమునైనను ద్రవ్యసంబంధవిషయమైనదని నిర్ణయించినతీర్మానముపైన ముగ్గురు డెయిల్సభ్యులు

---

* ౧౯33 సం॥ రములో ఐరిషుఫ్రీస్టేటువారొకచట్టముచేసి దీనిని రద్దుచేసినారు. (౧౧-౭-3౧)

ముగ్గురు సెనేటుసభ్యులు ఒక సుప్రీముకోర్టు న్యాయాధిపతియు గల ఉపసంఘమువారికి ఉపర్యభియోగముచేసి వారితీర్మానమును బడయవచ్చును. తక్కినచట్టముల నెల్ల సెనేటుసభవారు మార్చవచ్చును. లేక నిరాకరింపవచ్చును. ఏ చిత్తుచట్టము నైన తమసభలోనే మొదట ప్రతిపాదింపవచ్చును. డెయిల్ ఇరెయిర్ సభవారు తీర్మానించిన శాసనము సేనెటు సభవారి కంపబడిన ౨౭౦ రోజులలోగా దానికి సెనేటు సభవారామోదము తెలుపుచు తీర్మానింపనియెడల నా శాసన ముభయ సభలవలన అంగీకరింపబడినట్లే యెంచబడునను నిబంధన యొకటి కలదు. ఇందువలన సెనేటుసభవారే శాసనమునైనను త్రొక్కిపెట్టియుంచుటకు వీలులేకుండ పోయినది. అట్లంగీకరింపబడిన శాసనమును తాత్కాలికముగ నిలుపుదల చేయవలసిన దని డెయిల్ సభలో ౨/3 వంతులు మందికాని సెనేటుసభలోని అధిక సంఖ్యాకులుగాని కార్యనిర్వాహకసంఘాధ్యక్షునికి లిఖితమూలముగా 2 దినములలోగా తెలిపినచో నది ౯౦ రోజులవరకు అమలు జరుగకుండా నిలుపుదలచేయబడును. ఈలోపుగ వోటరులలో ౧/౨౦ వంతుగాని సెనేటులో 3/౫ వంతుల సభ్యులుగాని కోరినచో నా శాసనమును ప్రజాభిప్రాయపరీక్షకు (Referendum) పంపవలెను. ఈ నిబంధనలు ఆర్థికచట్టములకు వర్తింపవు. దేశక్షేమముకొరకు ఆరోగ్యముకొరకు శాంతికి నావశ్యకములని ఉభయసభలవారు నభిప్రాయపడుచట్టములకు నీ నిబంధనలు వర్తింపవు.

రక్షక సైన్యము:—సైన్యమును సృజించి భరించునధికారము "ఓయిరియాక్టసు" పార్లమెంటునకు మాత్రమే కలదు. అయితే బ్రిటిషుజనసంఖ్యకు ఐర్లాండు జనసంఖ్యకును గల తారతమ్యమును బట్టియే సైన్యముయొక్క సంఖ్యయు నుండవలయునని బ్రిటీషువారికిని ఐర్లాండువారికిని జరిగినసంధిలో నిర్ణయింపబడియున్నది.

ధర్మపరిపాలనము:- ఐరిషు ఫ్రీస్టేటుపార్లమెంటువారు నిర్మించిన న్యాయస్థానములందే న్యాయపరిపాలనాధికారము కలదు. ప్రాథమిక న్యాయస్థానములలో హైకోర్టు చేరును. దీనికి సివిలు క్రిమినలు అధికారములు కలవు. దేశధర్మములయొక్క సశాస్త్రీయతనుగూడా హైకోర్టు తీర్మానించును. న్యాయాధిపతు లందరు స్వతంత్రులు. ధర్మశాస్త్రమునకును రాజ్యాంగమునకును మాత్రము బద్ధులై యుందురు.

సుప్రీముకోర్టు (పరమోన్నతన్యాయస్థానము):- ఐరిషు ఫ్రీస్టేటులోని న్యాయస్థానములతీర్పులపైన ఉపర్యభియోగములపై కడపటితీర్మానము నొసగు ఉన్నతన్యాయస్థానము సుప్రీముకోర్టు. దాని తీర్పుల నేన్యాయసభయు అధికారులును విమర్శింప వీలులేదు. కాని ఎవరైనను సభాయుతుడగు నృపాలునికి ప్రత్యేక ఉపర్యభియోగము చేసుకొనుటకుగాని అట్టి యనుజ్ఞను నృపాలు డిచ్చుటకుగాని రాజ్యాంగమున నేయడ్డంకియు లేదు.

